త్రిలు చదువుటయేగాక, ప్రత్యక్షముగ చూచుచున్నాము. ఇక మాంస భక్షణవల్ల, జంతు హింసలవల్ల, ఎట్టి ఘోర పాతకములు సంభవించునో ఆలోచింపవలెను. జీవహింస నుండి తప్పించుకొనుటకు మనము ఎంత ప్రయత్నించుచున్నను వీలుగాక, నడచునప్పుడు, ఆహార పదార్థములు నిల్వయుంచి నప్పుడు, గృహకృత్యములందు, వ్యవసాయ పనులందు ఎన్నియో సూక్ష్మ జీవులు చచ్చుచున్నవే? ఈ పాతకము చాలక, క్రూరకృత్యములను వర్జించుటకు వీలుండియు, రక్షింపగల శక్తి కలిగియు, జిహ్వారుచికని, వినోదములకని, మందులకని, ప్రయోగములకని, పందెములకని, అనవసరముగ, బుద్ధిపూర్వకముగ, చేతులారా జీవులనన్నిటినీ హత్య చేయుటయందే గొప్ప కసరత్తు చేయుచున్నారు. ఇట్టివారు ఎన్ని జన్మలకైనను సుఖములొందుట కల్ల. ఉత్తమజన్మ లెత్తుట సున్న. ఏనాడు జంతుహింసలు, మాంస భక్షణ మానెదరో ఆనాటినుంచియే ఉత్తమజన్మ లెత్తగల సాధన మార్గములోనున్నట్లుగా నెంచబడుదురు.

(1) శరీరపోషణకొరకా వలసినసమస్త విటమినులనిచ్చి ఆరోగ్యముతో కాపాడగలశక్తి శాకాహారమువల్లనే లభించు చున్నదనియు, మాంసాహారము అనేక రోగముల నుత్పత్తి చేసి, అనారోగ్యము కల్గించుననియు. ఆరోగ్య శాస్త్రము శాసించుచున్నది.—

(2) దేహపుష్టికి రోగ నివారణామునకు మాంస భక్షణ అవసరము లేదని సాధుజీవులు దాఖలా చూపుచున్నవి.

(3) బలపరాక్రమములలో దేశఖ్యాతి గాంచిన వారు శాకాహారులలోనే వున్నట్లు చారిత్రా పత్రికలు చాటుచున్నవి.

(4) కండకు కండ ఎదురువేస్తేనే గాని, వ్యవసాయ పనులు చేయుటకు వీలులేదేమో ననుకొన్న, పశువులు బుద్ధి చెప్పుచున్నవి.

ఎటువంటి వాంఛలు నెరవేర్చుకొనుటకు మాంసము తినుచున్నారో, అటువంటి వాంఛలన్నియు, సాత్త్విక పదార్థములవల్లకూడా లభించుటను ప్రత్యక్షముగ కాంచుచుండియు, మాంసపు భోజనమునకే ఆరాటపడుట, మాంసభక్షక జంతు జన్మలు కావలెనని యత్నించుచున్నవారగుదురు. మాంసభక్షణవల్ల ఏదోషమురాదని బోధించునట్టి శాస్త్రము లున్నను, మాంస భక్షణ మహా పాతకమని వాదించునట్టి శాస్త్రములుకూడ యున్నవి. ఏ జీవిని చంపకుండనే ఈ శరీరమును పోషించుకొనుటకు అనేకమైన పదార్థములుండ వీటిని వదలి, క్షణ సౌఖ్యమునకై జిహ్వారుచికోరి, "మనవలెనె జీవించుటకు తిప్పలుపడుచున్న జంతువులను బలవంతముగా వధించి, వాటిని తినుట" పాపకృత్యమే యగును. పాపభూయిష్టమైన మాంస భక్షణాభిలాషను ఛేదించివేసి, యితర పదార్థములతో జీవించుచు, సాధు జంతువులకైనా అభయదానము (చంపకుండుట) యిచ్చి సుకృత ఫలము ఏల సంపాదించుకొనగూడదు? దమ్మిడి ఖర్చులేకుండా పుణ్యమును (ప్రాణదానమును) సంపాదించుకొనగల అవకాశము లభించియు, ఈఅవకాశము విడిచి పేయువారు, ఎన్ని జన్మలకైనను

సుఖములొందుట కల్ల. మానవజన్మ నిచ్చినందుకు 'సాధు జంతువులకైన హానికలిగించకుండ, జీవయాత్ర గడుపుకొనుట "కష్ట సుఖములు తెలిసినట్టి మానవులకు" ప్రథమ కర్తవ్యమని తెలుసుకొనవలెను.

(1) జూదమువల్ల, దొంగతనము వల్ల. ధనము సంపాదించుటకు అవకాశమున్నను, ఏ ఉద్దేశముతో, యీ పద్ధతి న్యాయమైనది కాదని త్రోసివేసి, తక్కిన మార్గములద్వారా ధనము గడించుకొనుము. పై పద్ధతు లవలంభించువారిని నిషిధముగ ద్వేషించుచు, శిక్షించుచున్నారో, అదే విధముగ మాంస భక్షణవల్ల మీవాంఛలు తీర్చుకొనుటకు వీలున్నను, 'మానవులవలె జీవింప నిచ్చగించుచున్న మూగజీవులను భక్షించుట న్యాయమైన పద్ధతి కాదని ఎంచి" మాంసభక్షణాదులను త్రోసివేసి, తక్కిన పదార్థములద్వారా, మీవాంఛలను తీర్చుకొనుటకు కృషిచేయాలి. శిక్షించువారు లేరని మూగజీవులను భక్షించుట, మానవజన్మమెత్తినవారు చేయవలసిన కృత్యము కాదు.

(2) కామమును తీర్చుకొనుటకై భార్యతో రతిసల్పుచున్నారుగాని, తల్లితోను, అక్కచెల్లెండ్రతోను, క్రీడించుట లేదు. అట్లాగే ప్రజల పోషణకై భగవంతునిచే ప్రసాదింపబడిన శాకాహారముతోనే జిహ్వను తృప్తిపరచవలెగాని, రక్తపుకూటికి ఆసించి "నీవలెనె చిరకాలము బ్రతుకవలెనను ధ్యాసతోనున్న" మూగజీవులను వధింప ఒడిగట్టవద్దు.

(3) తియ్యని మిఠాయిని ఆరగించుచుండు ఈగలు, తమ కొంపమునిగి పోయినట్లు వచ్చి, అశుద్ధముమీద వ్రాలి నట్లుగానే, షడ్రసోపేతమై, పంచభక్ష్య పరమాన్నములతో గూడి, పరిశుభ్రమైన, ఆరోగ్యకరమగు సాత్వికపదార్థము లను వదలి, ఉచ్చ, పెంట, చీము, నెత్తురు, శుక్లశోణిత ములతోగూడి, హేయమై, చీదరపుట్టించు, నీచాతినీచమైన మాంసమును తినుటగూడ అంతియే యగును.

(4) మానవుడు చచ్చినచో పీనుగగుటంజేసి, అపవి త్రముగ నెంచి, అసహ్యపడి, స్మశానములో పూడ్చుచు న్నారు. అదే విధముగ జంతువుల ప్రాణము తీసినపిదప, జంతు కళేబరములు మాత్రము పీనుగులు కావా? అట్టిపీనుగు లను తినుటకాశించు మానవులు నక్కలా? కుక్కలా? గద్దలా? రాబందులా? స్మశానములో పూడ్చవలసిన శవ ములను మీకడుపులోపూడ్చి, స్మశానోదరులగుచున్నారు. ఎంత వింత? ఎంత అసహ్యము?

(1) మాంసమును తినువారలు మానవరూపములో నున్న రాక్షసులని చెప్పబడుదురు.

4 అశ్వా 297 అనుశాసనీకం.

(2) అన్య జంతువులయొక్క మాంసముచేత తన మాంసమును వృద్ధిపొందించువారు క్రూరులని నిర్ణయింపబడు దురు.

(3) తనదేహంబునకై పశుపక్షి మృగాదులను వధించువారు దుర్జనులని చెప్పబడుదురు. భాగవతం 1 స్కం. 165

(4) మృదుల పక్వాన్న భోజనమునుమాని, మాంసమును తినువారు, పాపాత్ములని చెప్పబడుదురు .11స్కం. 74

(5) మాంసము తినువారికి నరకము కలుగును.

1 స్కం. 156

(6) సకల దోషములకు నివాస స్థానమైన మాంసము నందు, సద్గుణములను మూఢులగువారు చూతురు.

భారతం. అనుశాసనీకం 115 అధ్యా.

(7) మాంసమును భుజించువారికి కలుగునట్టి ప్రీతి క్షణికము. ఆ మాంసమును సంపాదించునపుడు జంతువులు మరణము పొందుచున్నవి. గాన మాంసముయొక్క దుష్టతనము ప్రత్యక్షముగ కనబడుచున్నది.-

(8) ప్రాణులను హింసచేయకుండ, మాంసమెందును రాదు. ప్రాణహింస నరక హేతువు. కాబట్టి మాంసభక్షణ విడువవలెను. 5 అధ్యా. 48 మనుస్మృతి.

ఇంకను అనేక మార్గములు గలవు.

(1) మాంసముయొక్క పుట్టుకయు, ప్రాణులయొక్క మరణ బంధములను, చక్కగా యోచించి చూచి, మాంసము తినుట మానవలెను. 49 మనుస్మృతి 5 అధ్యా.

(2) ఉత్తముడగువా డితర జంతువులను చంపి, వాటి మాంసముచేత, తన పొట్టను నిండించుకొనడు.

భారతం 115 అధ్యా. అనుశాసనీకం.

(3) ఏ మానవుడు పుట్టినది మొదలుకొని, మధు మాంసములను, మత్స్యములను భుజించకయుందురో, అట్టివా రందరును, మునిశ్రేష్ఠు లనబడుదురు.

(4) ఏ పుణ్యాత్ముడు సప్త సముద్రములతో గూడిన భూమిని, దానము చేయునో, అట్టివానికిని, మాంస భక్షణ వర్జించినవానికిని, సమమైన ఫలమును నొందుదురు.

(5) మాంస భక్షణ వర్జించువాడు విమానమునెక్కి దివ్య స్త్రీలతో సేవింపబడుచు, స్వర్గమున సదా సంతోషముగ నుండును.

(6) మాంస భక్షణ మానివేయుటకంటె, అశ్వమేధ యాగముకంటె నెక్కువ పుణ్యము లభించును

అనుశాసనికం, 4 అశ్వ. 290.

(7) నూరు సంవత్సరములు తపస్సుచేసినవానికిని, మాంసభక్షణవర్జించినవానికిని, సమాన ఫలమునొందుదురు. 299

(8) మాంసము తిననివారికి, బ్రహ్మాదిలోకములు, సులభముగ లభించును. 300

(9) మాంసమును తినేవాడు. మాంస భక్షణ మానుకొన్న, దేవత సమానుడగును. 293

(10) ఆయురారోగ్య ఐశ్వర్యములు కోరువారు, మాంసము తినరాదు. 296

(11) మాంసభక్షణ నిషేధనకు మించిన, సత్కార్యములు, దానధర్మములు లేవు. 306

(12) అధిక సౌందర్యము కోరువారు, మాంసభోజనము మానవలెను. 5 అశ్వ 93.

(13) దేశకాల ప్రాప్త కందమూలాది ఫలములను, హరికి నివేదించుచు, శ్రద్ధతోడ తగిన వారికి అన్నము పెట్టిన అక్షయ ఫలము కలుగును. ధర్మ మార్గమున వర్తింపదలచు వారు, శ్రాద్ధంబులందు, మాంస ప్రదానంబు సేయక, భక్షింపక, చరింపవలయు. ప్రాణిహింసచేయక వర్తించుట కంటె, మిక్కిలి ధర్మ మార్గము లేదు. 7 స్కం. 455.

(14) మాంసము తినరాదు. యజుర్వేదము.

(15) ఎవడు మాంసమును, గ్రుడ్లను భక్షించునో. వానిని శిక్షించవలెను.

అథర్వేదము కాం. 8 అను 2సూ. 6మం 27.

(16) ఎవరు మాంసమును వర్జించి, శుద్ధాన్నమును భుజింతురో, వారు శ్రేష్ఠులు.

ఋగ్వేదం. మం. 1 అష్టక 2, సూ. 162. మంత్ర. 12.

(17)కలియుగములో మాంసముతో శ్రాద్ధము పెట్టరాదు. వృద్ధ పరాశర స్మృతి

(18) ఖ్యాతిగాంచిన పూర్వపు రాజు లెవ్వరును మాంసమును తినలేదు. భారతం అను. 115

(19) సదా మాంసమును తిననివారిని మాత్రమే, కరుణాత్ములుగ, ధర్మాత్ములుగ చెప్పుదురు.

భారతం అనుశాసనీకం 115 అధ్యా.

(20) ఆపదలు, వ్యాధులు, హీనజన్మలు నొల్లని వారు, యావజ్జీవము నే మాంసమును తినరాదు.

మాంస భక్షణ నిషేధనగూర్చి యింకననేక శాస్త్రములు బోధించుచున్నవి. మాంసము చెట్లనుండి, రాళ్ళనుండి లభించుటలేదు. జంతువులను చంపనిదే మాంసము రాదు. జంతువులను చంపునప్పుడు అవి ఏవిధముగ బాధపడుచున్నవో కళ్ళారచూచుచున్నారు. క్షణ సౌఖ్యము నివ్వగల జిహ్వా రుచికై 'ఏ బాధలు లేకుండ, నీవలెనే, జీవింప నిచ్ఛగించుచున్న జంతువులను చంపుట' బాధలు తెలిసినట్టి మానవులు చేయవలసిన పనులుకావు. జంతువులను చంపకుండనే జిహ్వా రుచిని తీర్చుకొనుచు, ఆకలి బాధలు బాపుకొనుటకు అనేక పదార్థము లుండగా, జంతుహింసలకు పాల్పడుట దుర్మార్గమేయని శాస్త్రములన్నియు ఖాయపరచినవి. గాన ఏనాడు మానవుడు జంతుహింస, మాంస భక్షణాది క్రూర కృత్యములను వర్జించునో, ఆరోజునుంచే తాను మానవ జాతికి చెందినవారుగ నెంచబడుదురు.

మానవుల బ్రతుకంతయు, పశువుల సాహాయ్యము మీదనే ఆధారపడియున్నది. వాటి సాహాయ్యము తిరస్కరించిన మానవుడు ఏకొండ గుహలలోనో తప్ప, ప్రపంచములో నుండడు.

కృత్రిమ ఎరువులవల్ల, కృత్రిమ పాలు, పెరుగు, నెయ్యివల్ల, ఎన్ని రోగములు కల్గుచున్నవో మీరు ప్రత్యక్షముగ చూచుచునేయున్నారు.



ఓం శ్రీరామాయనమః



# విజ్ఞప్తి.

ఈ గ్రంథమాలయొక్క ముఖ్యోద్దేశముల ప్రకారము ప్రచారము చేయ సంకల్పించినాము. విరాళములతరగతులలోని 1, 2, 3. నెంబర్ల తరగతులలో దాత లెవరైన చేరదలచిన మాకు తెలియపరచిన అట్టివారిని దర్శించిగాని, ఉత్తరముల ద్వారాగాని అన్ని విషయములు విశ్లదీకరించగలము. 1, 2, నెంబర్ల చందాలు పూర్తియగువరకు, వాగ్దానముచేసిన దాతల పేర్లు అప్పుడప్పుడు వార్తాపత్రికలలో ప్రకటించబడుచుండును. 1, 2. నెంబర్ల దాతలు వాగ్దానము చేసే యెడల రు 116 లు [illegible]ద్యాన్ను పంపవలయును. ఏ కారణముచేతనైనా సదరు కార్యక్రమము ఆగిన, ప్రకటన వగైరాలకు అయిన ఖర్చుపోను మిగిలిన ధనమును బయానా యిచ్చిన దాతలకు వాపసివ్వబడును. దాతలు యిచ్చే ధనమును సక్రమముగ వినియోగించి సరియైన రశీదులు ఇవ్వబడును.

మా ప్రచారాభివృద్ధికై తగిన ప్రోత్సాహమిచ్చుచు సదా అభిప్రాయములిచ్చిన మోక్షసాధని, యదార్థభారతి, సత్కృతి, సుజాత, విజయవాణి, వయోజనవిద్య, రామదర్శనం, సేనాని, ఆంధ్రప్రభ, భగవన్నుతి, మొదలగు పత్రికాధిపతుల కున్ను, శ్రీ ధూళిపాళ్ళ వేంకట సుబ్రహ్మణ్యం, శ్రీ జాస్తి వేంకట నరసయ్య. శ్రీ దుర్భాక కృష్ణయ్య మొదలగు పెద్దల కును. మేము అనేక కృతజ్ఞతాభివందనములు సమర్పించుచున్నాము.

ఉత్తరముల ద్వారా నైనా మా ప్రార్థన ఆలకించి వెంటనే విరాళములు పంపిన దాతలకున్ను, మా ప్రచారంనకు తోడ్పడుచున్న మహాశయులందరకున్ను మేము అనేక సహస్ర వందనములు అర్పించుచున్నాము.

యెంత త్వరలో ధన సహాయము లభించునో అంత త్వరలో యీ గ్రంధమాల వృత్తాంతములు నిర్వహింపబడు చుండును. ధన సహాయమునుబట్టి కార్యక్రమము సాధించబడు చుండును. ఉభయలోకములందు సర్వసౌఖ్యముల నొసగుూర్ప గల అహింసా ఉద్యమమునకు తోడ్పడి, తమ శక్తి కొలది ధన సహాయముచేయ ప్రజలందరిని ప్రార్థిస్తూయున్నాము.

ఇట్లు,

జీవరక్షణ ప్రచారక గ్రంధమాల.



## పీఠిక.



భక్షణాకై ప్రతిరోజు భారత దేశములో ఎన్ని సాధు జంతువులను చేతులారా హత్యగావించుచున్నారో ఆలకించుడు.

హిందూ దేశములో (పాకీస్తానముగాక) 5 వేల జనాభాకు లోబడిన 5 లక్షల 29 వేల 62 ఊళ్ళు గలవు. కోళ్ళు, పక్షులు, చేపలుగాక మేకలు. పందులు మొదలగు వాటిలో భక్షణాకై ప్రతిరోజు ప్రతి ఊళ్ళో కనీసము 5 జంతువులను

చంపినను, ప్రతిరోజు మొత్తముఊళ్ళలో 27 లక్షల 95 వేల 310 జంతువులను బలవంతముగా చంపి, కండకు కండ ఎదురు వేయుచున్నారు.

10 వేల జనాభాకు లోపల 367 గ్రామములున్నవి. ప్రతినిత్యము ప్రతి గ్రామములో కనీసము 10 జీవులను కోసినను మొత్తము గ్రామములందు ప్రతినిత్యము 28 వేల 6 వందల జీవులను పబ్లికుగా కోసి తినుచున్నారు.

20 వేల జనాభాకు లోపల 607 పురములున్నవి. ప్రతి దినము ప్రతి పురములో కనీసము 20 ప్రాణులను నరికినను మొత్తముపురములందు ప్రతిదినము 12 వేల 140 ప్రాణులను నరికి మెక్కుచున్నారు.

50 వేల జనాభాకులోపల 277 నగరములున్నవి. ప్రతి రోజు ప్రతి నగరములో కనీసము 50 జంతువులను వధించిన, మొత్తము 13 వేల 850 జంతువులను నిల్వున ఛేదించి కూరలకు ఉపయోగించుచున్నారు.

లక్ష జనాభాకులోపల 87 పట్టణములున్నవి. ప్రతినిత్యము ప్రతి పట్టణములో కనీసము 100 జీవులను ఛేదించిన, మొత్తముమీాద 10వేల జీవులను నిల్వునప్రాణముతీసి వాటిని ఆరగించుచున్నారు.

లక్ష జనాభాకుపైన 50 పట్టణములున్నవి. ప్రతిదినము ప్రతి పట్టణములో కనీసము రెండువందల జంతువులను హత్య చేసినను మొత్తముమీాద పదివేల జంతువులను హతము చేసి మాంసపుకూడు తినుచున్నారు.

ప్రతిరోజు భక్షణకై ఇండియాలోని ప్రజలు 28 లక్షల 60 వేల 670 మూగజీవులను తమ పొట్టలను పెట్టుకొను చున్నారు.

ప్రతిసంవత్సరం భారతదేశములోని జనులు 103 కోట్ల 10 లక్షల సాధుజంతువులను బలవంతముగా ఛేదించి అమితోల్లాసముతో బహ్మానందముగా వాటిని మెక్కుచున్నారు.

ప్రజలారా! సాధువులును, ఉపకారజీవులైన మూగ జీవుల ఉసురు వ్యర్థముగపోదు. వాటి ఉసురే కరువుకాటకము లుగా, మసూచి కలరాదిరోగములుగా, రణరంగాది ఉపద్రవ ములుగా, భూకంపాది ప్రళయములుగా మారి దేశమును ముట్టడించి, ప్రజా నాశనముచేయ తలబడుచున్నదని తెలుసు కొనుడు.

**జనులారా!** మీకు **మా ఉసురు** తగులుట చేతనే "వ్యాధులు, దారిద్ర్యము, ఆపదలు, ఉపద్రవములు, బాధలు మీ వెంటబడుచున్నవి. మమ్ములను మీవలె చూడనంతవరకు దుఃఖ జ్వాలలకు మీరు ఆహుతిగాక తప్పదు.

**మానవులారా!** మీ సౌఖ్యములకై కాంగ్రెసనియు, కమ్యూనిస్టనియు, ఇంక ఏవేవో కొత్త సంఘములను లేవదీసి మీ హక్కులకై ఏవిధముగ తంటాలుపడుచున్నారో, ఆ విధ ముగ పశుపక్షి మృగాదులమైన మేముకూడా నరబాధలనుండి బైటపడుటకు కోరుచున్నాము, మా బాధలు మీరు మాపనం గినవరకు మీరు ఆపదజ్వాలలకు ఆహుతిగాక తప్పదు. ఇకనైన మమ్ము హింసించు పద్ధతి మానవలెనని నరులందరిని కోరు చున్నాము.— ఇట్లు, మూగ జీవులు.



# జీవరక్షణా ప్రచారక గ్రంథమాల వారి ఉద్దేశ్యములు.



1. జీవహింస నివారణ ప్రబోధములైన అన్నిరకములైన రచనలను ప్రకటించుట.

2. రచన, ప్రదర్శన పోటీలు ఏర్పాటుచేయుట.

3. పత్రిక నెలకొల్పుట.

4. ప్రచారమునకై మోటారు వ్యాను కొనుట.

5. జీవకారుణ్య ప్రబోధములను గ్రామ ఫోను రికార్డులలో వేయించుట.

6. జీవరక్షణా ప్రబోధమును టాకీఫిలుములో వేయించుట.

పై ఉద్దేశములతో జీవహింస నివారణకై ప్రచారము చేయుటకు ఈ గ్రంథమాలను స్థాపించినాము. ప్రజలెల్లరు శక్తికొలది ధనసహాయముచేయ ప్రార్థించుచున్నాము.







# అభిప్రాయము.

తాము పంపిన బుద్ధ చరిత్ర ఆమూలాగ్రముగా పరిశీలించితిని. హింసా ప్రాబల్యమగు యీ కాలమున అహింసా ప్రబోధకమగు యిట్టి గ్రంథముల ఆవశ్యకత విశేషముగా కన్పించుచున్నది. హింసావాదులకు యీ గ్రంథము చక్కని సమాధానమిచ్చి హృదయ పరివర్తన కల్గింపగలదు. హింసను నిరోధింపవలెనన్న ప్రభుత్వ శాసనములకన్న, ప్రచార ప్రబోధములే ఎక్కువగా, నుపకరించునని, చరిత్ర వలన తెలిసిన సత్యమే గదా! అట్టితరి కేవలము ప్రభుత్వమును విమర్శించుటకు ముందు మనమెంతయో ప్రచారం చేయవలసియున్నది. అహింస మూలసిద్ధాంతముగాగల మన ప్రభుత్వం, ఇట్టి సత్కార్యములకు అన్ని విధముల సహాయముచేయును.

శృతి, స్మృతి, పురాణముల నుండి ఏరిచ్చిన వుదాహరణములు చక్కని నీతి బోధకములుగానున్నవి. భౌతిక వాదము, అనాత్మప్రవృత్తి ప్రబలుచున్న ప్రస్తుత వాతావరణములో, నీతి, ధర్మము, సత్యము, మున్నగు

వాటిమీద విశ్వాసమును కలిగింపచేయు యీగ్రంథము ప్రజాసామాన్యమును ఆధ్యాత్మిక ప్రబోధము, అవశ్య కర్తవ్యపు చక్కగా సారల్పును.

ఆంధ్రులందఱు ఈ గ్రంథమును చదివి ఆనందించి ప్రబోధముల నాచరించి తరింపగలరని తలంచుచున్నాను

ఈ గ్రంథమునకు "బుద్ధ చరిత్ర" అనుటకన్న "బుద్ధ బోధ" అనిన సార్థక నామదేయముగా నుండునని నా అభిప్రాయము.

మున్సిపల్ ఆఫీస్ మెన్ ఆదోని. } ఇట్లు, భవదీయ శ్రేయోభిలాషి టి. జి. తిమ్మయ్యశెట్టి. ఎం. యల్. ఎ.



# విషయసూచిక

పేజీ

మూడవ అధ్యాయము.



నాల్గవ అధ్యాయము.



ఐదవ అధ్యాయము.



ఆరవ అధ్యాయము.

మహారాజు తమ రాజ్యముల నాక్రమించుకొనునేమో యను భీతిచే, వారంతట వారె ఆరాజునొద్దకేగి, ఆయనకు పాదాక్రాంతులై, ఆయనకు కప్పములు కట్టుచు, ఆయన సలహా ప్రకారము తమ రాజ్యములు పాలించుకొనుచుండిరి.

శుద్ధోధన మహారాజుకు మాయాదేవి, గౌతమియను భార్యలిద్దరు గలరు. సంతతికై వీరు పరమేశ్వరుని ప్రార్థించు చుండగా ఒకనాటిరాత్రి తెల్లవారుఝామున మాయాదేవికి స్వప్నమొచ్చెను. అప్సరసాదులొచ్చి ఆమెను పరివేష్టించి, గాననృత్యాదు లొనర్చుచుండ, బ్రహ్మాదిదేవతలు ఆమెను స్తుతించుచుండ, దేవకాంతలు ఆమెకు మంగళహారతు లిచ్చు చుండ, నక్షత్రమండలమునుండి తొమ్మిది కిరణములుగల నక్షత్రము, తనగర్భమున ప్రవేశించినట్లు మహారాణి కల గాంచెను. తనస్వప్నగాథ భర్తకుచెప్పగా, మహారాజుగారు తక్షణమె పండితులను రప్పించి స్వప్నఫలమడిగెను. మహా విష్ణువుతో సమానుడైన పురుషశిశువు కలుగుననియు, ఆయన ప్రపంచమంతయు పరిపాలింపగలమహాచక్రవర్తిగాగాని, ప్రజల నెల్ల తనమార్గమున నడిపింపగల మహాయోగిగా గాని అగునని, స్వప్నజ్యోతిష్కులెల్ల చెప్పిరి. స్వప్నఫల ప్రదర్శనముగ కొంతకాలమునకు పట్టపురాణిగారికి నవమాసములు నిండినవి. ప్రసవమునకై పుట్టింటికి పోవుచుండ మార్గములో లంబినియను ఉద్యానవనమువద్ద ప్రసవపు నొప్పులు కనుపింప నచ్చట ఆగిరి. అప్పుడు వాతావరణమెట్లున్నదన-

(1) "శిక్షకుడు లేడని తలచవద్దు శిక్షాధిపతియొక్క- ఆజ్ఞానుసారమే, నేను షోడశకళలతో మిమ్ములను ఆనంద పరచినాను. మీరు చేయుచున్న కృషియావత్తు ఏజీవికిని బాధకల్గింపనిదై యుండవలెను, జీవులక్షేమమునకు భంగ మొనర్చువారికి శిక్షభాయము, మీ నడవడిని శిక్షాధికారికి తెలియ జేయుటకొరకె వచ్చిపోవుచున్నా"నని చంద్ర భగ వానుడు భూలోకమును వదలివేసెను

(2) 'గత క్షణమువరకు కష్టములతో మీరు బాధ లొందుటకుగల మూలహేతువులను తెలుసుకొని, రాబోవు జన్మలోనైన సుఖములొందుటకు కావలసిన యత్నము లొనరింప లెండని, నిద్రమత్తులోని జీవులను లేప' సౌధముల మీద కుక్కుటాదులు తిరుగుచుండెను.

(3) 'జీవుల ప్రవర్తనను తిలకింప జగత్ప్రభువు వచ్చు చున్నాడు. ప్రభాతసేవ గావింపుడని హెచ్చరింప' శుకపికా దులు కైవారము లొనర్చుచుండెను.

(4) "పూజింపబడుటకే జీవించుడని బోధింప" సుమ వాసనలు వ్యాపించుచుండెను.

(5) త్రిమూర్తి స్వరూపుడని, ఆయురారోగ్యైశ్వర్య ప్రదాతయని నూటయెనిమిది హారాదాలిచ్చి, జగత్పాలనలో

తనకు ఉద్యోగమిచ్చినట్టి సర్వేశ్వరునకు, భూలోకమునందు స్వాగతమిచ్చినట్టి భాగ్యము, ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు లభించు చున్నదాయను ఉల్లాసముతో జీవుల జీవితకాలము లెక్కించు వాడును, 'రోజుకు రోజుఆయువు క్షీణించి మృత్యువు సమీపించు చున్నది. జాగుచేయక ఇహపరములందు బాధలు రాకుండ తప్పించుకొను మార్గము నాచరించుడని' బోధించు వాడు నైన ఉదయభానుడు ఏతెంచుచుండెను.

బాలభాస్కరుని వాంఛ తీర్చుటకై తల్లిగర్భమునుండి వెంటనే మన బుద్ధభగవానుడు బయటకువచ్చెను. ఇప్పటికి 2500 సంవత్సరముల క్రితము క్రీస్తుకు పూర్వము 623 లో వైశాఖ పౌర్ణమి రోజున భగవానుడు జన్మించెను, మాతా శిశువులతో తిరిగి పరివారము కపిలవస్తుపురమునకు వచ్చెను. పుత్రోత్సాహముచె రాజుగారప్పుడు, సుతుని ఆయురారోగ్యాభివృద్ధికై కోరినవారికి కోరినదానము లిచ్చుచు, షడ్రసోపేతముగ అనేక రకముల పిండివంటలతో నిత్యసంతర్పణ లొనర్పసాగెను. తమచక్రవర్తికి పుత్రుడు కలిగెనను వార్తవిని సామంత రాజులువచ్చి కానుకలిచ్చుచుండిరి. రాజ్యవాసులెల్ల యువరాజుగారిజన్మ దినోత్సవములు రోజుకు రోజు మహావైభవముతో జరుపుచుండ, ఏడవదినమున మహారాణిగారైన మాయాదేవి స్వర్గమలంకరించెను. రెండవ భార్యయైన గౌతమిదేవి బాలుని మిక్కిలి మక్కువతో సాకుచుండెను. గౌతమి పెంపుటచె

గౌతముడనియు, సంతతికై చేసినయత్నములు సిద్ధించుటచే సిద్ధార్థుడనియు బాలునకు నామకరణము లొసగిరి. తర్వాత ఇతను సాధించిన పనులవల్ల బుద్ధభగవానుడను పేరు ప్రసిద్ధికి వచ్చెను. శుక్లపక్ష చంద్రునివలె రాకొమరుడు దినదిన ప్రవర్ధమానుడగు చుండెను. క్రమేణ క్షత్రియోచితములగు సమస్త విద్యలలో ఖ్యాతిగాంచెను. సకల సద్గుణ సంపన్నుడైన రాకొమరునిచూచి, ఇతను రాజైన మనమెంత సౌఖ్యమునొంద గలమోయని ప్రజలెల్ల ఉవ్విళ్ళూరు చుండిరి.

## భూతదయ

ఒకనాడు స్నేహితులు బలవంతముగ సిద్ధార్థుని వేటకు తీసికొనివెళ్ళిరి. నిమిషములో తనమిత్రులు పశుపక్షి మృగాదుల నెన్నిటినో చంపిరి. గాని అపకారమెట్టిదో ఎరుగని సిద్ధార్థుడు మిత్రులొనర్చెడు దుండగములను చూడగనె కళ్ళ వెంట జలజల కన్నీళ్ళు కారినవి, హృదయము చలించినది. తనచేతిలోని ధనస్సును విసిరిపారవేసి యట్టి దుండగములు మాన్పింపలేని బ్రతుకు వ్యర్థమని తలచి "ఓ మిత్రులారా! ఆగండి. వేటచాలించి నామాటలాలకించుడు. నరులవలె మూగజీవుల ఆహారము నిల్వచేయక, రేపనుమాట తలపక. ఏరోజు కారోజు తమపొట్టల నింపుకొనుచు, నరులజోలికిరాక తమపిల్లలతో తాము స్వేచ్ఛగా ముద్దుముచ్చటలతో హాయిగా బ్రతుకుచుండే, ఈమూగజీవుల స్థావరములపైబడి వాటి హతమొనర్చుట మీకు ధర్మముకాదు. నరులనుచూచినే సాధుజీవులు పైర్లు మీదకురావు. ఒకవేళ వచ్చినను వదలిం

చినపోవును. ఒకసారి క్రూరమృగాదులకు బెదురుపెట్టిన రెండవ సారిరావు. మృగాదుల బాధలనుండి తప్పించుకొనుటకు అనేక సాధుమార్గములుండ ఈ విధంబుగ పెకిచి హత్య చేయుట మీకు న్యాయము కాదు. బాగా ఆలోచించిన ఉపద్రవ కారులు నరులేగాని మృగాదులు కావు. నరులొనర్చుచున్నంత క్రూరకృత్యములు, ఏక్రూరమృగముకూడా చేయుటలేదు. ఆకలిబాధతో అలమటించే వారిని మానభంగము కాపాడు కొనచింకిరి గుడ్డలైనలేక అవస్థపడేవారిని, తమ కళ్ళార నిత్యము చూచుచుండియు, వారిసంగతి పట్టించుకోక తరతరాలకు యుగయుగాలకు సరిపోవు ధనధాన్యముల నిల్వచేసి వారికంటెను, పరరాజ్యాక్రమణకు దూకేవారికంటెను, మించిన క్రూరులులేరు. స్వార్థమునకై ఎట్టిఘోరకృత్యములనైన చేయగల సమరులెందరోగలరు, వీరి ఆటలు సాగుచున్నంత వరకు దేశోపద్రవము లుద్భవించుచునే యుండును ఇట్టివారిని బట్టి తగినశాస్తి చేయుచున్న ప్రజోపద్రవములు నశించి దేశశాంతి చేకూరునేగాని, ఈమూగజీవులను వేటాడుచున్న సుంతైన ఫలము కలగదు నరులజోలికిపోవుననిమీపదవులకుముప్పువచ్చునేమో యని, తప్పించుకొనుచు మూగజీవులమీద మీరాజధర్మము చూపుట మీకు మీవంశములకు కీడుకల్గును. మూగజీవులను వేటాడుటచేత నెవాటివుసుకు తగిలి దేశారిష్టములు సంభవించుచున్నవి. మూగజీవుల సాహాయముమీద నెమానవుండు బ్రతుకు ఆధారపడియున్నదిగాన వీటినిచంపువారె దేశద్రోహులనియు వీటిని రక్షించువారె దేశరక్షకులనియు అడవులందైన క్రూరుల

దౌర్జన్యము నరికట్టుటకై అడవులను గూడ గాలించి అట్టివారిని బట్టుకొనుచు వేఁటాడుటయనియు "జంతురక్షణను గూర్చి మన సిద్ధార్థుఁడు తన హితులకు బోధింపగా "నీవు చెప్పినదే యథార్థము. మేమిక మా పరిపాలనలందు జంతుహింసను లేకుండా చేసెద మనుచు" మిత్రులెల్ల శపథమొనర్చిరి.

ఒకనాడు గౌతముడు ఉద్యాన వనములో విహరించు చుండగా, తనపినతండ్రి కొడుకైన దేవదత్తుడు ఆకాశమున బోవు హంసను పడగొట్టగా, ఆహంస గిలగిలకొట్టుకొనుచు అరచుచు గౌతముని ఎదుట కూలినది. తక్షణమె సిద్ధార్థుడు గబగబ హంసయొద్దకు వెళ్ళి దానిని గైకొని తన యొడిలో నుంచుకొని, గ్రుచ్చుకొనియున్న బాణమును నెమ్మదిగ దీసి, పైనుడ్డతో నెత్తురుతుడిచి, ఔషధిరసమును గాయమునకు వేసి దాని బాధను ఉపశమింప చేయుచు, తన హస్తములతో దానిని దువ్వుచుండెను. ఇట్లు విధోపచారము లొనర్చుచుండ ంలో హంసను పడగొట్టిన దేవదత్తుడు అచ్చటకువచ్చి "నేనేదీనిని పడ గొట్టినాను. ఇది నాసొత్తు, నాకిమ్మనుచు" అడిగెను, సిద్ధార్థుఁడంతట "అగ్రజా! ఇది నీకేమి ద్రోహమొనర్చెనని మింటను బోవు దానిని పడగొట్టినావు ఇప్పుడిది ఎంత బాధపడుచున్నదో చూడుము. కష్టసుఖములు తెలిసినట్టి నరులు మూగజీవుల రక్షింపకయున్న వాటిని రక్షించు వారెవరన్నా' అని దేవదత్తునకు. సిద్ధార్థుడింక ఏవేవో చెప్పబోవుచుండ దేవదత్తుడు "నీవా నాకు నీతులు చెప్పేది. నీవుపదేశమింక చాలించి నాహంసనునాకివ్వ లేకున్న ఇదిగో నిన్ను రచ్చకీడ్చించి నిన్నేమిచేస్తానోచూడు"

"నీవేమి చేసినను హంసను ఇవ్వనని సిద్ధార్థుడనెను. దేవదత్తు డంతట కోర్టుకెక్కెను. కోర్టువారు గౌతముని పిలిపించి సమాధానమడుగ "హంసను రక్షించినవారిదె సొత్తని" గౌతముడు వాదించెను, వారిరువురివాదన విన్నతరి తీర్పుచెప్ప కోర్టువారి కేమి తోచలేదు. చివరికొక ఉపాయమును నాలోచించి హంసను నొకచోట నుంచుమని గౌతముని కోరి తర్వాత హంసను తెమ్మని దేవదత్తునితో చెప్పిరి. దేవదత్తుడంతట ఉషారుతోచం కలుకొట్టుచు చేతులుచాచి హంసయొద్దకు పోవుచుండగా మృత్యు దేవతవలె వచ్చుచున్న దేవదత్తుని హంసచూచి గడగడ వణకసాగెను. బోరున మొత్తుకోనాగెను దిక్కుకై దిక్కుల చూచుచుండెను. దేవదత్తుడు తప్ప దానివద్దకు నెవ్వరు రాకుందున, ప్రాణమిక దక్కదనుకొని రెక్కలబాధ లెక్కచేయక రివ్వుమనుచు పైకెగిరి దేవదత్తుని తలతన్నుచూవచ్చి సిద్ధార్థుని వడిలో వాలెను. ఈ విధముగ సభలో హంసయే దేవదత్తుని పరాభవించి, సిద్ధార్థునియొద్ద వాలినంతనే సభికులందరు హర్షధ్వనులొనర్చిరి. న్యాయాధికారి లేచి "సభికులారా! ఈహంస ఎవరి సొత్తుఅయినది హంసయే నిర్ణయించుట మీరందరు చూచితిరిగాన ఈహంస సిద్ధార్థునిదే" యని తీర్పుచెప్పెను. శత్రు మిత్రభేదము మూగజీవులుకూడ గ్రహించకలవని చెప్పుకొనుచు ప్రేక్షకులు వెళ్ళిరి. హంసకు బలమువచ్చేవరకు పోషించి తర్వాత గౌతముడు వదిలిపెట్టెను.

## వివాహము

దయార్ధ్రి హృదయుడైన తనకొమరుడు స్వప్నశాస్త్రి

పండితులు చెప్పిన ప్రకారము చక్రవర్తిగాక, మహాయోగిగా మారునేమోయను అనుమానముతో, తనసుతునకు ప్రపంచ వ్యామోహము కల్గి పనెంచి, చక్రందనాలకుప్పయగు యశోధరయను కన్యకను తెచ్చి వివాహమొనర్చి, సేవకై సొగసు కత్తెలనుంచి, మనసు విరిగేవార్తలుగాని; దృశ్యాలుగాని గౌతమునికి తెలియరాకుండా తండ్రిగారు బందోబస్తు చేయించెను. దంపతులిష్టమొచ్చినట్లు విహరించుటకై వ్యామోహ జనకములైన రకరకాల మేడలు, వినోదములు, వనములు, ఏర్పాటు చేయబడెను. మేడలనుచూడ ఇంద్రాదులును, నిర్మాణములను చూడ విశ్వకర్మాదులు, నాట్యాంగనలచూడ రంభాదులు, వనములచూడ ఊర్ధ్వ లోక వాసులునువచ్చి చూచుచు, వీటిముందు తమలోకవైభవములు ఎందుకు పనికి రావని తలచి ఇచ్చటనె కాపుర ముండసాగిరి. గౌతముడు యశోధరతో పూదోటలందు లతాగృహములందు, సరోవరములందు, తూగుటుయ్యాలలందు అద్దాలమేడలందు, నిరంతర క్రీడావిలాసములతో మునిగి తేలుచుండెను. కొంతకాలమునకు రాహులుడను పుత్రుడు కల్గెను. మనుమని చూచుకొని రాజుగారును, సుతునిచూచుకొని గౌతముడునుమురిసిపోవుచు, కాలము గడపుచుండిరి. మూగజీవులకిచ్చిన అభయ హస్తము నెరవేర్పనవతరించిన సిద్ధార్థుడు ఎంతకాలమునకు వాటిబాధలు బాపరాకపోవుటచె, మూగజీవుల వుసురుకు బ్రహ్మాదిదేవతలు తట్టుకోలేక, రక్షణవేడ, మన గౌతమునొద్దకు వచ్చుటకు బయలుదేరిరి. పాఠకులారా ! ఈ కథ కల్పనాకథయని తలచ

న్నవి. ఏలన బుద్ధావతారము దశావతారములలో నొకటై యున్నది ఏ కాలంభములో భగవంతుడు రామకృష్ణాది అవతారములెత్తి ప్రజలను రక్షించినాడో, ఏ ధ్యాసతో రాక్షసాది ఉపద్రవములనుండి లోకములను కాపాడినాడో, అదే సంకల్పముతోనే, ప్రజల బాధనుండి మూగజీవులను రక్షించుటకై ఆ జగద్రక్షకుడే బుద్ధావతారమెత్తినాడు.

(1) ప్రాణముతోవున్న పిచ్చుకను, కాకి తీసుకపోవుచుండగా చూచి, పిచ్చుకను వదిలిపెట్టేంతవరకు కాకివెంటబడు వారిని చూచుచున్నాము.

(2) కుక్కలు పిల్లి వెంటబడితే, కుక్కలను తరిమివేసి పిల్లులను రక్షించువారిని తిలకించుచున్నాము.

(3) ఎవరైనా పశువులను బాదుతుంటె, నోరులేని వాటిని అలాగు బాదుట మంచిదికాదని మందలించువారిని వీక్షించుచున్నాము.

స్వల్పజ్ఞానము కలిగినట్టి మానవులె, మూగజీవరక్షణలో దయను చూపుచుండగ, సర్వరక్షకుడును, ఆపద్బాంధవుడును, సాధురక్షకుడును, కరుణా నిధియైన జగత్పితయగు భగవంతుడు, తనసృష్టిలోని మూగజీవుల బాధలు బాపుటకు తగిన యత్నములు చేయడని తలచవద్దు.

చరాచరములను సృష్టించిన జగత్కర్త నరులను దయతోను, మూగజీవులను నిర్దయతోను చూచునట్టి పక్షపాతి

# రెండవ అధ్యాయము

శ్రీ హరిధ్యాన నిమగ్నులౌచు శాశ్వతానందము ననుభవించుచు, సర్వప్రాణులను తమవలె చూచుకొనుచు, ఏ జీవికిని కీడుచేయక, సదా జీవరక్షణకే తమప్రాణము లర్పించుచు మొదటి యుగములోని ప్రజలు కాలము గడిపిరి. తర్వాత కాలక్రమేణ ప్రజలు అల్పసుఖములను ఆశించినవారై విషయాసక్తులై మెలగుచుండిరి.

## ప్రజలవల్ల మూగజీవులకు కల్గుచున్న బాధలు

కొందరు ఘనులు జిహ్వారుచికై రాత్రింబగళ్ళు తదేకధ్యాసతో, ఎంతో కంటాలు పడుచున్నారు. ఎలాగంటే.

(1) ఆవు మాంసము ఆయువు నొసగునను ఆశతో గోమాతలను ఛేదించి వాటి మాంసము మెక్కుచున్నారు.

(2) ఎద్దుమాంసము ఏనుగంత బలము యిచ్చునను ధ్యాసతో బసవన్నలను ఖండించి వాటిపలలము నములుచున్నారు.

(3) కోళ్ళమాంసము కోరినంత బలమువచ్చునని, కోళ్ళను వండి తినుచున్నారు.

(4) మేకలమాంసము మెదడునిచ్చునని మేకలనుకోసి మెక్కుచున్నారు.

## మూగజీవు లొనర్చుచున్న ప్రజాసేవ

ఆ ప్రకారము దేశములో రోజురోజు జంతుహింసలు వృద్ధియగుచుండ ఆబాధలుపడలేక పశుపక్ష్యాదులు ఒకచోట సమావేశమై ఏమని చర్చింప సాగినవంటె—

(1) దేశోద్ధారకులుత్పత్తి, పాలు ఉత్పత్త్యాది డిపార్టుమెంటులలో ఏ ఉపద్రవములు రాకుండుటకై ఆవు గేదెలాది మన స్త్రీజాతి పశువులు, రాజురంగప్పయను భేదము పాటింపక, లోకపోషణార్థం కపటములేని దేశోద్ధారకులను, ప్రజల హస్తగత మొనర్చుచు, సమృద్ధిగలపాడికై తమ పసికూనలకైన దాచుకొనక, ఉన్నపాలన్నియు సమర్పించుట చేతనే నరజాతి జీవించుచున్నది.

(2) ఆహారోత్పత్తి, ఎగుమతి దిగుమతి మొదలగు డిపార్టుమెంటులలో ప్రమాదము వాటిల్లకుండుటకై మన వృషభ మహిషాది మగజాతి పశువులు కష్టమనక, ఎండవానలనక, అదిపెట్టు ఇదిపెట్టుమని జాతరచేయక, పెట్టినదేదియో గుట్టుగాతిని, ఆకలిదప్పులకోర్చి, పీకపోయిన డొక్కలతో, బయటపడ్డ ఎముకలతో, చిక్కిపోయిన దేహములతో, వ్యవసాయము వెనుకపడునేమో అను వెనుదిగులుతో పాలుమాలక, జవసత్వములను ధారపోసి, చెప్పినట్లు పనులెల్లా చేయుచు, క్రూరులొనర్చెడు నానా భీభత్సములను సైచి, కార్యభంగము కాకుండ, అపకారికి ఉపకారము

చేయవలెనను దీక్షతో, దేశరక్షణార్థం, చావుబ్రతుకు తెలియక ఆశ్రయించినవారి భూములెల్లా సాగుచేయుచు ఆశ్రితులు కోరిన వెంటనే, దూరమనక. బరువనక, ఎగుమతిదిగుమతులుచేయుచు ప్రయాణములన్న పాటుపడుచు, విసుగు విరామములేకుండ పట్టుదలతో రాత్రింబగళ్ళు తీవ్రమైన కృషిచేయుట చేతనె మనుజులు బ్రతుకుచున్నారు.

(3) ఎరువులుత్పత్తి, వస్త్రముల సరఫరాది శాఖలలో, ఏమోసము రాకుండుటకై మన మేకలు గొఱ్ఱెలు మొదలగు నవి ధనికులు, దరిద్రులనక, పక్షపాతము వర్జించి, నికరముగా జనసౌఖ్యార్థము అడ్డుచెప్పక, తిరదనక, కాదనక, శ్రమయనక, చీకటనక, పుట్టనక, గుట్టనక, రాళ్లనక, దూరమనక, రహదారి ఖర్చు లోల్లక, ఆహ్వానించిన చోట్లకెల్లా కాలినడకన వెళ్ళుచు, కోరినవారికి కోరినంత ఎరువొసగుచు, గడగడవణకించు చలిగాలియొక్క దౌర్జన్యపాలన నూపుమాప, కంబళ్ళు శాల్వలు, రగ్గులు మున్నగు సాధన సంపత్తులు విరివిగా ఇచ్చు చున్నందుననే ప్రజలు కలుకుచున్నారు.

(4) ఆరోగ్య శాఖలో ఏలోటు జరుగకుండుటకై మన సూకరములు లోకరక్షణకై, రోగులు, నీచులను భేదము పాటింపక, దుర్వాసననక, చీదరనక, రోతనక, సందుగొందుల నక, పిల్వకపోయిననూ, వాసననుబట్టి మలవిసర్జన స్థలముతెల్లను శోధించి తక్షణమె శుభ్రపరచుచు, సదాకాచుకొని తిరుగుట చేతనే గాలు బాధలేకుండ జనులు తిరుగుచున్నారు.

(5) చేపలుమాంసము చేవనిచ్చునని చేపలనుబట్టి హాతము చేయుచున్నారు.

(6) పందులమాంసము పరాక్రమిచ్చునని పందులను కాల్చి భక్షించుచున్నారు.

(7) పక్షులమాంసము పక్షవాతమురాకుండ చేయునని పక్షులనుబట్టి మ్రింగుచున్నారు.

ఈవిధంబుగ నొకవైపున మాంసభక్షకులు తాముకోరిన పశుపక్షిమృగాదుల నెన్నింటినో హాతముచేయుచు తమ జిహ్వారుచిని తీర్చుకొనుచున్నారు. (2) ఇంకొకవైపున వీరులు కొందరు ఇంద్రాదిలోకప్రాప్తి, రంభాదివేశ్యలపొత్తు నాశించి యజ్ఞము లనుపేరుతో పశువులనెన్నిటినో ఆహుతి నిచ్చుచుండిరి. యజ్ఞములు పూర్వము రాజులు విపరీతముగా చేయుచుండెడివారు. ప్రస్తుతము ఈ యజ్ఞములు మాత్రము నశించినవి. (3) మరియొకవైపున భక్తులుకొందరు కలరా మొదలగు రోగములు వ్యాపించినప్పుడు, తమశరీర రక్షణకై దేవతలకు పశుపక్షి మృగాదులను బలియిస్తామని మ్రొక్కుకొనుచు, మ్రొక్కుకొన్న జీవులను దేవతలయెదుటకు తెచ్చి చేయించే వినోదములు శ్రద్ధగానాలకించుడు.

(1) దున్నలను లోతైన కందకములోదింపి ప్రాణములు పోవునంతవరకు బల్లెములతో దేహమంతట పొడుస్తారు.

(2) కొన్ని ప్రాంతములలో, గున్నలను ఒక చోటకట్టి వేసి తరుసగా వాటికంఠములను నరికివేస్తారు.

(3) నాలుగు కాళ్ళను బంధించి మేకయొక్క కంఠమును, వస్త్రంగ ఉలితో కొయ్యపై రంధ్రము పొడుచునట్లుల, జెకుర్చుచు చంపుతారు

(4) కొన్నిచోట్ల మేకలముందర అన్నముపెట్టి, అవి అన్నము తినుచుండగా బల్లెములతో వాటి పొట్టలను పొడిచి ప్రేగులను బైటికి తీస్తారు.

(5) మరికొన్నిచోట్ల, చూడిమేకలనుదెచ్చి పొట్టను చీల్చి అందుండు శిశువులను దీసి నివేదన చేస్తారు.

(6) పందులయొక్క నాలుగుకాళ్ళు త్రాళ్ళతోగట్టి నిలువబెట్టి పదునగు సన్నని బల్లెములతో, ముడ్డిలోనుంచి నోటిలోకి వచ్చునట్లు గ్రుచ్చుతారు

(7) కొన్నిగ్రామములలో బల్లెములనుభూమిపైగ్రుచ్చి పందిపిల్లలను ఎత్తగు ప్రదేశమునుండి, వాటికి దిగవేస్తారు.

(8) కొన్నిప్రాంతాలలో, పందిపిల్లలను బల్లెములకు గ్రుచ్చి పైకెత్తి ఊరేగుతారు.

ఈవిధముగ ఎవరికితోచిన పద్ధతులతో వారు దేవతలకు యాగజీవుల నెన్నిటినో బలియిచ్చుచున్నారు

ప్రజోద్ధరణకై పశుపక్షి మృగాదులమైన మనము, సమ దృష్టితో సమస్త జనులకు సమానమైన ఉపకారము లెన్నో ఆచరించుచు, అహర్నిశలు మనము శ్రోద్దాటచేతనే, ప్రజలు ఆకులలములు, నారగుడ్డలు పర్ణశాలలు, వర్జించి. షడ్రసోపేతమైన భోజనముతో ఆనందమొందుచు, షోకైన వస్త్రాలంకారములతో మెరియుచు, రమ్యమైన భవనములలో కులుకుచు, పాడిపంటలతో వర్ధిల్లుచు నాగరికాగ్రేసరులై విహరించుచున్నారు. మనవలె మానవసేవయందు పాటుబడు వారు లేరు. ఎట్లన.

1) ఉప్పునీళ్ళు పోసినను పానకమువలె త్రాగి బిందెలాదికమ్మనిపాలు నిచ్చుచు, వినయవిధేయతలతో మన స్త్రీజాతి పశువులు మెలగుచున్నవి.

2) తౌకు; డుడంట్లు వేసినను బెల్లపుముక్కలులాగ తిని, ధనధాన్యపురాసులు పోగుచేసి యిచ్చును. ప్రజలు చెప్పినట్లు మనవృషభ మహిషాదులు సంచరించుచున్నవి.

3) జనులకు రకరకాల భవనములు నిర్మించుచు, మన వారు ఆరుబైయటయుండె ఆహ్లాదముతో నివసించుచున్నారు.

4) మనవారు ఔచ్చులందైనను శయనించుచు ప్రజలకు హంసతూలికాది తల్పము లొనగూర్చు చున్నారు. మనశ్శాంతి శమదమాదులను, త్యాగములను, ఉపకారములను, దానధర్మములను, విశ్వాసమును, సేవలను, వర్ణింప నాలుగు మోములు వేల్పగు బ్రహ్మకైన తరముగాదు. కంచ.

కాగడాలతో వెతకినను మనవలె ప్రవర్తించువారు నరులందు మచ్చునకైన కానరారనియు, ఇక పుట్టరనియు, ముమ్మాటికి నైకొట్టవచ్చును. ఆదియుగములో స్వచ్ఛమైన దేశసేవకు లున్నారేమోగాని ఈయుగములోనివారుమాత్రము అధికారము చిక్కునంతవరకు దేశభక్తులుగా, త్యాగమూర్తులుగా, పరోప కారులుగా, దేశనాయకులుగా నటించి, అధికారము చిక్కిన వెంటనె దేశభక్షకులుగా మారుటను ప్రత్యక్షముగా చూచు చున్నాము. గాన ఇప్పటివారి దీక్షలు, బోధలు, త్యాగ ములు, సేవలు దొంగభక్తివంటివె. గాన ఏమాత్రము నమ్మ టకు వీలులేదు. మానవజాతికికష్టసుఖములు, పాపపుణ్యములు తెలుసుననియు, విశ్వాసము జాలి, కరుణ, ప్రత్యుపకార బుద్ధియుండుననియు, నరులపెత్తనములో బలవన్మరణములుండక ఆయుస్సున్నంతవరకు ఏబాధలు లేకుండ హాయిగ బ్రతుక వచ్చునని తలచి, ప్రజలతో కలసి మెలసి తిరుగుచు, జనసౌఖ్య మునకై ఏప్రొద్దు పాటుబడుచున్న పశుపక్షి మృగాదులమైన మనలను ఘాతము చేయుటయేన, మానవజాతి మనకు చేయ వలసిన ప్రత్యుపకారము ?

## ప్రజలొనర్చుచున్న దుండగములు.

నరులబాధ మనము ఆరోపించే నేరములను, నిజము కాదని రుజువుచేసే నరులుంటె ముందుకురావచ్చునని నర జాతిని సవాలుచేయుచున్నాము మనమీద నరులు సాగించు చున్న దుండగములేవనగా—

1) మనపాలు పెరుగులు తన్విదీర జుర్రినన్నాళ్ళు జుర్రి ఎండిపోయినవేళ పనికిరానిక పదమని మనలను కసాయివానికి ఒప్పగించే వారలున్నారు. (నిజమేయని సభలో కేకలు)

2) మనచేత చాకిరిచేసినన్నాళ్ళు చేయించుకొని, చేయలేని రోజులలో మనలను శిరచ్ఛేదనకు పంపించే ప్రజలున్నారు. (ఔనని కేకలు)

3) జిహ్వారుచి తీర్ప నిరపరాధములైన పశుపక్షి మృగాదులను ఛేదించి, వాటి మాంసము మెక్కేనరులున్నారు. (సత్యమేయని కేకలు)

4) మనచేత రాత్రింబగళ్ళు ఎముకలు ఇరిగేటటుగా అంతులేని చాకిరి చేయించుకొనుచు, "వారిపొట్టలకు వారు తన్విదీర కమ్మని పదార్థము లారగించుచు" మనతృప్తిదీర ఆకలిదప్పులు తీర్పక, గుప్పెడుమేతతో, దోసెడునీళ్ళతో రేషనింగుపద్ధతి నమలుపరచుచు, మనలను ఆకలిదప్పులతో అలవటించచేసే జనులున్నారు. (యాథార్థమేయని కేకలు)

5) ఎముకలు విరిగేటట్టుగా కఱ్ఱలతో బాదుచు, వాతలుపడునట్లు కొరడాలతో చెండుక తినుచు, గాయములు పడునట్లు ముల్లుకఱ్ఱలతో పొడుచుచు, ఇంక చెప్ప శక్యముగాని బాధలెన్నియో పెట్టుచు, మనుజులు మనచేత చాకిరిచేయించుచున్నారు. (వాస్తవమేయని కేకలు)

6) కాఫీపానము చేసేఘనులెందరో యున్నారుగాని మనలను రక్షింపనొక్కడైనరాడు.

7) పెరుగు ముద్దలు ఎగురవేసేవారలు, ఎందరెందరో యున్నారుగాని మనలను కాపాడ నొకడైన రాడు.

8) నేతిముద్దలుతినే బుద్ధిమంతులు ఎందరెందరో యున్నారుగాని మనలను బ్రోవనొకడైనరాడు.

9) మజ్జిగన్నము జుర్రే అన్నలు, ఎందరెందరో యున్నారుగాని, మనబాధలు బాప నొకడైనరాడు.

10) మనచేత చాకిరి చేయించుకొనె గుంపుయున్నది గాని మనలను రక్షింప నొకడైనరాడు.

11) మనఆధారమువల్ల జీవించునట్టి ప్రజలనేకకోట్లమందియున్నారు. గాని ప్రత్యుపకారమొనర్చువాడొకడైన లేడు.

అకటకటా! మానవులెంతటి ఘాతకులు? ఎంతటి విశ్వాసహీనులు? రక్షించవలసినవారు భక్షకులుగా తయారగుచున్నారుగాన నమ్మిన వాటిని నరికేజాతి, మానవజాతియే యని ఘాఢిగా చెప్పవచ్చును. నీవేదిక్కనువారిని నిర్జించేజాతి నరజాతియేయని దృఢముగా వాదించవచ్చును. చనువుతో నుండువారిని చంపేజాతి మానవజాతియే యని గట్టిగా సవాలుచేయవచ్చును. నిరపరాధులను హత్యచేసే జాతి మానవజాతియేయని, నిర్భయముగా ప్రచారమొనర్పవచ్చును. రాక్షస చర్యలతో వర్తించుటకే ప్రజలు తీవ్రమైన కృషిచేయుచున్నారు. ఎట్లన.

సాంగత్యమును చెప్పశక్యము గాకున్నది. నానాటకష్టి స్వారి కృత్యముల నరికట్ట తక్షణమె మనము యోచవల్సింది. ఏకగ్రీవముగా బ్రహ్మాండముగా, తీవ్రమైన పోరాటము సాగించవలసి యున్నది. గాన, మేము యోచిస్తాంచి సిద్ధముగా నుండవలె నని గట్టిగా హెచ్చరించు చున్నాము. మానవసేవయందె మనము కాలము గడుపుదము, ప్రజోపయోగ కార్యములందె నిమగ్నులమై, ఉపకార దీక్షతో మెలగుచున్నను నరులు విశ్వాసహీనులై మనలను చావగొట్టుటకె కృషిచేయుచున్నారు. కొందరైన మాపక్షమునుండి మనల రక్షింప యత్నించువారు లేరు. సర్వసామాన్యముగా ప్రజలెల్ల మనచావులకె తోడ్పడు చున్నారు. అడ్డులేదను గర్వముతో తాముకోరినట్టి పశుపక్షి మృగాదులను భక్షిస్తూ నరముఖ వ్యాఘ్రములవలె పిచ్చల విడిగా స్వేచ్ఛతో సంచరించు చున్నారు.

దిక్కులేనినాటివి తెగటార్చుటే మానవజాతియొక్క ఘనత్వము కావచ్చు. లేకున్న మానవులకు మనమేమి అపకారము చేయుచున్నామని మమ్ములను వారు చంపుచున్నారు?

## మూగజీవులు భగవంతుని ప్రార్థించుట.

ప్రపంచములో మనకిక నరదిక్కులేదు. నరులను మేమెంత ప్రార్థించుచున్నను, చెవిటివాని ఎదుట, శంఖమూదినట్లగుచున్నది. దిక్కులేని వారికి, దేవుడేదిక్కని చెప్పినారు గాన మనయిష్టదేవతలుగూడ మనలను త్రోసివేసే మొదల మనమిప్పుడు చేయవలసిన కర్తవ్యము నిర్ధారణచేయుదము,

వారిష్టదైవములను ధ్యానింపగా వారు ప్రత్యక్షమై, తమను ప్రార్థించిన కారణమేమియని యడుగ, మూగజీవులెల్ల తమ బాధలనుగూర్చి ఏమని చెప్పుకొనుచున్నవంటె.

1) ఓ మత్స్యావతారా! నీవంశస్థులమైన మత్స్యములను మేము ప్రపంచకోటి విడనాడి, జలస్తంభన విద్యతో కాలము గడుపుచున్నను కొక్కెమూక మమ్ములను శోధించి తీసుకపోయి, చంపుచున్నారు మహాప్రభో! మమ్ము రక్షింప తక్షణమె రావాలయ్యో! రావాలి!

2) ఓ వరాహావతారా! నీకులస్థులమైన వరాహములగు మేము ఎవరిజోలికిపోక తప్పించుకొని తిరుగుచున్నను, దుష్ట గుంపు దుడ్డుకఱ్ఱలతో మా వెంటబడి తరిమి తగిలి చావగొట్టి తెచ్చి మంటలలో పొర్లించితీసి, మమ్ములను ముక్కలు ముక్కలుగా నరికి మెక్కుచున్నారు. మహాప్రభో! మమ్ము రక్షింప వెంటనే రావాలయ్యో! రావాలి!

3) ఓ జగన్మాతా! గోవులను పేరుతో నీముద్దుబిడ్డలమైన మూగజీవులగు మమ్ములను క్రూరులు లాగుకొనిపోయి గొంతులు కోయుచున్నారు తల్లీ! తక్షణమేవచ్చి మమ్ము రక్షించాలి! రక్షించాలి!

4) ఓ జగత్పితా! తింటనున్న మేపాదిరాసులను తప్పి, భూలోకములోని పశుపక్షి మృగాదులను, నరులు తమ పొట్టలన పెట్టుకొనుచున్నారు తండ్రీ! అర్జంటుగావచ్చి మమ్ము రక్షించాలి! రక్షించాలి!

5) ఓ గోపాలకృష్ణా! నీవు లేవని క్రూరులు చెలరేగి, నీ గారాబు పశువులగు మమ్ములను, ఎన్ని అవస్థలు పెట్టుచున్నారో సావధానులై శ్రద్ధగా ఆలకించాలి. స్వామి! దేశోద్ధారకుల నొసగుచు, అమృతధారల నిచ్చుచున్న కామధేనువులమగు గోవులు, గేదెలు మొదలగు మమ్ములను క్రూరులు చెరబట్టు కొనిపోయి, నిల్వనీకోసి నమలుచున్నారు. మహాప్రభో! అతిశీఘ్రముగా వచ్చి మమ్ము రక్షించాలండో! రక్షించాలి!

6) ఓ గోపాలబాలా! మా పాలు పెరుగులు జుఱిచిన న్నాళ్ళు జుఱిచి ఎండిపోయిన వెంటనే మమ్ములను శిరచ్ఛేదనకు పంపుచున్నారు. మహాప్రభో! మమ్ము రక్షింప జాగుసేయక రావాలండో! రావాలి!

7) ఓ పశుపతీ! ప్రొద్దు మానవసేవయందే కాలము గడుపుచున్న వృషభ మహిషాదులమగు మమ్ములను ఈడ్చు కొనిపోయి నిల్వబెట్టి తోలుతీసి పీకకోసి తినుచున్నారు. మహాప్రభో! మమ్ము రక్షింప వెంటనే రావాలండో! రావాలి!

8) ఓ వృషభకేతనా! చాకిరి చేసినన్నాళ్ళు చేయించు కొని, చాకిరి చేయలేని రోజులలో మమ్ములను హంతకులకు ఒప్పగించుచున్నారు. మహాప్రభో! మమ్ము రక్షింప శీఘ్రముగా రావాలండో! రావాలి!

9) ఓ బసవదేవా! మా చేత రాత్రింబగళ్ళు ఎముకలు విరిగేటట్టుగా చాకిరి చేయించుకొనుచు, మా కడుపులను మాడ్చుచున్నారు మహాప్రభో! మా ఆకలి బాధలు బాప ఇప్పుడే

రావాలంటో! రావాలి!

10) ఓ బసవేశ్వరా! వాతలు పడునట్లు కొరడాలతో మము చెండుచు, నెత్తురు కాల్వలు పారునట్లు ముల్లుకఱ్ఱలతో పొడుచుచు, ఎముకలు విరిగేటట్లుగా కఱ్ఱలతో బాదుచు కొమ్ములు పగులునట్లు బరువులు మోయించుచు, ఇంక చెప్ప శక్యముగాని బాధలెన్నియో పెట్టుచూ, మాచేత ప్రజలు చాకిరి చేయించుచున్నారు. మహాప్రభో! మా బాధలు బాప త్వరగా రావాలంటో! రావాలి!

11) ఓ కుక్కుటధ్వజా! నీ పతాక చిహ్నదులమైన కుక్కుటములగు మమ్ములను దుష్టులు పట్టుకపోయి వండుకొని మెక్కుటయేగాక, మా వంశాంకురములయిన గర్భాలలోని పిండాలనుపిండి, వాటి రసమును నరులందరు జోరుగా త్రాగుచున్నారు. మహాప్రభో! మమ్ము రక్షింప తమ రిప్పుడే బయలుదేరి రావాలంటో! రావాలి!

12) ఓ మేషవాహనా! ఎరువుల నుచితముగా నొసగుచున్న ధర్మదాతలగు మేకలు గొఱ్ఱెలమైన మమ్ములను లాగుకొనిపోయి ఛేదించి నమలుచున్నారు. మహాప్రభో! మమ్ము రక్షింప వెంటనే రావాలంటో! రావాలి.

13) ఓ గరుడకేతనా! నీదాసుని చుట్టాలమైన పక్షిజాలమగు మేము గగనమార్గమున తిరుగుచున్నను, నీచులు మమ్ములను పడగొట్టి భక్షించుచున్నారు మహాప్రభో! మమ్ము రక్షింప తక్షణమే రావాలంటో! రావాలి.

14) విశ్వపాలకా! నేము నిత్యము పంచామృతాభిషేకములు చేయించుచు, అనసర మహానైవేద్యముల నారగింపు చేయించుచున్నను మమ్ములను హతముచేయుటకే, దేశపాలకుల్లు గూడ ప్రజలను రెచ్చగొట్టి పంపుచున్నారు. మహాప్రభో! మాకిక దిక్కు నీవేనంటోయి! నీవేను!

15) ఓ ఆపన్నివారకా! నరులు మామీద సాగించుచున్న దౌర్జన్యములను, ఆచూకి తెలియకుండ చేయుచు, మానవజాతిలోని స్వల్పపు కష్టములను కొండంతలుగా ప్రకటించుటకే సమస్త పత్రికాధిపతులు దీక్షలు పట్టుచున్నారు. మహాప్రభో! మాకిక దిక్కు నీవేనంటోయి! నీవేను!

16) ఓ దీనరక్షకా! జీవహింసలతో గూడిన అనుపానములే, రోగనివారణకు అమృతము వంటివని బోధించి, రోగులకుగూడ మామీదకు ఉసికొల్పుటకై వైద్యులెల్లరు శపథము లొనర్చుచున్నారు. మహాప్రభో! మాకిక దిక్కు నీవేనంటోయి! నీవేను!

17) ఓ ఆశ్రితరక్షకా! మా రక్షణనిధికి ఒక్కపైసానైనయివ్వక, తన జాతిరక్షణకు, తన సర్వధనము ధారపోయుటకే ధనవంతులెల్లా ప్రతినల నొనర్చుచున్నారు. మహాప్రభో! మాకిక దిక్కు నీవేనంటోయి! నీవేను!

18) ఓ సర్వజ్ఞా! మా ఉపకారములను వర్ణించుట అవమానముగా తలచి తనజాతివారిని పొగడుటకే, కలిబృందము లెల్లా సైకొట్టుచున్నారు. మహాప్రభో! మాకిక దిక్కు నీవేనంటోయి! నీవేను!

19) ఓ దుష్టశిక్షకా! మాంసము కలియని ఆహార పదార్థములను ముట్టరాదను వ్రతము ప్రజ లాచరించుచున్నారు. మహాప్రభో! మాకిక దిక్కు నీవేనండోయి! నీవేను!

20) ఓ కరుణానిధీ! మానవేతర జీవులను రక్షింపరాదను దీక్షతో దేశనాయకులు, త్యాగమూర్తులు, శిక్షాధికారులు, దాతలు, దేశపాలకులు తప్పించుకొని తిరుగుచున్నారు. మహాప్రభో! మాకిక దిక్కు నీవేనండోయి! నీవేను!

21) ఓ సర్వసాక్షీ! భూలోకములో ఎటుచూచిన నెత్తురుకూటికి ఆశించి, పాపకృత్యమను మాట పారదోలి, దయారసమును దగ్ధమొనర్చి, ఎదురులేదను పొగరుతో, మా యిష్టమనుచు, మూగజీవులయెడ అక్రమాలెన్ని చేసినా అడ్డు లేదని ఉప్పొంగుచు రోగులు, ఆరోగ్యవంతులు, వికలాంగులు, సుందరాంగులు, ధనవంతులు, దరిద్రులు, పిల్లలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, ఎందరెందరో ఘనులు పాల్గొని వెనుకంజ వేయక, అదురుబెదురులేక, జంకుగొంకులేక, నిర్భయముగా, అమితోత్సాహముతో, ఒకరికంటె ఒకరుమిన్నగా, పందెముల తోడ, తమ తమ మాంసభక్షణాభిలాషలను సంపూర్తిగా వెల్లడిచేయుచు, మాంసభక్షణోద్యమమును జోరుగా సాగించుచున్నారు. మహాప్రభో! ఇట్టి నరులమధ్య మేము జీవించుటకు అవకాశము లేదు. మహాప్రభో! మమ్ము రక్షింప తక్షణమే, ఇప్పుడే, అతివేగముతో, రావాలండో! రావాలి!

22) ఓ శరణాగత రక్షకా! ఆపద్బాంధవా! మాంస భక్షకులను శిక్షించి, మూగజీవులను రక్షింప అర్జంటుగా, ఇప్పుడే రావాలండో! రావాలి!

23) ఓ ధర్మస్థాపకా! న్యాయపాలకా! ధర్మమునకు హానియు, అధర్మమునకు వృద్ధియు కలిగినపుడెల్లా తమరు అవతరించి, దుష్టశిక్షణ, సాధురక్షణ గావించి, ధర్మస్థాపన చేయుదునని తమరు ప్రతిజ్ఞ చేసినారు. మహాప్రభో! తమ ప్రతిజ్ఞ తక్షణమే రుజువుచేసుకోవాలంటో! రుజువుచేసుకోవాలి!

ఈ విధముగ మూగజీవులు నరులవల్ల తమకు సంభవించే అగచాట్లను విన్నవించుకొని రక్షణ వేడినవి.

## భగవంతుడు అభయహస్త మిచ్చుట.

"మీరిక భయపడవద్దని" వారిష్టదేవతలు అభయ హస్తమిచ్చి జీవహింసలకు తాము గావించే శిక్షలు వినుడని ఏమని చెప్పుచున్నారన—

1) "మాంసము తినువారిని భయంకరమైన నరక మందు పడవేసి, మరల నా మృగములచేత భక్షింపబడునట్లు చేస్తాము."

2) "నీళ్ళయందు మెలగెడు మత్స్యాదులను, భూమి యందు తిరిగెడు పశుపక్షి మృగాదులను, ఆకాశమున సంచరించెడు పక్ష్యాదులను చంపునట్టి వారిని, కాలసూత్రము నెడి నరకములో, పదివేల యోజనముల వెడల్పుగల విశాల పాత్రా దులందు బడద్రోచి క్రింద అగ్నిహోత్రమును, పైన సూర్యుడును మిక్కిలి మండుచుండగా, ఆకలిదప్పులచే మిక్కిలి బాధ చెందుచు, పరుగెత్తుచున్నను, పడియున్నను, కదలకున్నను,

విడువక, తాను చంపినజీవికి ఎన్ని రోమములుండునో, అన్ని వేల సంవత్సరములు బాధిస్తాము."

(మాఘపురాణము, 32 అధ్యాయము 11 శ్లో)

3) "స్త్రీ పురుషులెవ్వరేనియు శరీరరక్షణార్థై, పశుపక్షి మృగాదులను బలియిచ్చిన, వానిని కత్తులతో చీల్చి ఆ రక్తమునే త్రాగించుచు బాధిస్తాం." (భాగవతం 5 స్కంధం 156

4) "జంతుపీడనంబు గావించెడు పాపాత్ములను, దందశూకంబను నరకమునందు పడవేసి, పదునేడు ముఖంబులు గల సర్పంబులచేత కరిపింప చేస్తాం." 156

5) "కుక్కలను పెంచి, వేటసల్పి, మృగముల హింసించు వారిని అస్త్రములచేత మర్దిస్తాం." 150

6) "ఉదక సమీపమందు మాటుబెట్టి, మృగాదులను చంపువారిని కుదియగట్టి మండుటెండలో పడద్రోయుచు బాధిస్తాం."

7) "గ్రామారణ్యంబులయందు, జంతువుల, శూలప్రోతలంగావించి హింసించుచు హర్షించుచున్నవారలను నరకమునందు శూలప్రోతలంజేసిన, ఆకలి దప్పులతో బాధపడుచుండ, కాకులు, గద్దలు వచ్చి వారిని పొడుచుకొని తినునట్లు చేస్తాం." 156

8) "దేహపోషణార్థంబు మూషకాదుల బలనిరోధంబు చేసి వధించువారిని కుంభీపాకనరకములో తుకతుక కాగెడు నూనెకాగులందు ముంచితేలుస్తూ బాధిస్తాం." 133

9) చంపబడుచున్న జంతువునుచూచి శక్తుడగువాడు ఉపేక్షించిన అట్టివానిని భయంకరమైన నరకములో పడవేసి బాధిస్తాం." 138

10) జంతువులను వధించుటలో సంతోషముగలవాడును, 2) వధించుట కాజ్ఞాపించువాడును, 3) చంపువాడును, 4) అమ్మువాడును, 5) కొనువాడును, 6) ఛేదించువాడును, 7) వండువాడును, 8) తినువాడును ఈ ఎనిమిదిమందిని జంతుహింసలలో ప్రధానముద్దాయిలుగా పరిగణించి దండిస్తా"

(మనుస్మృతి 5 అధ్యా. 51 శ్లో.)

ఈ విధంబుగ యమధర్మరాజు చెప్పినతర్వాత బ్రహ్మ లేచి ఏమని చెప్పుచున్నాడన—

1) పశుపక్షిమృగాదులను చంపువారిని చంపబడిన జీవియొక్క శరీరముమీద ఎన్ని రోమములుండునో అన్ని పర్యాయములు తిర్యగ్జంతుజన్మమును పొందుచు, తర్వాత అన్నిసార్లు అంత్యజాతులయందు జన్మించునట్లుచేస్తాం(భారతం)

2) మూగజీవులను హింసించువారికి ఇహపరములందు సుఖము లభింపకుండునట్లు వారి నొసట వ్రాస్తాను."

3) "అరణ్యములో జీవించుచున్న జీవులను చంపువారిని, మరల అరణ్యములో పుట్టించి యితర్లచే చంపబడునట్లు చేస్తాం." (భారతం.)

4) "ఏ పురుషుడు తన సుఖముకొరకు ఇతరులను హింసింపని జంతువులను చంపునో వానిని స్థావరజన్మములందు జన్మింపచేస్తాను."

శాంతించవలెనని శ్రీమహావిష్ణువు రుద్రునితో చెప్పి శాంతి పరచి "ఓ బ్రహ్మాది దేవతలారా! మీ నివాసములకుపొండు. ఓ మూగజీవులారా! భూలోకములో కపిలవస్తు పురమునేలు శుద్ధోధనమహారాజునింట గౌతమ బుద్ధుడను పేరుతో జన్మించి మీ బాధలు రూపుమాపుతాను, మీ నివాసములకు పొండని" శ్రీమహావిష్ణువు చెప్పి అదృశ్యుడయ్యె. వృషభవాహనుడైన శంకరుడు, తమమీద చూపిన దయారసమును శ్లాఘించుకొనుచు, గరుడవాహనుడైన శ్రీ మహావిష్ణువొసర్చిన వాగ్దానమును అడుగడుగునకు తలచుకొనుచు ఎప్పుడెప్పుడు బుద్ధ భగవానుడొచ్చునా, తమ బాధలెన్నడు తీరునాయని మూగజీవులెల్ల బుద్ధ దేవునికొరకు ఎదురు చూచుచుండెను. మూగజీవుల బాధలు రూపుమాప శ్రీ మహావిష్ణువే మన బుద్ధుడుగా పుట్టినాడు. గౌతముడు దేశరక్షణసంగతి తలపక కాలము గడుపుచుండెను.

## బ్రహ్మాదిదేవతలు గౌతమునియొద్దకు వచ్చుట.

భూలోకములోని మూగజీవుల వుసురు ఊర్ధ్వలోకముల నాక్రమించగా బ్రహ్మాది దేవతలు భయపడి ఒకనాటిరాత్రి మన బుద్ధభగవానుని స్వప్నములోకివచ్చి ఏమని ప్రార్థించుచున్నారన—

1) ఓ దేవాది దేవా! తమ శరణుజొచ్చుచున్న ఈ దీనులమొర శ్రద్ధగా నాలకించాలండో! నాలకించాలి!

2) ఓ కేశవా! భూలోకములోని తన వంశీకుల బాధలు రూపుమాపలేదను వాంఛతో కామధేనువులెల్ల తమ

బిరుదులకు స్వస్తి చెప్పుచున్నవి. మహాప్రభో! పశువుల బాధలు బాప తమ రిప్పుడే బయలు దేరాలండో! బయలు దేరాలి!

3) ఓ నారాయణా! తన బంధువుల కష్టాలు తొలగించలేదను ధ్యాసతో అష్టదిక్పాలకులాది వాహనములెల్ల సమ్మోహించుచున్నవి. మహాప్రభో! మూగజీవుల బాధలు బాప తమ రిప్పుడే బయలు దేరాలండో! బయలు దేరాలి!

4) ఓ మాధవా! తన మిత్రులవాంఛలు నెరవేర్ప లేదను తలంపుతో, అష్టదిగ్గజములు తమ పదవులకు రాజీనామా నిచ్చుచున్నవి మహాప్రభో! మూగజీవులబాధ రూపుమాప తమ రిప్పుడే బయలు దేరాలండో! బయలు దేరాలి!

5) ఓ గోవిందా! మూగజీవులబాధలు రూపుమాప లేదను రోషముతో ఆదిశేషుతలలు వంచుచున్నాడు. మహాప్రభో! మూగజీవుల బాధలు బాప తమరిప్పుడే బయలు దేరాలండో! బయలు దేరాలి!

6) ఓ విష్ణూ! మూగజీవుల బాధలు రూపుమాపుటకే తమ రిప్పుడే భూలోకమునందు అవతరించాలు మహాప్రభో! తమరు తక్షణమే బయలు దేరాలండో! బయలు దేరాలి!

7) ఓ మధుసూదనా! భూలోకములోని మూగజీవుల పసుపు ఊర్ధ్వలోకముల నాక్రమించి, అచ్చటివారి నెల్ల దహింపచేయుచున్నది. మహాప్రభో! మూగజీవుల బాధలు బాప తమ రిప్పుడే వెళ్ళాలండో! వెళ్ళాలి!

8) ఓ అచ్యుతా! తమరు జాగుచేసిన ప్రళయము రాక తప్పదు మహాప్రభూ! మూగజీవుల బాధలు బాప తమరిప్పుడే వెళ్ళాలండో! వెళ్ళాలి!

ఈ విధముగ బ్రహ్మాది దేవతలు ప్రార్థింప బుద్ధభగవానుడు వారికి తగిన సమాధానము చెప్పి పంపివేసి, ఉదయముననే లేచి, నగరుచూడవలెనని తండ్రిగారికి కబురుచేసెను. వెంటనే తండ్రిగారు పురమంత రమ్యముగా నుండునట్లును, రోగులు, వికలాంగులు, మొదలగువారు యువరాజుగారికి కనబడరాదనియు దండోరా వేయించి, నగరుచూచుటకు రానలసినదని, ఒక రథము బుద్ధునొద్దకు పంపెను. బుద్ధుని సారథియైన చెన్నుడు రథము నడుపుచుండగా, గౌతముఁడు పురమంతా చూచివచ్చెను. ఆ రోజు వారికి నగరములోని ప్రజలు సౌఖ్యముగ నున్నట్లు కనుపించిరి.

## మూగజీవుల సమావేశము.

మూగజీవుల బాధలు బాపుటకు బుద్ధుడెంతకాలమునకు రాకపోవుటచే మూగజీవులు నరబాధలు పడలేక అవి అన్నియు నొకచోట మరల సమావేశమై ఏమని చర్చింపసాగినవంటే.

ఓ నరులారా! మా పార్టీని సృష్టిచేస్తే ఈ క్రింది తీర్మానములను జయప్రదముగా అమలు జరుపుటకు సిద్ధముగా ఉన్నామని శపథ మొనర్చుచున్నాము. మా పార్టీ తీర్మానములు ప్రజలెల్ల శ్రద్ధగా నాలకింప గోరుచున్నాము.

1) మా పార్టీని వృద్ధిచేస్తే కరప్రకాటకములను వారగోల్తాం.

2) అతివృష్టి, అనావృష్టి బాధలనుండి రక్షిస్తాం.

3) కొలతబద్ధముల పద్ధతి రూపుమాపుతాం.

4) పాడిపంటలకొరత హతము చేస్తాం.

5) ప్రతినిత్యము ఇంటింటికి టీపార్టీగావింప సేవకుల పంపిస్తాం.

6) ప్రతిరోజు మూడువేళలందు విందులుగావింప ప్రతి ఇంటికి జవానుల పంపిస్తాం.

7) సమృద్ధిగలపాడికై కావలసినవారందరికి కావలసినన్ని నాణ్యమైన ఆవులను, గేదెలను విరివిగా దానమిస్తాం.

8) వ్యవసాయమునకై ఖ్యాతిగాంచిన, ఓర్పుగల చురుకైన కోడెలను కోరినన్ని ఉచితంగా ఇస్తాం.

9) ప్రయాణ సౌకర్యములకై వాయువేగ మనోవేగములకన్న నడిగాపోగల వాహనములను వెలలేకుండా ప్రజలందరికి ఇస్తాం.

10) చేలకు కావలసినంత ఎరువులను ధర్మంగా ఇస్తాం.

11) గడగడ వణికించెడు చలిగాలియొక్క దౌర్జన్యపాలన రూపుమాపుతాం.

12) ఏలాటి ఖర్చులేకుండ ప్రతి ఇంటికి, రక్షకభటులను, పాకీవాండ్రను నియమిస్తాం.

13) కొనేవారందరికి పాడిపంటలను అతి చౌక రేటుకు హోటేలతో కొల్లగా సరఫరా చేస్తాం.

14) బీదలు భాగ్యవంతులను పక్షపాతముంచక జనులందరికి సమానమైన ఉపకారములుచేస్తాం.

అవి ఇవి యననేల ప్రజాక్షేమమునకై కావలసిన స్వయంపోషక స్కీములన్నింటిని వెంటనే శోధించి, తక్షణమె అమలుజరుపుచు, నిమిషాలమీద ప్రజల వాంఛలు నెరవేర్ప గలమని ప్రతిజ్ఞలొనర్చుచున్నాము. పరోపకారమందు, నిష్పక్షపాతమందు, ఇంక సమస్త సుగుణములందు మాపార్టీలుగాని, సమఉజ్జీలుగాని, ప్రపంచములో లేవని ఇకపుట్టవని సైకొట్టుచున్నాము. మాపార్టీ ఏఒక్కజాతికి చెందినదికాదు. మా పార్టీ అనేక శతాబ్దములనుండి నేటివరకు పరోపకార దీక్షతో, శ్రమఅనక, పాలుమాలక, అపకారులనక, కులహీనులనక, విశ్వాసముతో, పక్షపాతములేక, సమదృష్టితో, సమస్తజనులకు సమానమైన ఉపకారములాచరించుచు, అహోరాత్రములు మానవ సేవయందె నిమగ్నులమై జనసత్త్వములను ధారపోయుచున్నసంగతి ప్రజలందరికి ప్రత్యక్షమే. జ్ఞానహీనులు జిహ్వారుచికాసించి, అపకారరహితమైన మాపార్టీనిఅభివృద్ధికి రాకుండ కూలద్రోయుట చేతనే, కరువు కాటకములొచ్చి మీావధ పట్టుచున్నవి. పాడి పంటలభివృద్ధిచేయవలెనని ఉపన్యాసము లివ్వనినాయకులుగాని సంచారముచేయనిమంత్రులుగాని, మీాటింగులులేనిఊళ్ళుగాని, ప్రకటనలేని పత్రికలుగాని, తిరస్కరించిన ప్రజలుగానిలేరు. మాటలలో శ్రద్ధచూపుటేగాని ఆచరణలో మాత్రం పాడి

పంటల నశింపుకే ప్రజలందరు శోధపడుచున్నారు. పశువుల మగు మా సాహాయ్యములేనిది, పాడిపంటలేలాగు నభివృద్ధి చేయవలెననుకొంటిరి ? నేలవిడిచి సాముచేయుటెట్లో పశువు లమగు మా ఆధారములేనిది పాడిపంట లభివృద్ధిచేయవలెనని శ్రమపడుటంతే. పశువులమగు నేము అభివృద్ధిగాంచినప్పుడే పాడిపంట లభివృద్ధిగాంచును. మమ్ముల నభివృద్ధిచేయనంత వరకు పాడిపంటలు వృద్ధిగాంచుట కల్ల. మా యభివృద్ధి నని కట్టుట చేతనే పాడిపంటలు నశించుచున్నవని సవాలుచేయు చున్నాము. మా పార్టీని కాలద్రోయుటచేతనే పాడిపంటలు తిరోగమనమై క్షీణించు, కరువుకాటకములకు ప్రజలు ఆహుతియగుచున్నారు. కరువుకాటకములనే అగ్నిజ్వాలల నుండి బైటపడవలెనను ఆశకలదేని, ప్రజలందరు ఏకమై మా పార్టీని అభివృద్ధిచేస్తే పాడిపంటలనే వర్షపు ధారలతో కరువు కాటకములను రూపుమాపి దేశమంతట సుభిక్షముగా నుండు నట్లుచేస్తాము. కరువుకాటకములు నిర్మూలించుటకుగాని, పాడి పంటలభివృద్ధి చేయుటకుగాని అపజయములేని అమోఘమైన దివ్యమైన మార్గమిదియే ఇదితప్ప రక్షించుకొన నితర మార్గములేదు.

భగవంతుని సంతోష పెట్టుటకు మాపంచామృతము లును, పాపరాసులను భస్మమొనర్చుటకు మాపంచ గవ్యము లును, భూదేవి అనుగ్రహము పొందుటకు మాఎరువులును, తప్పమరిరొక మార్గములేదు. తక్కిన మార్గములన్నియు, ఉన్నధనమును ఖర్చుపెట్టించి, ఎన్నోశ్రమలు కల్గించి, అల్ప ఫలములను మాత్రమే యిప్పించునవిగా ఉన్నవి. ఏవిధముగ

కృత్రిమముగల కల్తీ పాలు, పెరుగు, నెయ్యివల్ల హానికల్గు చున్నదో, అదేవిధముగ కృత్రిమపు ఎరువులవల్ల భూములు చెడిపోవుచున్నవి. రోగముల నరికట్టవలెనంటె, కల్తీ పాలు, పెరుగు, నెయ్యి, కృత్రిమపు పైరులను నిషేధించవలెను. భూములు బాగుపడవలెనంటె కృత్రిమపు ఎరువులు వర్జించవలెను. మా ఎరువులకు భూదేవి ఆనందించి, ఫలమిచ్చునట్లుగా, మీరెన్ని కృత్రిమపు ఎరువులువాడినను తగినఫలము ఏనాటికియ్యదు. సారహీనమైన భూములను సారవంతముగను, బలముగల భూములను ఎక్కువబలముగాను చవిటిచేలను పంటభూములుగాను, పంటభూములను బంగారపు చేలగాను మార్చవలెనంటె అది మాపశువుల మలమూత్రముల వలన కావలసినదేగాని మరియొక పద్ధతివలన కాదు. పాడి పంటలను కోరువారును, కరువు కాటకములు పోగోరువారును, ఏకమై ఎంతత్వరలో మాపార్టీని నభివృద్ధి చేస్తారో, అంత త్వరలో కరువుకాటకములు హడలుకు పలాయన సూత్రము నమలు పరచును. పాడి పంటలు వృద్ధియగును అనిసవాలు చేయుచున్నాము. ఇకనైన జాగు సేయక దుర్బోధలు త్రోసివేసి, బుద్ధితెచ్చుకొని తక్షణమె పశుహింసలు నరికట్టి పశువుల నభివృద్ధిచేయు దీక్షగైకొనుట ప్రజలవంతు. వెనువెంటనే అఖిలజనులకు సమృద్ధిగల పాడి పంటలొసగుట మా వంతు. మీకు మాకు నిదియె గొప్ప పందెము. దేశరక్షణకై ఈ స్వల్పపు దీక్షపూననివారు పాడి పంటలపాలిటికి వేరుపురుగులనుటయేగాక, కానరాని దేశద్రోహులైక రువుకాటకములను ఆహ్వానించుచున్నవా రగుదురు

ప్రజల సౌఖ్యమునకై కాంగ్రెసనియు, కమ్యూనిస్టనియు ఇంక ఏవేవో క్రొత్త సిద్ధాంతములను బయలుదేరదీసి మీ హక్కులకై ఏ విధముగా తీవ్రమైన ఆందోళన చేయుచున్నారో, అదేవిధము పశుపక్షిమృగాదులమైన మేముగూడ నరబాధల నుండి రక్షించుకొనుటకు, ఈ క్రింది శాసనములను ప్రవేశ పెట్టుచున్నాము. ఇందుకు ప్రజలందరు ఆమోదించి అనుకూలముగా ప్రవర్తించవలెనని కోరుచున్నాము. ఇందుకు వ్యతిరేకముగా నడచువారిని యమకోట్ల కీడ్పించి తగినప్రాయశ్చిత్తము చేయించగలమని ఇందుమూలకముగా యావన్మంది ప్రజలకు వెల్లడి చేయుచున్నాము.

## ప్రజ లాచరించ వలసిన విధులు

మాతీర్మానములకు లోబడి మావల్ల పొందవలసిన సాహాయము నిత్యము పొందవచ్చును. మారక్షణలో ప్రజలు ఆచరించవలసిన కట్టుబాట్లు ఏవన—

1) మాంసభక్షణకై ప్రజలు ప్రతిరోజు అనేక జీవులను చంపుచున్నారు. ఈ వాంఛ మూగజీవులకు ప్రళయముగా మారుచున్నది గాన ఈ క్షణమునుంచే నరులెల్ల మాంస భక్షణ నిషేధన దీక్షపూనాలి !

2) కలరా మొదలగు రోగములు వ్యాపించినప్పుడు శరీరరక్షణకై జనులు మూగ జీవులను దేవర్లకు బలినిచ్చు చున్నారు. ఈ ఆచారము మా కుటుంబ నాశనమునకు హేతు వగుచున్నదిగాన ఈ రోజునుంచే ప్రజలెల్ల జీవబలి నిషేధన దీక్షసాగించాలి.

3) మానవులు బలవన్మరణములకు ఇష్టపడక స్వభావ

మరణము కలుగునంతవరకు ఏవిధముగ బ్రతుకుచున్నారో అదే విధముగ పశుపక్షిమృగాదులమైన మేముగూడ మానవుల చేతులలో చంపబడుటకు ఇష్టపడక, స్వాభావమరణము సంభవించునంతవరకు జీవించవలెనని కోరుచున్నాముగాన ఈ నిమిషమునుంచే జనులెల్ల జీవహింస నిషేధన దీక్షపట్టాలి.

4) పనిచేయలేని ముసలివాండ్రను నయముగాని రోగులను, గొడ్రాళ్ళను అశక్తతనల్ల ఉపయోగములేదని బ్రతికియుండగనే వారిని తగలవేయక, వారిని ఏ విధముగ మీరు కాపాడుచున్నారో అదేవిధముగ కుంటి, గ్రుడ్డి, ముసలి మొదలగు నిరుపయోగములైన పశువులను కసాయి వారికి అప్పగింపక పోషించాలి.

5) ఎవరైన మిమ్ము కొట్టితే మీరెంతబాధచెందుతారో అంతబాధ మూగజీవులకుగూడ ఉండునని ఎంచి మీరు మమ్ములను బాధించుటమానాలి.

6) ఏవిధముగ మీ తృప్తిదీర మీ ఆకలి దప్పులు తీర్చుకొంటారో అదేవిధముగ మా తృప్తిదీర మా ఆకలి దప్పులు తీర్చాలి.

7) మీ రోగనివారణకై మీరెంత తంటాలుపడ్తారో అదేవిధముగ మా వ్యాధులు బాప కృషిచేయాలి.

8) మీ సౌకర్యములకై మీరు ఎన్ని యత్నములు చేసెదరో అన్ని యత్నములను మాసౌఖ్యమునకై చేయాలి.

అట్లు ఇట్లని చెప్పనేల! సమస్త విషయములలోను మీ వలె మమ్ములనుగూడ చూడవలెను. అట్లుచూడలేని మీ

## మానవులు మాంసభక్షకులు కారు

మాంసభక్షణనుగూర్చి ప్రజలలో అనేక వాదనలు గలవు. ఏవన—

1) పశుపక్షి మృగాదులను మానవుల ఆహారమునకే సృష్టింపబడుచున్నవని వాదించువారు కలరు. సెభాష్! సెభాష్! "మా ఆహారమునకే మానవులు పుట్టుచున్నారు. మాకుకానరాకుండాతిరుగుచున్నారేమని"సింహ వ్యాఘ్రాదులు అరచుచున్నవి. వాటి కోర్కెలు ప్రజలు తీర్చిన మీ వాదనకు మేము ఇష్టపడ్తాము.

2) మానవులే మా ఆహారమునకు పుట్టుచున్నారో లేక మేమే మీ ఆహారమునకు సృజింపబడుచున్నామో న్యాయపద్ధతితో మీరు తేల్చుకోవలెనంటే రెండవవారి సహాయములేకుండా, ఏ ఆయుధములేకుండా మా వ్యాఘ్రాదులెదుటకు మీరుపోయివస్తే మీ తర్కమును అంగీకరిస్తాము.

3) మానవులలోనేగాక పశుపక్షిమృగాదులలోగూడ శాకాహారులుకన్న మాంసాహారు లెక్కువగాన మాంసము తినవచ్చునని కొందరు వాదిస్తారు. భేషు! భేషు! మెజార్టి ప్రకారము వర్తించవలెనంటే, మూగజీవులకు చేతులులేవు గాన మీకు గూడ హస్తములుండరాదు. ప్రజలలోని మెజార్టి ప్రకారము పోవలెనంటే స్త్రీ జనాభే ఎక్కువగాన పురుషులందరు అంగచ్ఛేదన చేయించుకోవాలి, ఈ విధముగ మీరుంటే మీ వాదనకు మేము సమ్మతిస్తాం.

4) మాంసభక్షణ పాపమైతే ఈపాటికి మానవసృష్టి ఆగిపోవలసియుండునని వాదించువారుగలరు. మానవజన్మ ఎత్తిన వారికందరికి తిరిగి మానవజన్మ వచ్చునని ఏశాస్త్రము వాదించ లేదు. మాంసభక్షకులకు మానవజన్మ రాదని శాస్త్రము లన్నియు ఖాయపరచినవి. మూగజీవులలోని సాత్విక జంతు వుల దీక్షకు భగవంతుడు హర్షించి వాటికి మానవజన్మ కలుగ జేయుటచేతనే నేటి జనాభా వృద్ధియగుటకు హేతువని తెలుసుకొనవలెను.

ఇటువంటి వాదన లింక ననేకముగలవు. వాటికి సమా ధానము వ్రాయవలెనంటె ప్రత్యేకముగ గొప్పగ్రంథ మగును. విజ్ఞానముకొరకే ప్రజలు యత్నించుచున్నారు గాన అట్టి విషయములే చెప్పదలచినాము. మానవుడు మాంసభక్షకుడు కాదని నేము రుజువుచేసే దాఖలాలు ఏవన—

1) మాంసభక్షక జంతువులన్నియు మాంసమునే తిను చున్నవి గాని, కొన్ని జంతువులు తినుటయు, కొన్ని జంతువులు తినకపోవుటయులేదు. మానవుడు మాంసభక్షకుడే అయిన యెడల మానవులందరును మాంసమునే తినుటకు అలవాటు పడియుండవలెను. కొందరు తినుటలేదు గనుక మానవుడు మాంసభక్షకుడు కాదని ఇందువలన నిర్ధారణ యగుచున్నది,

2) మాంసభక్షక జంతువుల దంతములు, నాలుక మానవులకున్నరీతిగా నుండవు. చీకటియందు వాటికి దృష్టి మిక్కిలి ప్రకాశించును, మానవులకు మందగించును. అవి కనుపించిన జంతువులను నోటితోనే చీల్చుకొని మాంసమును

తినును. మానవుడట్లుగాక కత్తులతో నరికి మాంసమును తెసి వండుకొని తినును.

వాటికి ఆకలి తీరునంతవరకు మాంసమునే తినునుగాని యితర పదార్థము ముట్టదు. మానవుడట్లు తినలేడు. ఇందు వల్ల మానవులు మాంసభక్షకులు కారని ఋజువగుచున్నది. దంతములకు, నాలుకకు కండ్లకు దాఖలా కుక్కలను, పిల్లులనుచూడ వచ్చును.

3) మాంసము తినెడు జంతువులకు పుట్టెపిల్లలు, వెంటనే కళ్ళు తెరచి చూడలేవు. 10, 15 రోజులైన తరువాత కండ్లు తెరచి చూచును. దాఖలాకు కుక్కపిల్లలను, పిల్లి కూనలను చూడుడు. మానవులకు జన్మించిన శిశువులు వెంటనే నేత్రములు తెరచి చూచెదరు. ఇందుచే మాంస భక్షకుడు కాదని నిర్ణయమగుచున్నది.

4) సృష్టి మొదలు నేటివరకు మాంసభక్షకజంతువులు మాంసమునే తినుచున్నవి గాని శాకాహారము తినుటలేదు. ఎట్లన ఎన్ని కరువులు వచ్చినను, ఎన్ని కష్టములు వచ్చినను ఆకలి దహించుచున్నను తోడేళ్ళు, చిరుతగండ్లు మొదలగు నవి ధాన్యాదులను తినవు.

5) శాకాహారము తినెడు జంతువులన్నియు అనాది నుండి ఇప్పటి వరకు శాకాహారమునే తినుచున్నవి గాని మాంసాహారమును తినుటలేదు. ఎట్లన పేగులు కాల్చునంతటి ఆకలి కల్గినను ఎద్దులు, ఆవులు మొదలగునవి మాంసపు ముక్కలు తినవు.

6) సృష్టిరోజున పశుపక్షి మృగాదులకు ఏ ఆహారము సృజింపబడెనో అట్టి ఆహారమునే పశుపక్షి మృగాదులు నేటి వరకు తిని బ్రతుకుచున్నవి. గాని వాటి ఆహారమును వదలి ఇతర జంతువుల ఆహారమునకు అడ్డు తగులుటలేదు.

ఏమి వినాశనము దాపరించినదో కాని నరజాతి మాత్రము విపరీత బుద్ధికల్గి, ఈశ్వర శాసనము ధిక్కరించి, తమకు నియమించిన శాకాహారముతో తృప్తిచెందక, మాంసమునుగూడ మెక్కుచున్నారు. ఇందుచే మాంసభక్షక జంతువుల నోటివద్దకూటికి అడ్డుతగిలినవారగుచున్నారు.

ఇకనైన మీ బుద్ధిమార్చుకొని మానవజాతికి మాంస భక్షణ నియమింపబడలేదనియు, దురభ్యాసమువల్ల అలవాటు అగుచున్నదనియు తెలుసుకొని మానవజన్మ ఎత్తినవారెల్ల బొందిలో ప్రాణముండువరకు మాంసభక్షణ నిషేధ దీక్ష నాచరించాలి. ఈ మాత్రపు దీక్షను నాచరింపనివారు మాంసభక్షకజంతు జన్మలు కావలెనని కృషిచేయుచున్నవారగుదురు.

ఏ వాంఛకై మీరు మాంసము తినుచున్నారో అటువంటి వాంఛలన్నియు శాకభక్షణతోగూడ పొందవచ్చునని మేము ప్రత్యక్షముగా దాఖలా చూపుచు ఋజువుచేయుచున్నాము. ఏలాగన—

1) బలమువచ్చుటకు మాంసాహారము ముఖ్యమని భావించునట్టి జ్ఞానహీనులకు, బుద్ధిచెప్పుటకే ఎద్దులు, దున్నలు మొదలగు మహాపశుజాతి, గడ్డినే తినుచు, దేహబలమును

సంపాదించి అలివిమాలిన బరువులు మోయుచు, కష్టమైన పనులు చేయుచున్నవి. వీటినిచూచైన మానవజాతి బుద్ధి తెచ్చుకొని, బలమునకు మాంసభక్షణ మనసరము లేదనితలచి, తక్షణమె మాంసభక్షనిషేధన దీక్ష బూనాలి.

2) శరీర పుష్టికై మాంసపుకండ లవసరమని తలచువారికి జ్ఞానముబోధించుటకె, ఏనుగులు మొదలగునవి ఆకులు, గడ్డిని మాత్రమే తినుచు, చెట్లనుకూడ పెళ్ళగించగల బలముకలిగి పర్వతాకారముగా పెరిగి, అమితమైన శరీరపుష్టి కండపుష్టి కలిగి మదించియున్నవి. ఇందుచె బలమువచ్చుటకుగాని, కండ పుష్టికల్గుటకుగాని, శరీరపుష్టికల్గుటకుగాని, మాంసాహారము అవసరము లేదనియు, ఎవరికి నియమించిన ఆహారము వారుతినుటచేతనే బలమువచ్చుచున్నదని, ఋజువగుచున్నదిగాన ఏనుగలను చూచైన, మీరు తక్షణమె మాంసభక్షనిషేధన దీక్ష సాగించాలి.

3) ఇంద్రియ వృద్ధికై మాంసము తినమరిగిన వారెల్ల మా గార్ధభజాతినిగాంచి వెంటనె మీరు బుద్ధి తెచ్చుకోవాలి.

4) చనుబాలవృద్ధికై మాంసము మెక్కెడువారెల్ల మాగేదెలను వీక్షించి, మీదురభ్యాసములు తక్షణమె రూపుమాపాలి.

5) కంఠధ్వనికై మాంసపు ముద్దల నారగించు వారెల్ల మాకోయిల జాతిని తిలకించి, మీదుర్బుద్ధులను తక్షణమె భస్మము చేయాలి.

6) రోగనివారణకై మాంసము భక్షించు వారెల్ల మా మాంగజీవులను ఆదర్శముగ నుంచుకొని వెంటనే మీదుష్ట బుద్ధులను ధ్వంసము చేయాలి.

## మా నాయకులు

మా కులపెద్దలకు మించిన పండిత శిఖామణులుగాని, తపోధనులుగాని, పరాక్రమశాలురుగాని ఏ లోకమందునులేరు. మాలోని ఘనులెవరన—

1) మా ఆదిశేషుయొక్క ఆధారముచేతనే సమస్త లోకములు నిలచియున్నవి. వీని మహిమ త్రిలోకవాసులందరికి ప్రత్యక్షమే. వీని నామము స్మరించువారికి సమస్తకోర్కెలు నిమిషములో నెరవేరును.

2) కోరినకోర్కెలను క్షణములో తీర్చగలిగినట్టి మా కామధేనువుకు సరివచ్చువారు మూడు లోకములందైనలేరు.

3) ఇంద్రాది దేవతలను కట్టివేసి అమృతభాండమును తెచ్చినట్టి మా గరుడ భగవానుని పరాక్రమము సమస్తలోకములవారికి స్పష్టమే. వీనిని స్మరించుటవల్ల సమస్త వాంఛలు నెరవేరును.

4) మాధర్మపక్షులలో సమానముగ నాలుగు వేదములకు పూర్తిగ అర్థము చెప్పగలవారు ఏ లోకమందునులేరు.

5) వైద్యవిద్యలో మా అశ్వనీదేవతలకు సరివచ్చువారు ఏలోకమందులేరు. వీరి నామము తలచుకొనువారికి సకల రోగములు భస్మమగును.

6) దేవతలు అమృతము తెచ్చుట, దేవదానవుల యుద్ధము చూచినవాడును, భూమ్యాకాశముల ననేకసారులు ప్రదక్షిణమొనర్చినవాడును, నాలుగు యుగములందు నున్న వాడును, ఉదయాద్రినుండి అస్తాద్రిని దాటి కైలాసమునకు ప్రతినిత్యము వెళ్ళివచ్చునట్టివాడైన మా జాంబవంతుడు తప్ప మరెవ్వరును లేరు.

7) పుట్టినతోడనే ఉదయించుచున్న సూర్యబింబమును చూచి ఫలమను భ్రాంతితో భానుని మ్రింగబోయినవాడును, లోకములో వాయువులేకుండ చేసినవాడును, బ్రహ్మాది దేవతలచే సమస్తవరములు పొందినవాడును, ఉదయాద్రిపై నొక కాలును, అస్తగిరిపై నొక కాలునుంచి సూర్యభగవానుని ఎదుట నిలువబడి సమస్త విద్యలు నేర్చుకొన్నవాడును, నూరు యోజనములుగల సముద్రమును గోవు పాదముగాచేసి దాటినవాడును, లంకను దగ్ధముచేసినవాడును, పాతాళముజొచ్చి మైరావణాది రాక్షసులను హతముచేసి రామలక్ష్మణులను తెచ్చినవాడును, సంజీవి పర్వతమును పెకలించి క్షణములో తెచ్చినవాడును, దోమలవలె రాక్షసులను సంహరించినవాడును, 'నీ ఆధారమువల్లనే మేము బ్రతికినామని' భగవంతునిచే శ్లాఘింపబడినవాడును, 'గానవిద్యలో నీకంటె మించినవారులేరని' నారదాదులచే పొగడబడినవాడైన మా ఆంజనేయ స్వామి తప్ప మరెవ్వరునులేరు. వీని నామము ఉచ్చరించినంత

మూత్రమునందే శాకినీ, ఢాకినీ, మొదలగు పిశాచములు భస్మమగును. వీని మహిమ సమస్త లోకవాసులకు విదితమే. వీనిని పూజించిన సమస్త కోరికలు క్షణములో తీరును.

అన్ని లోకములందును పూజింపబడుచున్న మా పూర్వీకులను లెక్కింప బ్రహ్మకైన తరముగాదు. పూర్వగాథలేల నేడైన మాతో సమానమైన పూజారులు మీలోలేరని గట్టిగా వాదించుచున్నాము. ఎట్లన—

1) కోరినకోర్కెలతీర్చుటలో మా గోదేవికి మించిన వేల్పులు ఏ లోకమందునులేరు. మీ ఇష్టదేవతలందరు మా గోదేవిలో నివసించుచున్నారు. ఎవరెవరన 1) బ్రహ్మదేవుడు మా గోదేవియొక్క మూపురముగాను, 2) శ్రీమహావిష్ణువు కంఠముగాను 3) రుద్రభగవాన్ ముఖముగాను 4) దేవతలు కళేబరముగాను, 5) మహాఋషులు రోమకూపములుగాను 6) మహానాగములు తోకగాను, 7) కులపర్వతములు డెక్కలుగాను, 8) గంగా మొదలగు మహానదులు గోమూత్రముగాను 9) సూర్యచంద్రులు నేత్రములుగాను 10) ఒక కొమ్ము ఇంద్రుడును, రెండవ కొమ్ము యమధర్మరాజుగాను 11) భూదేవి రొమ్ముగాను, 12) మహాలక్ష్మి గోమయము గాను, 13) స్కందుడు ముక్కు దండిగను 14) అశ్విని కుమారులు ముక్కు తమ్మెలుగాను, 15) సమస్త తీర్థములకు రాజగు నతడు లలాటముగాను, 16) సరస్వతీదేవి మెడగాను, 17) సనకసనందన, సనాతన, సనత్కుమారులు కడుపుగాను, 18) గోమయములో లక్ష్మి, యమున 19) మూత్రములో

గంగ, లక్ష్మి 20) పాలలో సరస్వతి, 21) పెరుగులో నర్మద, 22) నెయ్యిలో అగ్ని మొదలగు దేవతలున్నారు. ఈ విధముగ మీ యిష్టదేవతలందరు మా గో దేవియొక్క ఆకారములో వచ్చియున్నారు. మా గోవులను పూజింపనివారు తమ యిష్టదేవతలను అవమానముచేసినట్లగును. గానమీ కోర్కెలు గట్టెక్కవలెనంటె మా గోవులను పూజించాలి. (భారతం)

2) నిమిషములో భూప్రదక్షిణఫలము పొందవలెనంటె మా గోవును పూజించి గోవుకు ప్రదక్షిణమొనర్చాలి.

3) ఎనుబదియారుకోట్ల దివ్య సంవత్సరములు స్వర్గ భోగము లనుభవించవలెనంటె మా గోవులను దానము చేయాలి. [అనుశాసనీకపర్వం 2 ఆశ్వా 333]

4) శోక రహితమైన లోకములను, సూర్యునివంటి విమానములను, బంగారపు మేడలు, రత్నములచేత ప్రకాశించెడు శయ్యలు, చక్కని రూపము, చక్కని అలంకారము గల సుందరీమణులు లభించవలెనంటె గోదానము చేయాలి,

— భారతం.

5) దుస్స్వప్నఫలములు, మృగార్తి, చోరబాధ, రోగబాధ, శత్రుబాధ, పిశాచపీడ, గ్రహపీడ నశించి క్షేమస్థైర్య, విజయ, ఆయురారోగ్య ధనధాన్య పుత్ర పౌత్రాభివృద్ధి కలుగవలెనంటె గోకీర్తనమొనర్చాలి. 3 అశ్వా 49.

6) ఉత్తమమైన భగవదారాధన చేయవలెనంటె మా పంచామృతములతో చేయాలి.

4) మా గజరాజాదులతో దీటైన బలశాలును మీలో మచ్చునకైన కానరాదు.

5) మా పశుజాతివలె శాకభక్షణతోనే తృప్తిచెందుచు పనులుచేయువారు మీలో లేరు.

6) మా పశుజాతివంటి నికరమైన శాకభక్షకులను మీలో చూపించలేరు.

7) మా భ్రమరజాతివంటి నికరమైన మాంసభక్షక నిషే. పకులు మీలో పుట్టలేదు.

8) మా చకోరపక్షులవంటి స్వచ్ఛమైన అహింసా పరులు మీలో జన్మించలేదు.

9) మా పావురములవంటి శిలాభక్షకులను మీలో నొకరినైనను శాంపిల్‌కు చూపింపలేరు.

10) మా సర్పజాతివలె వెయ్యిసంవత్సరములు జీవించు వారిని మీలో నొకరినైన చూపింపలేరు.

11) మా శునకజాతివంటి నికరమైన విశ్వాసకులు, కృతజ్ఞులు, ప్రభుభక్తి పరాయణులు, నరజాతిలో లేరని సవాల్ చేస్తాం.

12) మా మూగజాతివలె నీతినియమములు, జాతిధర్మములు అనుష్టించువారు భూలోకములో లేరని సైకొట్టాం.

13) ప్రజల ఆధారమువల్ల జీవించుచున్నట్టి మూగ జీవులలో నొకటిగూడ ప్రజలకు అపకారము చేయునదిలేదు. మూగజీవుల సాహాయముతో జీవించునట్టి ప్రజలలో నూటికి నూరుమంది మూగజీవులకు ద్రోహమొనర్చువారె ఉన్నారు.

14) మానవులె మానవసేవచేయువారు, మీలో పుట్టిరే దని సవాలుచేస్తాం.

15) ఏ విషయములోనైనను మా జాతిని పోటీచేయ గలవారు మీలో జన్మించలేదు.

మా తోడులేనిది మీరు ఏనాడు రణరంగమునకు బయలుదేరలేదు. మీ బలపరాక్రమములు, మీ కవిత్వ ములు, నాట్యములు, సద్గుణములు, వెల్లడియగుటకు మా పేరు పెట్టుకోకున్న మీకు ఖ్యాతిరాదు. మీ ముద్దు ముచ్చ ట్లలోనైన మాపేరు వచింపకున్న మీ కానందము లేదు. చివాట్లలోనైన మా పేరులేకున్న మీకు బుద్ధిరాదు. మీ బుద్ధిలో మాకుపనిలేదు నిది మొదలు చివాట్లలో మా పేరు వచించువారిపైన చార్జిపెట్తాం. మా బిరుదులు పొందినవారెల్ల మా పక్షమున నుండరేని శిక్షలువేయిస్తాం. మా సాహాయ్య మువల్ల జీవించేవారెల్ల మాకు అండగా ఉండరేని జైలుకు పంపిస్తాము.

మమ్ములను బాధించునట్టి. చంపించునట్టి నరజాతికి తగిన ప్రాయశ్చిత్తము చేయించుటకే పరలోకమున మా ప్రతినిధులు కాచుకొని యున్నారు. ఎవరన—

1) జంతుహింసకుల వాంఛలను రద్దుచేయుటకే, అదిగో మా మూషికరాజు విఘ్నేశ్వరుని బ్రహ్మరథముబట్టి బ్రహ్మాండ మంతట త్రిప్పుచున్నాడు.

2) జంతుహింసకులను ఏలాటి జన్మలందు పుట్టించవల

సినది నిర్ణయించి చెప్పుటకే, మా రాజహంస బ్రహ్మదేవుని ఎదుట కాపలాయున్నది.

3) జంతుహింసకులు అనుభవించవలసిన అవస్థలను సక్రమముగ అమలుజరిపించుటకె అదిగో మా గరుత్మంతుడు శ్రీ మహావిష్ణువును వెంటవేసుకొని విహరించుచున్నాడు.

4) జంతుహింసకులకు తగిన ప్రాయశ్చిత్తముచేయించుటకే యమ దర్బారులో మా మహిషము కాచుకొని యున్నది.

5) జంతుహింసకులను మర్దింపచేయుటకె మావృషభేశ్వరుడు ఈశ్వరుని వెంట తిరుగుచున్నాడు.

నరబాధలు పడలేక మాలో పాపమగల ఇంకననేక పశుపక్షిమృగాదులు భగవంతుని మెప్పించి పరలోకమున జంతురక్షణ ప్రతినిధులుగానుండి మూగజీవులమీద దౌర్జన్యముసాగించే రౌడీగుంపును మర్దించుచున్నారు. మూగజీవులను గూడ దైవస్వరూపులవలె పూజించుమని ప్రజలకు బోధించుటకే జగత్పితయైన భగవంతుడుగూడ అనేక తిప్పలు పడుచున్నాడు ఎట్లన—

1] ఇదిగో ఆలకించుము. చేపలను వధించిన తనను వధించినట్లేయని నర జాతికిబోధించుటకే శ్రీమహావిష్ణువు మత్స్యావతారమెత్తినాడు.

2] పందులను హత్యచేయువారికి ఉరిశిక్షలు ఖాయమని చెప్పుటకే శ్రీమన్నారాయణమూర్తి వరహావతారమెత్తినాడు.

3] పశువులసేవయే తనసేవయని దాఖలా చూపుటకే శ్రీకృష్ణభగవానుడు పశుకాపరైనాడు.

జీవరాసులన్నియు తన స్వరూపములై, వాటి జోలికి పోయినవారికి శిక్ష ఖాయమని జనులకు హెచ్చరించుటకే జగత్పితయైన భగవంతుడు ఇంక ననేక అవతారము లెత్తు చున్నాడు. భగవంతుని ప్రబోధములనైన గమనించి వెంటనే ప్రజలెల్ల జంతుహింస నిషేధనదీక్ష పూనుదురుగాక. ఈ స్వల్పపుదీక్ష నాచరింపలేని జగద్రక్షకుడైన భగవంతుని సందేశములనుకూడ ధిక్కరించినవార లగుదురు.

## మా జోలికివచ్చినవారు పొందిన ఫలము

సృష్టికి ప్రతిసృష్టి చేయగల మహాతపస్సంపన్నులు కూడ మూగజీవులయెడ నొనర్చిన స్వల్పదోషములనైన తప్పించుకొనలేక ఎన్ని అగచాట్లు పడ్డారో ఆలకించుడు—

1] యమధర్మరాజును శిక్షించినట్టి మాండవ్యు డంతటి వాడె తన చిన్నతనములో తూనీగలకు నొనర్చిన అల్పదోషమును తప్పించుకొనలేక అనేక సంవత్సరాలు కొరతబాధ ననుభవించినాడు.

2) స్వయముగా భగవంతుడే తనయింటికివచ్చి వైకుంఠమునకు తీసుకొనిపోయినట్టి, మా భద్రాచల రామదాసు డంతటి వాడే గత జన్మములో చిలుకను పంజరములోనుంచిన స్వల్ప దోషమునకే 12 సంవత్సరములు కారాగారమున బాధ పొందినాడు.

3) మమ్ములను వేటాడినందుకే, మీ పాండురాజు, దశరథ మహారాజు, మొదలగు రాజాధిరాజులుగూడ, శాపదగ్ధు లయినారు.

4) మా ఉసురు తగిలినందుననే, భగవంతునకు గూడ సాధ్యముగాని, లోకకంటకుని, తన చూపుచేతనే భస్మము చేసి నట్టి ముచికుంద మహారాజుకు మోక్షము రాలేదు.

సృష్టికి ప్రతిసృష్టి చేయగల మీ కులపు పెద్దలెంద రెందరో, మా కొనర్చిన అల్పదోషములనుండి తప్పించుకొనలేక మా యుసురుకు ఆహుతి ఐనారు. ఇక మీగతి ఏమగునో పారజూచుకొనుడు.

1) భక్షణకనుచు ఆరాటపడి, మక్కువతో మనసార, ఉల్లాసముతో, మీ రొనరించుచున్న జంతు హత్యలకు, మీ రెన్ని జన్మలెత్తి. ఎన్ని బాధ లనుభవించవలసి యుండునో బాగుగా ఆలోచించు కొనుడు.

2) పండుగలనుచు, శోధించి తెచ్చి, చేతులార, మీరు గావించుచున్న జంతుహత్య హింసలకు, మీ రెన్ని అగచాట్లు పడవలసియుండునో, బాగుగా గ్రహించుకొనుడు.

3) విందులకనుచు, వెతికించి తెచ్చి, శ్రద్ధతో మీ రొనరించుచున్న జంతువధలకు, మీరెన్ని అవస్థలు పొంద వలసియుండునో, బాగా ఆలోచించుకొనుడు.

4) మందులకనుచు, సాధించి తెచ్చి, మనస్ఫూర్తిగ మీరు చేయించుచున్న జంతు హత్యలకు, మీ కెన్ని ఉపద్రవ ములు రావలసియుండునో, బాగా ఆలోచించుకొనుడు.

5) కొలుపులనుచు, తెచ్చి, పట్టుదలతో, మీరు నర
కించుచున్న, జంతు హింసలకు, మీరెన్ని అష్టకష్టాలు పొంద
వలెనో, బాగా ఆలోచించుకొనుడు.

6) మాచేత రాత్రింబగళ్ళు చాకిరి చేయించుకొని,
మా ఆకలిదీర మేత వేయక. మీ ఇష్టము వచ్చినప్పుడెప్పుడో
గుప్పెడు మేత వేయుచు, కొలత బత్తెములతో, మమ్ములను
ఆకలి బాధతో అలమటింపచేసిననాటి, క్షుద్బాధాదోషము
ఏమగుననుకొంటిరి ?

7) చెప్పశక్యముగాని బాధ లన్నిటినో పెట్టి, మాచేత
పనులు చేయించుకొన్ననాటి, దౌర్జన్యఫలము ఎవరనుభవించె
దరనుకొంటిరి ?

8) మాచేత చాకిరిచేసినన్నాళ్ళుచేయించుకొని, చాకిరి
చేయలేని రోజులలో, మా మేలును తలపక, మమ్ములను
కసాయివారికి అప్పగించిననాటి మహాపాతకము మిమ్ములను
కట్టికుడుప, దనుకొంటిరా ?

9) మేము పాలిచ్చిననాళ్ళు త్రాగి, మేము ఎండిపోయిన
వేళ, మా ఉపకారము తలపక, మమ్ము శిరచ్ఛేదనకు పంపిన
నాటి ఘోరపాతకము, మీవెంట వచ్చి మిమ్ము వేధించదను
కొంటిరా ?

10) మమ్ములను పెంచి పెద్దచేసి, మమ్ములను కోత
కిచ్చిననాటి ద్రోహము వ్యర్థముగా పోవుననుకొంటిరా ?

11) భక్షణకని, పండుగని, మందుకని, విందుకని,
మొక్కుబడికని. మమ్ములను హత్యచేసిననాటి మహాపాపము,
మిమ్ములను బాధించదనుకొంటిరా ?

12) భగవంతుడు మత్స్యవరాహావతారములెత్తినాడను గౌరవమైన లేక, వాటిని భక్షించినవాటి దోషమే, గాలికి పోవు ననుకొంటిరా ?

అవియివి యననేల మా యెడల మీరుచూపుచున్న దౌర్జన్యమునకు, ప్రతిఫలము ఏనాటికయినా అనుభవింపక తప్పదని సవాలు చేయుచున్నాము. నరులవలెనే నేముగూడ ఆపద లెన్నివచ్చినను, తప్పించుకొని శాశ్వతముగా బ్రతుక వలెనని యత్నింతుముగాని, నరులు పదిమంది ఒకటై తలపడి మమ్ములను వధించుట, రక్షించుకొన శక్తిలేక, తన్నుకొనుచు, ప్రాణభిక్షకై, దిశలు దద్దరిల్లునట్లు అరచుచున్నను ఒకరికైనను కనికరమురాక, దుష్టబుద్ధులై, పాపపుణ్యముల సంగతి ఆలోచించుటయందు అవకాశమివ్వక, పాప పుణ్యాలు తర్వాత చూద్దామనుచు, మూగజీవులను వధించి మెక్కుచున్నారు. వధించునప్పుడు మా నేత్రములనుండి కారు కన్నీరే మీకు జననమరణ సముద్రమై, మా దుఃఖారావములే మీకు ఆపద తరంగములై, మా ముక్కునుండి వచ్చు శ్వాసలె వ్యాధులై, మా అరుపులే భయంకర శాపములుగ పరిణమించి, మా వలెనే మిమ్ములను ప్రతిజన్మలో దిక్కులేనివారిగా నొనర్చి, నేము పడినంతబాధను మిమ్ము లనుభవింపచేయుచు, మిమ్ముల ననేక తుచ్ఛమైనజన్మ లెత్తింప చేయుచుండునని దృఢముగా చెప్పుచున్నాము. పాపపుణ్యములమాట తలపక, మామీద మీరు సాగించిన దుండగముల ఫలమే, నేడు మీకు అష్టు వచ్చి, మీ వధ పట్టుచున్నది. ఎట్లన—

1) మా యుసురువచ్చి వేధించుటచేతనే, మీాకు అహా ర్నిశలు ఎంత కష్టపడి పనిచేయుచున్నను, కడుపునిండ తిండి, కట్టను గుడ్డ, ఉండను ఇల్లు లేక, చావు బ్రతుకు గాని జీవన ముతో మీాకు నానాఅగచాట్లు పడుచున్నారు.

2) మా ఉసురు వెంటబడుటచేతనే మీాకు వికలాంగ జన్మలు వచ్చుచున్నవి.

3) మా యుసురువల్లనే వ్యాధులు వచ్చి మిమ్ము వేధించుచున్నవి.

4) మా యుసురుయొక్క ప్రేరేపణవల్లనే మీాకు ఉపద్రవములు సంభవించుచున్నవి.

5) మా యుసురుయొక్క ప్రభావమువల్లనే మీాకు అష్టకష్టములు ప్రాప్తించుచున్నవి.

అది ఇది యననేల మాఉసురే ప్రజలందరిని ముట్టడించి అన్యోన్య మైత్రి చెరచి, మనస్పర్థలు కల్పించి, కలహాములు పెట్టుచు, కరువు కాటకములను, భూకంపాది ఉపద్రవములను, కలరా మశూచకాది రోగములను కల్పించుచు, ప్రకోపద్రవ ములను వృద్ధిచేయుచు, ప్రజానాశము చేయుచున్నది. మా బాధలు బాపనంతవరకు, మానవులకు సౌఖ్యము కల్గుట కల్ల. అదిగో మీా కొనచ్చుచున్న మాంసభక్షణ, జంతు హింసల దోషమె, ప్రళయకాలాగ్నివలె ప్రజ్వరిల్లి, ప్రజానాశముచేయ నలుప్రక్కల వ్యాపించి పైకెగబ్రాకుచున్నది. దుష్టుల బోధలు నమ్మి మోసపోతిరా ఆపదజ్వాలలకు ఆహుతి యయ్యెదరు. మీా నిర్దయను పారదోలి, బుద్ధితెచ్చుకొని జాగుసేయక, అతి శీఘ్రముగ, తక్షణమే, మాంసభక్షణ, జంతుహింసల నేడి,

ప్రళయకాలాగ్ని జ్వాలలను రూపుమాపుడు. వెంటనే దేశో పద్రవములు నశించి, దేశమంతటు పాడిపంటలతో, ధనధాన్య ములతో వృద్ధిగాంచి మీరుకోరిన కోర్కెలు నెరవేరుచు, సదా సర్వసౌఖ్యము లనుభవించగలరు. ఈమాత్రపు పని నాచరింపలేని, మీరు అధోగతికి పోవుటకే యత్నించుచున్న వారగుదురు.

మనమందరము అనగా మూగజీవులును, మానవులును కశ్యప ప్రజాపతియొక్క సంతతిలోనివారమే కావున మమ్ము లను, నరులు సోదరభావముతో చూడవలెనని కోరుతున్నాము. సమస్త ప్రాణులను సృష్టించినది భగవంతుడే గాన ఈ జీవ రాసు లన్నిటికి ఆయనె తల్లియు తండ్రియై యున్నాడు. జగ త్పితయైన భగవంతుడు సర్వజీవులను, సమాన ప్రేమతో, శ్రద్ధతో చూచును. గాని మానవులను ప్రేమతోను, మానవేతర జీవులను ద్వేషముతోను, చూడడని దృఢముగా తెలుసు కొనవలెను. తేలు, పాము మొదలగు విషజంతువులనుగూడ, చంపకూడదని, హెచ్చరించుచున్న ధర్మశాస్త్రములను, మీరు తిరస్కరించుటయేగాక. క్షణ సౌఖ్యమునివ్వగల జిహ్వారుచికై నెత్తురుకండల కాసించి. ప్రజలు తమ చేతులార నిరపరాధము లగు జంతువుల నెన్నిటినో చంపుచున్నారు. ఇంతకంటెమించిన దుర్మార్గులు గాని, క్రూరులుగాని, పాపులుగాని లేరని రూఢిగా వాదించుచున్నాము. హానిచేయునని విషజంతువులను చంపు చున్నారు సరే? సాధుజీవులు ఎవరికి అపకారము చేయునని చంపుచున్నారు? తింటానికే చంపితె పాపములేదని మీ ఉద్దేశమా? ఇదే దుర్మార్గము కానిచో, చోరీలు, దోపిళ్ళు

నేనుగాకున్న శ్రేష్ఠమైన యమదర్బారులోను, రాబోవు జన్మలోను మీ దుష్టకృత్యములకు తగిన ప్రాయశ్చిత్తము ననుభవింపక తప్పదు. దౌర్జన్యము చూపినట్టి రాక్షసాదులకు ఏగతి పట్టినదో ఆగతే మూగజీవులమీద దౌర్జన్యము సాగించిన వారికి పట్టక తప్పదు.

1) ఏ లోకరక్షకుని ఆజ్ఞవల్ల సూర్యచంద్రాదులు సైము ప్రకారము గస్తీ తిరుగుచున్నారో

2) ఏ సర్వేశ్వరుని అధికారమువల్ల సృష్టి స్థితిలయములు జరుగుచున్నవో

3) ఏ పరమేశ్వరుని ఆర్డరువల్ల కరువు కాటకములు ప్రవేశించుచున్నవో

4) ఏ జగద్రక్షకుని ఆదేశమువల్ల మాతృగర్భములలోని పిండములు రక్షింపబడుచున్నవో

5) ఏ శిక్షాధిపతియొక్క శాసనమువల్ల కష్టసుఖములు వచ్చుచున్నవో

అటువంటి శాసనాధిపతియైన భగవంతుడు మూగజీవుల మీద దౌర్జన్యము సాగించు మానవులను అతికఠినముగా శిక్షించుటకు సిద్ధముగా నున్నాడు. ఎట్లన—

1) కూనీ విషయములో, కూనీకి తోడ్పడిన వారినెల్లను, ఏ విధముగ, దేశపాలకులు శిక్షించుచున్నారో అదే విధముగ జంతువధలో వాల్గొను వారందరిని జగత్పాలకుడైన భగవంతుడు శిక్షించునని దృఢముగా తెలుసుకోవాలి.

2) రాజకీయ శాసనముల ధిక్కరించువారిని ఏ విధముగ దేశాధిపతులు దండించుచున్నారో అదేవిధముగ జంతు

రక్షణకై శాసించిన ప్రబోధములను త్రోసివేయువారిని దండిం చుటకు సర్వేశ్వరుడు కాచుకొని యున్నాడని తెలుసుకోవాలి.

3) ప్రజాక్షేమమునకై దేశపాలకులు ఏ విధముగ మూగజీవుల రక్షణలోగూడ సర్వేశ్వరుడు అనేక శాసనములు చేసియుండునని తెలుసుకోవాలి.

మూగజీవులుగూడ నరులవలె సుఖమునే కోరుచుండు నని ఎంచి, మూగజీవులయెడ మీరుచూపె కార్కశ్యమును మానివేసి, జంతుహింస నిషేధనదీక్షతో ప్రవర్తించాలి. మేము నీచులము, హీనులము, ద్రోహులము, నిర్దయులము, విశ్వాస హీనులము, నమ్మక ద్రోహులము, క్రూరులము, దుష్టబుద్ధు లము, కామనియు మానవజాతికి చెందిన వారమేయనియు, చెప్పుకొనదలచు వారెల్లా కనీసము మాంసభక్షణ నిషేధన దీక్షతోనైన యావజ్జీవము మెలగాలి. ఈ మాత్రపు దీక్షతో నుండనివారు మూగజీవుల పాలికి మృత్యుదేవతలుగా మెలగు చున్న వారగుదురు. కేవలము మిమ్ములను దూషించుటకె మేము చర్చ సాగించినామని తలచవద్దని ప్రజలందరిని మిక్కిలి ప్రార్థించుచున్నాము. మిమ్ములను బాధించినవారిని మీరు ఏలాగు దూషించెదరో అలాగే, మీరుమమ్ములను పెట్టేబాధ లను భరించలేక, యదార్థమును విన్నవించుకొని, "మీవలె మమ్ములను చూడవలెనని" ప్రజలందరిని వినయతతో ప్రార్థించు చున్నాము.

## దేశాధిపతులకు విజ్ఞప్తి

ఓ దేశాధిపతులారా! మీరైన మా మొర విని మా బాధలు రూపుమాప తక్షణమె తీవ్రచర్య తీసుకొన మిమ్ము ప్రార్థించుచున్నాము.

మా దయవల్లనే మానవులు తినుటకు తిండియు, కట్టుకొన గుడ్డ, నివసింప భవనములు జీవనాధారమునకు కావలసిన సమస్తములును పొందుచున్నారు. మా సాహాయము వల్లనే మానవులు సర్వభోగములు అనుభవించుచున్నారు. మా అండ లేకున్న ప్రపంచము యావత్తు అడవిగాను, అడవి మనుష్యులుగాను మారెదురు. అన్నివిధముల మా సాహాయమువల్ల బ్రతుకుచున్న నరులే మమ్ములను హీనముగా చూచి అనేక అగచాట్లు పెట్టుచున్నారు. మానవజాతిని నమ్మకూడదనియు, నమ్మినవారిని నరికేజాతి మానవజాతియే యని మాకు తెలుసును. గాని మానవులందరు ఒకేరీతిగా క్రూరులుండరనియు, కొందరు కాకపోతే కొందరైన జంతురక్షకులుండెదరనియు, ఏనాటికయినా మా ఉపకారములు, సేవలు, గుర్తించగల మహాత్ములు జన్మించి, మామీద ప్రజలు సాగించుచున్న దౌర్జన్యములను రూపుమాపి, మమ్ములను పూజించినట్లు, మానవజాతిని శాసించెదరుగదా యను గొప్ప ఆశతో, నేటి వరకు ప్రజలసేవయందె నిమగ్నులమై, అపకారికి ఉపకారమను దీక్షతో, జీవితములను గడుపుచున్నాము జంతు హింసలను అరికట్టించగల దేశపాలకులు రేపో మాపో రాగలరను ఆశతో, ప్రతి నిముషము ఎదురుచూచుచున్నాము. గాని ఇంతవరకు

ప్రజలవల్ల మాకు కల్గుచున్న అన్యాయములను, కష్టములను, బాధలను, చావులను రూపుమాపుటకు, దేశాధిపతులు తగిన చర్య ఎందుకు తీసుకొనరాదో మాకు తెలియకున్నది. మా ఆధారముచేతనే మీరాజ్యాధికారము చెలామణి యగు చున్నది. మే మమలుజరుపుచున్న స్వయంపోషక స్కీముల వల్లనే, జనులు తరుగులేని కూడు గుడ్డలు పొందుచున్నారు గాని మీ కపటస్కీములవల్లకాదు. రాజ్య కీలకము మావల్ల మా సహాయము మీదనే నడుపుకొనుచు, మా అగచాట్లు రూపుమాప, తగిన కట్టుదిట్టములు, చేయవలెనను సంకల్పము మీకింతవరకు కలుగలేదుగదా! ప్రజాభివృద్ధికై ఎన్నియో పూర్వపు పద్ధతులు రూపుమాపి, నూతన పద్ధతులనేకము, నమలు పరచుచున్నారే! మారక్షణకై ఇంతవరకు ఒక్క శాసనమైన ఆచూకిలేదే! మాంసభక్షణ, జంతుహింస, అనాచారము, దురభ్యాసము, పాపము, కాదని తోచినదికాబోలు? ఒకవేళ నిషేధించిన దేశమునకు అరిష్టములుగాని, ఉపద్రవములుగాని వచ్చునను భయమేమో? కాకపోతే మారక్షణకై ఒక్కశాసనమైన అమలు జరుపగూడదా! దేశపాలకులు ఇకనైన కృపా కటాక్షముంచి, జంతురక్షణ శాసనములను కొన్నిటి నైన అమలు జరుపుటకు, మూగజీవులమైన మేము ప్రార్థించుచున్నాము. మీకంటె అనేకరెట్లు మేము ప్రజలకు ఉపకారమొనర్చుచున్నాము. స్వయంపోషక గ్రామములుగా తయారు చేసినాము,

1) రాజు రంగప్ప యను భేదము పాటింపక ఎవరికి కావలసిన సాహాయము వారికి వెంటనే చేయవలసినదని, మా జాతిని శాసించినాము.

2) ఏ ప్రొద్దు మానవసేవ యందె జీవితము లర్పించ వలసినదని మా కులస్థులందరికి ఆజ్ఞాపించినాము.

3) క్రూరులు ఎన్నిబాధలు పెట్టినను సహించి, ఉపకారమే లక్ష్యముగా నుంచుకొని శాంతిమార్గమున సంచరించవలెనని, మా వంశస్థులందరికి ఆర్డరులు జారీచేసినాము.

4) ప్రజలకు కావలసిన అన్నివసతులను ఉచితముగా ఏర్పాటుచేసి పరోపకారులను పేరు సంపాదించవలసినదే కాని, ఏమాత్రము లంచముల నాశించరాదని మా అన్ని జాతులకు నోటీసులు పంపినాము.

5) పరోపకారములు, త్యాగములు, సేవ, దానములు, ధర్మములు, సుఖదుఃఖములు, శీతోష్ణ వాతవర్షాతపము లందు గాని, శాంతి శమదమాది గుణములందుగాని, మనలనుచూచి మానవులు బుద్ధి తెచ్చుకొనునట్లుగా మార్గదర్శకులై యుండవలెనని మా జాతులన్నిటికి ఆజ్ఞాపించినాము. మాతో సమానమైన పరోపకారులు, దేశసేవకులు ప్రపంచములో లేరని ముమ్మాటికి సవాలు చేయుచున్నాము. ఇట్టి స్వచ్ఛమైన ప్రజోద్ధారకులమగు, నిరపరాధులమైన పశుపక్షి మృగాదులమగు మమ్ములను క్రూరుల బాధలనుండి, తప్పించు నదెప్పటికి ? ధర్మాధర్మములు, పాపపుణ్యములు, కష్టసుఖ

ములు వెలిసినట్టి మీవంటి దేశభక్తుల, త్యాగమూర్తుల, న్యాయమూర్తుల, పరోపకారుల, పరిపాలనలోనె, పశుపక్షి మృగాదులమైన మేము ప్రత్యుపకారము అనుభవింపనియెడల ఇక మాకు దిక్కేది?

దేశ నాయకులమని, గ్రామాధికారులమని, సంఘాధిపతులమని, దేశసేవకులమని, పరోపకారులమని, దాతలమని చెప్పుకొనే ప్రముఖులెందరో యున్నారుగాని మా అగచాట్లను రూపుమాపయత్నించిన వారొక్కరైనా లేరు. క్రూరకృత్యములనురూపుమాపగల మీవంటి దేశాధిపతులు ఉపేక్షించిన, జంతుహింసకుల ఉల్లాసమునకుహద్దువుండదు. క్రూరులు చెలరేగెదరు. దేశోపద్రవములు సంభవించును. మాంసము తినువారు ఉండుటచేతనే పోట్లాటలు, కొట్లాటలు, కలహములు, తగాదాలు హెచ్చగుచున్నవి. మాంసభక్షకులుండుటచేతనే ద్రోహబుద్ధులు, క్రూరబుద్ధులు వ్యాపించుచున్నవి. మాంసాహారులుండుట చేతనే దురభ్యాసములు నాటుకొనిపోవుచున్నవి. మాంసపుకూడు ఆరగించువారు ఉండుటచేతనే వ్యాధులు సంభవించుచున్నవి. జంతుహింసలుండుటవల్లనే రణరంగాది ఉపద్రవములు బయలుదేరుచున్నవి. పశుహంతకులుండుటచేతనే నరహత్యలు వృద్ధియగుచున్నవి. కసాయివారు వుండుటచేతనే క్రూరకృత్యములు ప్రబలుచున్నవి. అవి ఇవి యననేల దేశమునకు సంభవించే అరిష్టములెల్ల, మాంసభక్షకులవల్ల, జంతుహింసకుల వల్లనే ఉత్పత్తియై వృద్ధియగుచున్నవి. వీరిఆటలు సాగుచున్నంతవరకు దేశశాంతి కల్గుటకల్ల.

## మేము కోరిన హక్కులు

1) ప్రజల క్షేమమునకై చోరులు సమ్మతించకపోయినను ఏవిధముగ చోరనిషేధన అమలు జరుపుచున్నారో?

2) మధ్యపానమత్తులు అంగీకరించక పోయినను ఏవిధముగ మధ్యపాన నిషేధము అమలు జరుపు చున్నారో?

3) ఋణదాతలు ఒప్పుకొనక పోయినను. ఏవిధముగ ఋణవిమోచన చట్టము ప్రవేశ పెట్టినారో?

అదేవిధముగ మూగజీవుల రక్షణకై మేముకోరిన శాసనములను తక్షణమె ప్రవేశపెట్టి. తీవ్రముగ అమలు జరిపి మానవులకేగాక, మానవేతరుల బాధలనుకూడా, రూపుమాపినట్టి దేశాధిపతులు నేటికైన కలరను కీర్తిపొంది, మార్గదర్శకులగుటకు దేశాధిపతులను ప్రార్థించుచున్నాము. మారక్షణలో తీవ్రముగ జరుపవలసిన శాసనములు ఏవన—

1) మాంస భక్షణ నిషేధన శాసనమును

2) జంతుహింస నివారణ బిల్లును

3) జంతుబలి నిషేధన చట్టమును

4) కోళ్ళ, పొట్టేళ్ళ మొదలగు పందెములను, పశుబల పరాక్రమ పోటీలను నివారించెడు బిల్లును తీవ్రముగ అమలు జరపాలి.

5) జలాశయములలో చేపలను పట్టకుండ అనేక కట్టుదిట్టములు చేయాలి.

6) అన్ని గ్రామములందు జంతుపోషకశాలలు నిర్మించాలి.

7) జీవకారుణ్యప్రబోధక విద్యాలయములను అన్ని గ్రామములందు నెలకొల్పాలి.

8) జంతుహింసలను అరికట్ట అన్ని గ్రామములందు సి. ఐ. డి. లను, మిల్టరీ సైన్యమును, రిజర్వుపోలీసులను నియమించాలి.

9) జంతువధ నేరములను విచారించుటకు ప్రత్యేకముగ ఒక డిపార్టుమెంటును, కొన్ని కోర్టులను స్థాపించాలి.

10) దేశాదాయములో సగభాగమును మా క్షేమములకు వినియోగించాలి.

11) జంతుహింస నివారక ప్రచారక పోటీ ఉపన్యాసములను, జీవకారుణ్య ప్రబోధకరచనల పోటీ బహుమతులు, జంతురక్షణ ప్రబోధక ప్రదర్శన పోటీలు, పశుపోషక ప్రదర్శన పోటీలు మొదలగునవి ఏర్పాటు చేయాలి.

12) జంతుహింస నివారణ ప్రబోధక టాకీఫిలుములను నెలకొకసారి అన్ని గ్రామములందు ప్రదర్శనలు జరపాలి.

13) మూగజీవులవధ రూపుమాపుటకు ఎన్ని మార్గములు కలవో అన్ని మార్గములందు కాపలాకాయాలి.

అవియివి అననేల ప్రజలక్షేమమునకై మీరు ఎన్ని శాసనములు అమలు జరుపుకొనుచున్నారో అదేవిధముగ మూగజీవుల క్షేమమునకై కావలసిన సమస్త శాసనములను

వెంటనే అమలు జరుపుచు శాసనములను ఉల్లంఘించు వారిని మేము నిర్ణయించిన ప్రకారము శిక్షించాలి. ఎట్లన—

1) మాంసభక్షకులు ఉండుటచేతనే మా జాతికి ప్రళయము సంభవించుచున్నది. ఇట్టివారు ఉండుటకు మేము ఏ మాత్రము సహించము. వీరు మాంసము తిన్నప్పుడెల్లా నాలుకమీద సూదిపోటు వేయుచుండాలి.

2) మాచేత చాకిరిచేయించుకొనుచు మా ఆకలి దప్పులు దీర్పక వారిష్టమొచ్చినప్పుడు ఎప్పుడో గుప్పెడు మేతతో, దోసెడు నీళ్లతో సరిపుచ్చుచున్నారు. ఇట్టి లోభులు ఉండుటకు మేము ఏమాత్రము ఒప్పుకోము. ఎన్ని సంవత్సరములు వీరు మమ్ములను ఆకలిదప్పులతో బాధించారో అన్ని సంవత్సరములు వారికి ప్రతిరోజు గుప్పెడు ఆహారము, దోసెడు నీళ్లుమాత్రమే యిచ్చునట్లు ఏర్పాట్లుచేయాలి.

3) మాతో ఉపయోగము తీరిన తరువాత మమ్ములను కసాయివారికి అప్పగించుచున్నారు. ఇట్టి విశ్వాసహీనులుండుటకు మేము ఏమాత్రము సమ్మతించము. ఇట్టివారిని "ఎన్ని రోజులు మావల్ల చాకిరిచేయించిరో అన్నిరోజులు" మాపశుశాలలందు కఠినమైన చాకిరి చేయించుచు ఆఖరు దినమందు వారిని మా మృగరాజులకు అప్పగించాలి.

4) అనేకమంది మమ్ములను పెంచి పెద్దవాటిగచేసి కొవ్వు పట్టి బలిసినతరువాత మమ్ములను కోతకిచ్చుచున్నారు. ఇట్టి క్రూరులుండుటకు మేము ఏమాత్రము అంగీకరించము. ఇట్టివారిని వెంటనే మా వ్యాఘ్రాదులవద్దకు పంపించాలి.

కనీసపు కోర్కెలను త్రోసివేసే యెడల తక్షణమే మేము యావన్మంది బ్రహ్మాండమైన పట్టుదలతో తీవ్రమైన సమ్మెలు, సత్యాగ్రహములు సాగించుటకు సిద్ధముగా యున్నామని దేశాధిపతులందరికి తెలియజేయుచున్నాము.

## మా యుద్ధ పటాలము

పై విధముగ సాధుజీవుల సభలో చర్చ జరుగుచుండ, మృగరాజాదుల శాఖలోనుంచి, ఒక మృగరాజము లేచి, గంభీరస్వరముతో "సోదరులారా! నరజాతి మనకొనర్చుచున్న దుండగములను ఏమాత్రము సైచుటకు వీలులేదు. మానవులపై తిరుగుబాటు చేయనిదే మనకీబాధలు తప్పవు. నరులనమ్మి వారిటక్కరి మాటలు వినుట చేతనే మీకు ఈ అవస్థ పట్టినది. నరుల మోసము మాకు తెలియుట చేతనె, వారితో పొత్తుకలవక, ఎదురు తిరిగి, స్వేచ్ఛగా బ్రతుకుచున్నాము. మా పౌరుషము సంగతి వారికి తెలియుట చేతనె మా జోలికి వారు రారు. న్యాయపద్ధతులతో ముష్టియుద్ధము చేసి, మాజాతిని గెల్చిన, నరుడు ఇంతవరకు పుట్టలేదు. ఏవిధముగనైన మమ్ము ఓడించామను ఖ్యాతిగొనుటకై, శరీరము కానరాకుండ వజ్ర కవచాలు వేసుకొని అట్టహాసముతో వచ్చినవారెల్లా మా సింహనాదములకె భయపడి పారిపోతారు. నరులు మీపాలికి నరముఖ వ్యాఘ్రాదులగుచున్నారని ఇకనైన వారి గుట్టు తెలుసుకొనుడు. మీ బాధలు బాపుకొనదలతురేని నాహితోపదేశమేమన యుద్ధము చేయ నరజాతిపైకి బయలుదేరుదాము.

మానవులతో యుద్ధము చేయలేమను భయము మీకు ఏమాత్రమువద్దు. మీ బలము సంగతి మీరు తెలుసుకోలేకయున్నారు. న్యాయపద్ధతితో నరులు ముష్టియుద్ధమునకు వస్తే మిమ్ములను గెల్చేవారు నరులలో లేరు. మన యుద్ధవీరులందరు అమాంతముగ నరులను మ్రింగునట్టివారై యున్నారు. మన యుద్ధ పటాలమును చూడగనే నరులు రాజీకివస్తారు. యుద్ధముచేయ నరజాతిమీదికి పోదాము రండు అని మృగరాజు చెప్పగా సభలోనున్న మృగరాజాదులు భూమ్యాకాశములు బ్రద్దలగునట్లు హర్ష ధ్వానము లొనర్చినవి ఆయా జాతివీరులొనర్చిన హర్ష ధ్వానములు ఆ మృగరాజువిని “ఓ సోదరులారా ! రణరంగమందు మిమ్ములను గెల్పించుటకై తమ ప్రాణములనైన నిచ్చుటకు సిద్ధముగా నున్న మన యుద్ధవీరులనుగూర్చి చెప్పుచున్నాను వినుడు.

1) ఇదిగో నేము వస్తాము మీరు భయపడవద్దు రండని గజరాజులు ఎట్లుసైకొట్టుచున్నారో అదిగో చూడండి.

2) మిమ్ము గెల్పించే భారము మాది రండని మృగరాజులెల్ల ఏవిధముగ సింహనాదము లొనర్చుచున్నారో ఆలకించండి.

3) నరులను వధపట్టేది నేము రండని వ్యాఘ్రాదులెల్ల ఏలాగు హర్ష ధ్వనులొనరించుచున్నవో వీక్షించండి.

4) మిమ్ములనుచూస్తే నరులు మీ జోలికి రారు రండని భల్లూకాదులు ఏలాగు నిలువబడియున్నవో చూడండి.

5) మీ నివాసమునకు రాకుండ నరులను మూర్ఛిల్లకొట్టేవి మేము కంటని కోడెత్రాచులెల్ల ఏలాగు బుసకొట్టుచున్నవో తిలకించండి.

6) అన్నివైపులను మేమేవుండి నరులకు బుద్ధిచెప్ప తాము కంటని కొండకందిరీగలెల్ల ఎట్లు ఝంకారము లొనరించుచున్నవో చూడండి.

7) తమ బలపరాక్రమములు చూపి నరులను భయపెట్టవలెనని క్రూర మృగాదులెల్ల కాచుకొని తిరుగుచున్నవి.

8) తమ ప్రభావములు చూపవలెనని విషజీవులెల్ల ఎదురుచూచుచున్నవి.

యుద్ధరంగములో మిమ్ములను గెల్పించుటకు మాగ జీవులెల్ల సిద్ధముగ ఉన్నవి. తక్షణమే మీరు జయఘోష ప్రయోగించి యుద్ధానికి బయలుదేరాలి. సాధుమార్గమున సంచరించుచున్నను నరులు మనలను బ్రతుకనిచ్చుటలేదు. నరులతో స్నేహము మనకిక ఏమాత్రము తగదనుచు మృగరాజు చెప్పగా—

కరిరాజొకటి లేచి గంభీరస్వరముతో "సోదరులారా! మీరు తొందరపడవద్దు. కపిలవస్తుపురమున బుద్ధుడను పేరుతో జన్మించి మన బాధలను రూపుమాపెదనని ఆ శ్రీమహావిష్ణువు మనకు వాగ్దానముచేసియున్నాడు. మనము వారివద్దకు వెళ్ళి వారిచ్చిన ప్రతిజ్ఞను జ్ఞాపకము చేయుదము. వారుగూడ మనలను రక్షింపరాకున్న మన మప్పుడు చేయవలసిన కర్తవ్య

మాలోచించుదము. అంతవరకు మీరాత్రము తొందర పడవద్దు. ఆపురము ఎచ్చటవున్నదో బుద్ధభగవానుని ప్రవర్తన ఎలాగున్నదో దర్యాప్తుచేసివచ్చుటకు తగిన సమర్థులను తక్షణమే పంపాలి" అని చెప్పుచుండ, ఆకాశమునుండి శుకరాజు రివ్వుమనుచువచ్చి కరిరాజుమీద అధిష్టించి 'ఓ సోదరులారా! మన రక్షకునివద్దనుంచే నేనిప్పుడు వచ్చుచున్నానని' చెప్పగా అచ్చటివారందరు బ్రహ్మాండముగా హర్షధ్వని చేసిరి "శుభస్యశీఘ్రం" అన్నారుగాన నాయకులందరు ఇప్పుడే భగవానునివొద్దకు పోయి, మన రక్షణసంగతి తక్షణమే తేల్చుకొని రండని జంతువులెల్ల కేకలు వేయసాగెను. అచ్చటి నాయకులందరు ఇప్పుడేవెళ్ళి తేల్చుకొని వస్తామనుచు బుద్ధదేవునొద్దకు బయలుదేరినారు.



శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

ఓం శ్రీరామాయనమః ఓం శ్రీ బుద్ధదేవాయనమః

# మూడవ అధ్యాయము

శ్రీ బుద్ధభగవానుని శరణుజొచ్చుటకు బయలుదేరినట్టి ఆ జంతు నాయకులు నిశీధసమయమున నిద్రించుచున్న తమ రక్షకు నొద్దకు సూక్ష్మరూపములతో వచ్చి తమ మధురగాన ములతో ప్రదక్షిణము లొనర్చుచు భగవానుని మేల్కొలిపి ఏమని ప్రార్థించుచున్నవన—

## మూగజీవులు బుద్ధదేవుని శరణుజొచ్చుట.

1) శ్రీ రామావతారమెత్తి దుష్టులను హతముచేసిన దేవా! శరణు శరణు.

2) శ్రీ కృష్ణావతారమెత్తి చెడుగులవధ పట్టిన దేవా! శరణు శరణు.

3) శ్రీ పరశురామావతారమెత్తి దుష్టభూపాలకు లను నిర్మూలించిన దేవా! శరణు శరణు.

4) శ్రీ నరసింహావతారమెత్తి ద్రోహులను మసిచేసిన దేవా! శరణు శరణు.

5) వామనావతారమెత్తి క్రూరుల దౌర్జన్యము రూపు మాపిన దేవా! శరణు శరణు.

6) నరనారాయణావతారమెత్తి గర్వాపోతుల గర్వము నణచిన దేవా! శరణు శరణు.

7) మోహాన్యవతారమెత్తి మాయకులకు బుద్ధిచెప్పిన దేవా! శరణు శరణు.

8) జంతుహింసకుల శిక్షింప బుద్ధావతారమెత్తిన దేవా! శరణు శరణు.

ఈ విధముగా శరణుజొచ్చి యింక ఏమనుచున్నవన—

1) మత్స్యావతారమెత్తి సాధుల రక్షించిన దేవా! బహుపరాక్.

2) వరాహావతారమెత్తి లోకముల నుద్ధరించిన దేవా! బహుపరాక్,

3) కూర్మావతారమెత్తి సాధుల కాపాడిన దేవా! బహుపరాక్.

4) సుయజ్ఞావతారమెత్తి సాధులబ్రోచిన దేవా! బహు పరాక్.

5) పృథుని యవతారమెత్తి సాధులవాంఛ నెరవేర్చిన దేవా! బహుపరాక్.

6) మూగజీవుల రక్షింప బుద్ధావతారమెత్తిన దేవా! బహుపరాక్.

ఈ విధముగ బహుపరాక్ చెప్పుచు యింక ఏమని నుతించుచున్నవన—

1) వ్యాసావతారమెత్తి దయారసము వెదజల్లిన దేవా! మమ్ము రక్షింపరావాలి.

2) దత్తావతారమెత్తి ఆత్మవిద్య బోధించిన దేవా! మమ్ము రక్షింపరావాలి.

3) కపిలావతారమెత్తి తత్త్వజ్ఞానముపదేశించిన దేవా! మమ్ము రక్షింపరావాలి.

4) వృషభావతారమెత్తి మోక్షమార్గము నేర్పిన దేవా! మమ్ము రక్షింపరావాలి.

5) హయగ్రీవావతారమెత్తి వేదముల వెల్లడిచేసిన దేవా! మము రక్షింపరావాలి.

6) హంసావతారమెత్తి భక్తియోగము ప్రచారమొనర్చిన దేవా! మమ్ము రక్షింపరావా.

7) జంతురక్షణ బోధింప బుద్ధావతారమెత్తిన దేవా! మమ్ము రక్షింప ఇప్పుడే రావాలి.

ఈ విధముగ తమను రక్షింపరమ్మని యింక ఏమని ప్రార్థించుచున్నవన—

1) ఓ పురుషోత్తమా! రాజభోగములు రానిచ్చుట లేదనక, మమ్ము రక్షింప ఇప్పుడే రావాలంటో! రావాలి!

2) ఓ హృషీకేశా! కామినీవిలాసములు కదలనిచ్చుట లేదనక, మమ్ము రక్షింప ఇప్పుడే రావాలంటో! రావాలి.

3) ఓ అనిరుద్ధా! సతీసుతాదుల ప్రేమ బంధించివేసెననక, మమ్ము రక్షింప ఇప్పుడే రావాలంటో! రావాలి.

4) ఓ మధుసూదనా! కులాచారము కులద్రోయరాదని చెప్పక, మమ్ము రక్షింప ఇప్పుడే రావాలంటో! రావాలి.

5) ఓ వాసుదేవా ! జాత్యభిమానము పాతుకపోయెనని చెప్పక మమ్ము రక్షింప ఇప్పుడే రావాలండో ! రావాలి.

6) ఓ అనాథరక్షకా ! మూగజీవుల పాలిటికి నరులు మృత్యుదేవతలైనారు. మమ్ము రక్షింప ఇప్పుడే రావాలండో ! రావాలి.

7) ఓ ఆపద్బాంధవా! మాకు మానవులు యమదూతలైనారు. మమ్ము రక్షింప ఇప్పుడే రావాలండో ! రావాలి.

8) ఓ సాధురక్షకా ! మాయెడల ప్రజలు దానవులైనారు. మమ్ము రక్షింప ఇప్పుడే రావాలండో ! రావాలి.

9) ఓ ధర్మస్థాపకా ! మాంసాహారసంపాదనలో కావలసిన సంపూర్ణసాహాయము చేయుటకు సిద్ధముగా యున్నామనియు, ప్రభుత్వసాహాయ్యాన్ని పూర్తిగా ప్రజలు వినియోగించుకొనవలెననియు, మాంసాహారము కావలసినంత పంపిస్తాము తన్విదీరతినండనియు దేశాధిపతులే ప్రచారమొనర్చుచున్నారు. మహాప్రభో మమ్ము రక్షింప ఇప్పుడే రావాలండో ! రావాలి.

10) ఓ కరుణానిధీ ! మింట నున్న మీనమేషాదిరాసులనుతప్ప, ఇచ్చటి మీనమేషాది జంతువులన్నిటిని, ప్రజలు మ్రింగుచున్నారు. మహాప్రభో ! మమ్ము రక్షింప ఇప్పుడే రావాలండో ! రావాలి.

11) ఓ జగత్పితా ! మేము ఇక నరబాధలు పడలేము, జాగుసేయక వచ్చి మమ్ము రక్షించాలండో ! రక్షించాలి.

ఈ విధముగ మొరపెట్టుకొనుచున్న జంతునాయకుల మొర విని, మీ రిక భయపడవద్దు, మీబాధలు రూపుమాప ఇప్పుడే బయలుదేరి వచ్చుచున్నా నని చెప్పి, నిద్రపోయే బుద్ధుడు చివుక్కున లేచెను. ప్రజల పరివర్తన పరిశీలించి, రిపోర్టు వ్రాసి పంపుటకు, తాను నియమించినట్టి సి.ఐ.డి. యగు సూర్యభగవానుడు, సప్తాశ్వరథారూఢుడై బయలుదేరి వచ్చుటను చూచి, మిక్కిలి సంతసించినవాడై. వెంటనే తన తండ్రి గారి అనుమతి తీసుకొని, తన సారథి యగు చెన్నుడు, తాను మారువేషములతో, కాలినడకన, పురవీధులు చూచుటకు బయలుదేరిరి.

## గౌతముడు పురవీధులు చూచుట

వీధులలో పోవుచుండ అచ్చటచ్చట ముసలివాండ్రను, వ్యాధిగ్రస్తులను, వికలాంగులను గౌతముడు చూచి వారి విధముగ నుండుటకు కారణమున్నా, ఇట్టివారు ఇంక దేశములో నున్నారా ? ఈ బాధలు మనకుగూడ వచ్చునా ? మొదలగు తన సందేహములను, తన సారథియైన చెన్నుని అడిగి తెలుసుకొనుచు పురము వెలుపలికి రాగా స్మశానమునకు తీసుకొని పోవుచున్న మానవ మృతకళేబరములను సిద్ధార్థుడు చూచి, యీ గతి మనకుగూడ పట్టునా? వీరికేనా యని మరణ వృత్తాంతమును గూర్చి చెన్నునివల్ల తెలుసుకొని "ఛన్నా ! నే నెన్నడు చూడని, తలచని భయంకరదృశ్యములను నేడు

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

ఓం శ్రీ రామాయనమః ఓం శ్రీ బుద్ధదేవాయనమః

# నాల్గవ అధ్యాయము

శ్రీ బుద్ధభగవానుడు మోక్షమార్గమునకు తాను సాధించిన సులభసూత్రములను లోకమంతట వ్యాపింపజేయుటకై అడవులు వదలి జనపదములకు వచ్చుచుండ దారిలో మేకలమందను తోలుకొనిపోవు గొల్లలు కనుపించిరి. ఆ మందలో నొక మేకపిల్ల నడువలేక కుంటుచుండెను. బుద్ధుడు దాని కష్టము చూచి సహింపలేక ఆ మేకపిల్లను తనభుజముల మీద నెక్కించుకొని, ఎచ్చటకు వెళ్లుచున్నారని యా గొల్ల వాండ్ర నడిగెను. బింబిసారు డనే రాజు యజ్ఞముచేయుచు, దేవతలకు బలియిచ్చుటకై మేకల దెమ్మని మా కాజ్ఞనివ్వ మేము ఈ మందను తోలుకొని పోవుచున్నామని వారు చెప్పిరి. నేనును మీతో మీ రేనికడకు వచ్చెదనని చెప్పి మేకపిల్లను మోయుచు గోపకులవెంట జనుచుండెను. వీథులందు పౌరులు గుంపులుగుంపులుగ చేరి బుద్ధదేవుని చూచి యీ విధముగ ముచ్చటించుకొనసాగిరి.

వినోదార్థమునకై ఆ శ్రీరామచంద్రమూర్తి ఈ రూప మెత్తెనేమో లేక క్రీడార్థము ఆ శ్రీ మహావిష్ణువే ఈ రూపముతో వచ్చుచున్నాడేమో! తమాషాకై ఆ గోపాలకృష్ణుడే

ఈ విధంబుగ వచ్చుచున్నాడేమో! ఇట్టి మోహనాకారము నసల కుండదు. ఇతను గొల్లలతో ఎందుకు వచ్చుచున్నాడో, యజ్ఞమునద్ద ఇత డేమి చేయునో చూతమనుచు ప్రజలెల్ల బుద్ధుని వెంట రాసాగిరి.

## పశుయజ్ఞములు చేయరాదు

భగవానుడు యాగశాలయొద్దకు వచ్చెను. యూపస్తంభమునకు పశువును కట్టి నరుకబోవుటను భగవానుడు వీక్షించి "నద్దుచంపవ"ద్దని కేకలు వేయుచు వాడుతో యూపస్తంభము నద్దకు వెళ్ళి బంధించియున్న పశువును విడిపించి మెడమీద నున్న మేకపిల్లను దించి ఋత్విజులతో ఏమనుచున్నాడనః— సకల శాస్త్రములు చదివిన పండితశ్రేష్ఠులైన మీరు, ధర్మాధర్మములు బోధించే మేటిధర్మాత్ములైన మీరు, న్యాయాన్యాయములు చెప్పే న్యాయమూర్తులైన మీరు కనికర మెరుగని శార్దూలముల వలె హృదయము లేనట్టి కొండచిలువ వలె జాలి నెరుగని పెనుమొసళ్ళ వలె సంచరించుట తగదు. పంది పన్నిదను మెచ్చనివిధముగ పురుషసూక్తములోని "యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞమతన్వత" అను మంత్రము యొక్క ఉపదేశమును త్రోసివేసి మీ యిష్టమువచ్చినట్లు తర్కము లొనర్చుచున్నందులకు యథార్థవిషయములను కప్పిపుచ్చి కపటార్థములు కల్పించి దుర్బోధ లొనర్చుటలో ఆరితేరిన పండిత శిఖామణు లని మిమ్ములను ఒప్పుకోక తప్పదు. ఇకనైన మీ

అపరాధములకు క్షమాపణ కోరి రాత్రింబగళ్లు కంఠము పోవు నట్లు కూసు వాగుచున్నట్టి పురుషసూక్తము లోని "యత్పురు షేణ హవిషా" అను మంత్రముయొక్క అర్థమును తెలుసు కొని పశుయజ్ఞములను చేయించునట్టి పద్ధతిని మానివేసి సాత్వికయజ్ఞములు ప్రవేశపెట్టి పండితులెల్లరు ఇప్పుడే దీక్షలు పట్టాలి.

ఓ దేశాధిపతీ! జీవమును విషతుల్యముగ భావించు ప్రాణి ఏ లోకమందును లేదు. తిర్యగ్జంతువులైనను తన ప్రాణ రక్షణకై అనేక యత్నములు చేయుచుండునుగాని పలువురు ఏకమై వాటిని చంపునపుడు అవి రక్షించుకొనలేక చంపవద్దని చెప్పుటకై తన్నుకొనుచు అరచుచున్నను నిర్దయులై హత్య చేయు పాల్పడువారిని మానవాకారముతో నున్న క్రూరమృ గము లని సూక్షిగ చెప్పవచ్చును. ఘాతుకమృగములకును క్రూరకృత్యములొనర్చెడు మానవులకును తారతమ్యమేమియు లేదు. ధర్మాధర్మవిచక్షణను తెలుసుకొనగల నంతఃకరణము మానవులకు మాత్రమె భగవంతుడు ప్రసాదించుటచే దుష్కృ త్యము లొనర్పరా దను నియమము మానవజాతికి మాత్రమే నిర్ణయించినట్లు సూక్షియగుచున్నదని తెలుసుకొనుడు. ఈ జీవరాసు లన్నింటిని సృజించినవి భగవంతు డగుటచే సర్వేశ్వ రునిసంతతి యగును. బలపరాక్రమములు గల తన పెద్ద పుత్రులు, శక్తిలేనట్టి ప్రతీకార మొనర్పనట్టి తన చిన్న తనయు

లను హత్యగావించుటను చూచి తండ్రి యగువాడు కోపించి దండించునుగాని సంతసింపడు. అలాగే పరమేశ్వరుని సంతతి లోని జీవులను బలినిచ్చువారు జగద్రక్షకుని కోపానలమునకు దగ్ధముగాక తప్పదని గ్రహించుకొనుడు. ఏ జీవినైన హత్య చేయుట సులభమేగాని తిరిగి దానిని బ్రతికింప నెవ్వరితరము కాదు. ఏ ప్రాణినైన బాధించుట సులభమేగాని తిరిగి దాని బాధ బాప నెవ్వరి శక్యము కాదు. కనుకనే జీవహింసకు మించిన పాపము మరియొకటి లేదని దృఢపరచబడినది. జీవ హింసకుతప్ప తక్కినపాపకృత్యములన్నిటిని ప్రాయశ్చిత్తముతో రూపుమాపవచ్చునుగాని జీవహింసవల్ల సంభవించెదోషమును పోగొట్టగల ప్రాయశ్చిత్తము ఏ శాస్త్రములోను వర్ణించ లేదు. జీవహింసకు తగిన ఫలము ఏనాటికైన అనుభవింపకతప్ప దని ధర్మశాస్త్రములన్నియు ఏకగ్రీవముగ వాదించుచున్నవి. జీవహింసతో గూడిన యజ్ఞము లొనర్చువారికి నరకమేగాని స్వర్గము లభించదని బోధించెడు గాథ లివిగో శ్రద్ధగా నాలకిం చుడు.

(1) పురంజనుడు అనే రాజు పశుయజ్ఞము లొనర్చుటచే తనే అతడు పరలోకగతుం డైనప్పుడు అతనిచే యజ్ఞ ములందు హింసింపబడిన పశువులు క్రోధోద్రేకంబున కుఠారములచే అతనిని నరికివేసినట్టి గాథను స్మరించు కొని దేశాధిపతులెల్లరు పశుయాగములకు తక్షణమె స్వస్తిచెప్పాలి. భాగవతం 4 స్కం. 829.

(2) సోమకుం డను రాజుచే హింసాయుత యజ్ఞమును చేయించుటచేతనే ఘోరనరకానలంబునకు ఆహుతి అయినట్టి ఋత్విజుని గాథను జ్ఞాపకము తెచ్చుకొని ఋత్విజులెల్లను పశుయజ్ఞములను చేయించుటను వెంటనే మానాలి. భారతం అరణ్య 3. ఆశ్వా 218.

(3) దేవేంద్రుడు పశుయజ్ఞము చేయుచుండగ మహాములు లందరు దయగలవారై దేవేంద్రునితో "యజ్ఞము లందు పశువులను హింసించుట ధర్మము కాదు, మూడు సంవత్సరములనాటి పాతబియ్యము తెచ్చి పశువులకు బదులుగా హోమము చేయుట ధర్మమగును. ఇట్లు చేసిన దీనివలన హింసారూపమగు యజ్ఞముకంటె మిక్కిలి ఫలము కలుగును. ఈ పశువులందు నీవు కృపయుంచి విడిపింపు" మని చెప్పగా దేవేంద్రుడు విననందున మునులకును, దేవేంద్రునకును గొప్ప వివాదము జరిగె. అప్పుడు భూలోకమం దుండెడి "ఉపరిచరవసు" వనెడి రాజు అచ్చటకు రాగా అతను ధర్మశాస్త్రవేత్త యైనందున వానిని మధ్యవర్తిగానుండి తీర్పు చెప్పుమని వారు కోరిరి. అంతట ఆ రాజు దేవేంద్రునిమీాద నుండె అభిమానముచే యజ్ఞసమ యములో పశువులను హింసింపవచ్చు నని పక్షపాత ముగ తీర్పుచెప్పుటచేతనే ఆ రాజు అధోగతి పొంది

నాడు. గాన మీా తర్కములను ఆపివేసి పశుయజ్ఞములను అరికట్టాలి. అశ్వమేధపర్వము 4 ఆశ్వా. 255. పశుయజ్ఞము లొనర్చి అధోగతి పొందినవారు ఇంక ననేకమంది కలరు.

## పశుయజ్ఞములు నిషేధించిన మహాత్ములు

యజ్ఞములందు పసుబలి నివ్వకుండ యజ్ఞములొనర్చిన మహాత్ము లిరుగో.

(1) పశుహింస లేకుండ యజ్ఞము లొనర్చవచ్చునని దాఖలాచూపుటకై "తా నొనర్చెడు యజ్ఞములందు పశువధ జరుగరాదని ఋత్విజులకు ఆజ్ఞాపించినట్టి" ఉపరిచరవసువు అనే రాజును మీారు ఆదర్శముగా నుంచుకొని పశుయాగములు మానాలి.

శాంతిపర్వము 6 ఆశ్వా. 362.

(2) యజ్ఞములందైనను జీవబలినిచ్చుటకు సజ్జను లైనవారు అంగీకరించరాదని దాఖలాచూపుటకై తన యజ్ఞములోని యూపస్తంభమునకు కట్టబడిన పశువుయొక్క దుఃఖారావము విని "దుష్టబుద్ధులును, నాస్తికులును, జ్ఞానహీను లైనవారిచేత యాగములందు పశుహింస నియమింపబడినది. మూఢు లగు యాజికులు తమ యిచ్ఛవచ్చినట్లు బహిర్వేదికయందు పశువులను చంపుచున్నారు. గాని యీపద్ధతి సజ్జనులకు నచ్చదు.

సర్వకర్మములందు అహింసయే ఉత్తమము. జ్ఞానము గలవారుమాత్రము సకల యాగములందును విష్ణువునే పూజ్యునిగా తలంచి పుష్పాదులచే పూజించి, పాయసాద్యాహారములచే తృప్తునిగావించెదరు. యజ్ఞములందు పరిశుద్ధము లగు వృక్షముల ఫలపత్రాదు లేవి గలవో వాటిచేతనె శుద్ధసత్వభావు లగువారు యజ్ఞదేవతల నారాధింతురు" అని చెప్పి యజ్ఞపశువును విడిపించి పశుబలి నివ్వకుండ యజ్ఞమొనర్చినట్టి విచఖ్యుడనే రాజోత్తముని మార్గదర్శముగ నుంచు కొని పశుయజ్ఞము లొనర్చుపద్ధతిని రూపుమాపాలి.

భారతం, శాంతిపర్వము.

(౩) దుఃఖించెడు పశువులను యజ్ఞములందు హింసింపరాదని దాఖలాచూపుటకె "తన యజ్ఞమునందు బలినిచ్చుటకు తెచ్చుచున్నట్టి పశువుల దుఃఖమును విని, ఆ పశువులను రక్షించుటకై తాను చేయుచున్నట్టి యజ్ఞమును మానివేసినట్టి రంతీదేవుని ఆదర్శముగా నుంచుకొని పశుయాగములు రూపుమాపాలి.

అనుశాసనీకపర్వం 3 ఆశ్వా. 85.

యజ్ఞములలో పశువులను చంపిన పుణ్యాలోకములు లభించ వని దాఖలాచూపుటకే సాత్వికయజ్ఞము లొనర్చిన వారు ఇంక ననేకమంది కలరు,

పశుయజ్ఞములుచేయుట మహాపాతక మని బోధించి పశుయాగములను రద్దుచేయించినట్టి మహాత్ము లిదుగో.

(1) ప్రాచీనబర్హి కడకు నారదుండు సనుదెంచి "ఓ రాజా! నీచే యజ్ఞములలో వధింపబడిన పశువులు లోహ యంత్రమయశృంగంబులచేత నెప్పుడు నీవు పరలోకంబు నొందెదవో అప్పుడు నిన్ను హింసించవలె నని నీ చావుకు ఎదురుచూచుచున్నవి. పశుయజ్ఞము లొనర్చుటవల్ల నీకు శ్రేయస్సు లభించదు. పశుయజ్ఞము వర్జింపుము. సకల జీవాశ్రయుం డైన ఈశ్వరుని సేవింపుము. కర్మనిష్ఠు లగు నుపాధ్యాయు లైనవార లే యాత్మతత్వంబు నెఱుంగరు. ఎఱింగి రేని నుపదేశింప" రని బోధింప, చేయుచున్నట్టి యాగమును నిషేధించినట్టి ప్రాచీనబర్హి చరిత్రను దాఖలాగ నుంచుకొని, పశుయాగములు వర్జింప మీ రిప్పుడే ప్రతిన బూనవలెను చాలి. భాగవతం 4 స్కం. 741.

(2) అధ్వర్యునకును యతికిని జరిగినట్టి వాదనలో "యజ్ఞములందు చంపబడే పశువులకు పుణ్యలోకములు లభించు నను గట్టి నమ్మకము మీ కున్న పశువులకు బదులు మీ తల్లిదండ్రులనో, సతీసుతులనో, అన్నదమ్ములనో, బంధుమిత్రులనో వధించి వారికి పుణ్యలోకములు ఎందుల కిప్పించరాదు? లేక తానే యజ్ఞము

నందు ఆహుతి అయ్యె పుణ్యలోకమునకు ఎందుకు పోరాదు ? యజ్ఞపశువులకు స్వర్గము కల్గు నని దృఢముగా వాదించే పండితులుగాని, ఋత్విజులుగాని యజ్ఞములందు వధింపబడుటకుపల అంగీకరించరాదు? పుణ్యలోకములు కోరుచున్నది నరులుగాని పశువులు కాదు. పుణ్యలోకము వాంఛించువారిని వదిలిపెట్టి అక్కరవచ్చువారులేరని "మాకు పుణ్యలోకములు వద్దు. చంపకుండ వదిలిపెట్టండో, అదే మాకు పుణ్యలోక" మని అరచుచున్న పశువులను వధించుట మీకు ధర్మము కాదు. సమస్త ధర్మంబులలో ఏ జంతువు నైనను హింసింపకుండుట పరమధర్మంబగును. హింస లేని యజ్ఞము శ్రేష్ఠ మైనదగును. పశుయజ్ఞము నొనర్చుటవల్ల మహాపాతకము సంభవించు" నని యతి బోధింప చేయుమన్నట్టి పశుయజ్ఞమును వర్జించినట్టి అధ్వర్యునిగాథను దాఖలాగా నుంచుకొని పశుయాగములు తక్షణమె రూపుమాపాలి.

అశ్వమేధపర్వము.

(క) శరీరనాశములచె హింసలును, అనిత్యఫలము లగు పశుయజ్ఞములను పిశాచముల వలె సజ్జను లగువారు చేయరనియు, ఇంద్రియనిగ్రహ మనెడి శాంతియజ్ఞమును, ఉపనిషచ్చింతన మనెడి బ్రహ్మయజ్ఞమును, జప మనియెడి వాగ్యజ్ఞమును, ధ్యాన మనెడి మనో

కంటె నుత్తమధర్మము వేరొండు లేదు. ఎట్టి ప్రాణి కిని భయమును కలిగింపక మెలగుట యను ధర్మమున కీ డగు ధర్మము భూతభవిష్యద్వర్తమానములందు లేదు. ఎల్ల ప్రాణులయందును మనోవాక్కాయము లచే పాపభావ మిడక వర్తించువాడు బ్రహ్మ యగు చున్నా" డని తులాదారు డనే వైశ్యశిఖామణి జాజలి మహామునికి బోధించినట్టి బోధలు పరిశీలించి పశు యాగములు వెంటనే విడిచివేయాలి.

శాంతిపర్వము.

(5) ఒక బ్రాహ్మణుడు పశుయాగము చేయదలచగా ధర్మదేవత వచ్చి "అహింస యెట్టి ముఖ్యధర్మమో హింస యట్టి అధర్మ మగుచున్నది. యజ్ఞములందు పశుహింస ధర్మము కాదు. గాన పశుయాగముచేయ వద్దని, పశుయాగము మాన్పించి" నట్టి ధర్మదేవత యొక్క ప్రభోధమైన గమనించి పశుయజ్ఞములు తక్ష ణమె రూపుమాపాలి. శాంతిపర్వం.

(6) సక్తుప్రస్థుని పేలపిండిదానములో లేశమాత్రమునకైన నను ధర్మరాజు యొక్క అశ్వమేధయాగము సమా నము కా దని హేళనచేసినట్టి" ముంగిసతీర్పును జ్ఞాప కము తెచ్చుకొని పశుయజ్ఞములు రూపుమాప దేశా ధిపతులెల్లరు తీవ్రమైన కృషి గావించాలి.

అశ్వమేధపర్వం 4 అ, 252.

హింసతో గూడిన యజ్ఞములను హూపుమాపించినట్టి మహాత్ము లింక ననేకమంది కలరు. ఏ వాంఛను తీర్చుకొనుట్కై పశుయజ్ఞము లొనర్చుచున్నారో అటువంటి వాంఛలను నెరవేర్చగల సాత్త్వికయజ్ఞము లెన్నియో కలవని మహాత్ములు బోధించుచుండ నిరాకరించి పశుయజ్ఞము నొనర్చుట అధోగతికి పోవుటయే యగును.

యజ్ఞ మనగ ఏ ప్రాణికి దుఃఖముగాని, బాధగాని, సంతాపముగాని కలిగింపనట్టి కర్మ ఏది కలదో అట్టి కార్యమునె యజ్ఞమని మునులు శాసించినారు. హింసాయుతక్రతువు లొనర్చువారు ఏనాటికైన తనచె బాధింపబడిన జీవుల యొక్క యుసురు ననుభవింపవలసియుండు నని సిద్ధాంతపరచినారు. జనులు ఎంత జాగ్రత్తతో వర్తించుచున్నను (1) దంచుట (2) నూరుట (3) తరుగుట (4) వండుట (5) ఊడ్చుట మొదలగు పనులందు వారికి తెలియకుండనె అనేక జీవరాసులు చంపబడుచున్నవి. వీటినే పంచసూనము లందురు. ఈఅయిదు పాపములు పోగొట్టుకొనుటకే పంచయజ్ఞములు నియమించిరి. పంచయజ్ఞము లనగ (1) బ్రహ్మయజ్ఞము. అనగా వేదోపనిషద్గీతాది పఠనములు, ప్రణవాది మంత్రజపములు. (2) పితృయజ్ఞము. అనగ పితృదేవతలను తృప్తిపరచుట, తల్లిదండ్రుల సేవచేయుట. (3) దేవయజ్ఞము. అనగా దేవతారాధన, హోమములుచేయుట. (4) భూతయజ్ఞము. అనగా కాకులు, కుక్కలు, పశువులు, పక్షులు, చీమలు, పురుగులు మొదలగువాటిలో

అన్నము గోపసిట్టి జీవరాసుల కన్నిటికి వేసవేసగ అన్నమును వేయుట. (5) మనుష్యయజ్ఞము. అనగ అతిథిపూజ. ఈ పంచ యజ్ఞములతో 'మానవు డెంత ప్రయత్నించినను తప్పించుకొనుటకు వీలులేక పంచసూనములవల్ల సంక్రమించె పాపముల నుండి విముక్తిగాంచుటకు' అవకాశ ముండవచ్చు నని నిర్ణయించిరేగాని బుద్ధిపూర్వకముగా జేయు హింసలకు ప్రాయశ్చిత్త మెచ్చట చెప్పలేదు. గాన మీా రొనర్చెడు పశుహింసలకు తగినప్రాయశ్చిత్తము, ఎప్పటికైన ఇహపరములందు మీా రనుభవింపక తప్పదు. ఇకనైన మీా అజ్ఞానము పారదోలి సకల జీవరాసులు మీావంటివే యని తలచి పశుయాగములు మాపుమాపాలి. మీారు నిత్యము పారాయణ మొనర్చెడు భగవద్గీతలో 4వ అధ్యాయములో 25వ శ్లోకము మొదలు 30వ శ్లోకము వరకు చెప్పబడిన యజ్ఞములనుమాత్రమే అనుష్ఠించాలి. 4వ అధ్యాయములో 33వ శ్లోకములో ద్రవ్యసాధనచే సాధ్యమైన యజ్ఞముకంటె జ్ఞాన మనియెడు యజ్ఞము శ్రేష్ఠమైనదియు 10వ అధ్యాయములో 25వశ్లోకమున యజ్ఞములలో జపయజ్ఞము నేనే యనియు బోధించిన శ్రీకృష్ణభగవానుని ఉపదేశములైన ఆలకించి ఆ మహాత్ముని సందేశప్రకారము వర్తింప ఈ క్షణమునుంచె భూపతులెల్లరు పశుయాగములు మానాలి.

(1) సూతసంహిత, నైష్కర్మ్యసిద్ధి, వాపియన్ని, ముండకోపనిషత్తు మొదలగు గ్రంథములలో ఖాయపరచి

పట్టి యజ్ఞములనుమాత్రమే ప్రవేశపెట్టి వాటిని అభి వృద్ధిచేయ కృషి చేయాలి.

(2) ఉపనిషత్తు, గర్భోపనిషత్తు, అశ్వమేధపర్వము మొద లగు శాస్త్రములందు శాసించినట్టి ఆత్మయజ్ఞము లొనర్చువారికిమాత్రమే పుణ్యలోకములు లభించును. తదితర యజ్ఞము లొనర్చువారికి నరకమే సంభవిం చును. ఆత్మయజ్ఞము లొనర్ప శాసించి పశుయాగ ములు రూపుమాపాలి.

(3) ఉపయాజిని ఆదర్శముగానుంచుకొని ఋత్విజులెల్లరు పశుయాగములు చేయుటను మానాలి.

## సాత్త్వికయజ్ఞముల ప్రభావము

పశుయజ్ఞములకంటె అనేకరెట్లు పుణ్యఫలము నివ్వగల సాత్త్వికమార్గము లెన్నియో కల వని శాసించిన శాస్త్రము లివిగో.

(1) విష్ణుమూర్తికి నమస్కారమొనర్చిన నూరు యజ్ఞము లకు మించిన ఫలము కల్గును.

వైశాఖమహాత్మ్యము 13 అధ్యా. 3 శ్లోకం.

(2) త్రయోదశి, చతుర్దశి, పౌర్ణమి దినములందు భగవ ద్గీతపారాయణ మొనర్చిన, ప్రతిదినము అశ్వమేధ మును జేసిన ఫలమునకు మించిన ఫలము లభించును.

25 అధ్యా. 20 శ్లో.

(3) వైశాఖస్నానమొనర్చిన నూరు యజ్ఞములను అనేక అశ్వమేధయాగములకు మించిన ఫలము వచ్చును.

1 అధ్యా. 19 శ్లో.

(4) దప్పికల్గినవారికి చల్లని పానీమునిచ్చిన, అనేక రాజసూయములకంటె మించిన ఫలము పొందవచ్చును.

2 అధ్యా. 19 శ్లో.

(5) విష్ణుదేవళమునకు నిత్యయాత్ర చేసిన, ఒక్కొక్క అడుగునకు అశ్వమేధయాగ ఫలముకంటె మించిన పుణ్యము కల్గును.

కార్తీకమహాత్మ్యము 15 అధ్యా. 5 శ్లో.

(6) కార్తీకవ్రత మొనర్చిన, వేలకొలది అశ్వమేధయాగములు, వేలకొలది యగ్నిష్టోమములు, వేలకొలది వాజపేయములకు మించిన ఫలము లభించును.

14 అధ్యా. 44 శ్లో.

(7) చాతుర్మాస్యవ్రతమువల్ల నూరు జన్మము లొనర్చిన వారికంటె మించిన ఫలము వచ్చును.

19 అధ్యా. 45 శ్లో.

(8) మాఘస్నానమునకు సంపూర్ణదక్షిణలతో చేయు యజ్ఞములు అనేకరెట్లు తక్కువ.

మాఘమహాత్మ్యము 30 అధ్యా.

(9) శివరాత్రివ్రతముచె అనేక అశ్వమేధాది యజ్ఞముల కంటె మించిన ఫలము కల్గును. 29 అధ్యా.

(10) ఏకాదశి ఉపవాసము యొక్క పదియారు భాగములలో ఒక భాగమునకుగూడ వెయ్యి అశ్వమేధయాగములు, వెయ్యి వాజపేజములు సరిపోవు. 34అధ్యా.

(11) రామనామము స్మరించుచు భోజనముచేయువారికి మెతుకుమెతుకునకు మహాయజ్ఞఫలము లభించును.

అత్రిస్మృతి

(12) వెయ్యి అశ్వమేధంబులకంటె నొక్క సత్యవాక్యము నెక్కువ ఫలము నిచ్చును. ఆదిపర్వము 4ఆశ్వా. 95.

(13) ఒక్క ముహూర్తమాత్రంబు నారాయణస్మరణ మొనర్చువారికి నూరు క్రతువులకు మించిన ఫలము లభించును. 12 స్కం. 20.

పుణ్యఫలము లివ్వగలసాధనలు ఇంక ననేకము గలవు.

పశుయాగము లొనర్చకుండ సాత్వికపద్ధతులతో ఇంద్రాదిపదవులుపొందవచ్చునని తీర్పుచెప్పిన శాస్త్రము లివిగో.

(1) కార్తికశుక్లపక్షమున సాయంకాలమున విష్ణువును అర్చించువాడు స్వర్గాధిపుడగు ఇంద్రుడే యగును.

కార్తీకమహాత్మ్యము 15 అధ్యా. 4 శ్లో.

(2) అగసిపూలతో విష్ణువును అలంకరించువాడు స్వర్గాధిపు డగును. 7 అధ్యా. 34 శ్లో.

(3) కార్తీకద్వాదశినాడు పసిడికొమ్ములు గలది, వెండి గిట్టలు గలది, పాలిచ్చునది యగు ఆవును దూడతోడ బూజించి దానమొసర్చిన ఆ గోవునందలి రోమము లెన్ని యున్నవో అన్ని సం॥లు స్వర్గమునకు అధిపతి యగును. 12 అధ్యా. 13 శ్లోక.

(4) వైశాఖమాసములో నిత్యము భగవత్కథ గల శ్లోకమునుగాని, అరశ్లోకమునుగాని, పాదశ్లోకమునుగాని పఠించునాడు బ్రహ్మపదవి నొందును.

వైశాఖపురాణము 25 అధ్యా. 25 శ్లో.

(5) మాఘమాసములో పండ్రెండు దినములు వ్రతము నాచరించిన బ్రహ్మత్వము కలుగును.

మాఘపురాణము 26 అధ్యా. 73 శ్లో.

ఇంద్రాది పదవులను ఇప్పించగల మార్గము లింక ననేకము గలవు.

యజ్ఞములతో నిమిత్తము లేకుండనే పుణ్యలోకములు పొందుటకు అనేక సాత్వికమార్గములు కల వని వాదించిన శాస్త్రము లివిగో.

(1) మాఘమాసవ్రతము నాచరించువాడు బ్రహ్మలోకము, విష్ణులోకము, శివలోకము, ఇంద్రలోకము మొదలగు లోకములలో ఒక్కొక్క లోకమునందు ఇరువదిఅయిదేసి కల్పములు వాసముచేయుదురు.

మాఘమహాత్మ్యము 25 అధ్యా. 73 శ్లో.

(2) వైశాఖమాసమున ధర్మము జేసిన, ఉభయవంశములం దును బుట్టిన యిరువదియూరు తరములవారిని తరింప జేసి విష్ణులోకమును పొందుచున్నారు.

వైశాఖమహాత్మ్యం 12 అధ్యా. 17 శ్లో.

(3) కార్తీకమాసమున సాయంకాలమునందు స్తోత్రపాఠ ముల పారాయణముచేయువాడు స్వర్గము పొందును.

కార్తీకమ. 7 అధ్యా. 43 శ్లో.

(4) భక్తితో నెవడైతే యొక అధ్యాయమునైనను జపు వునో అతడు రుద్రలోకమును పొందును.

గీతామహాత్మ్యములో 13 శ్లో.

(5) గీతలో పది శ్లోకములుగాని, ఏడు, అయిదు, నాల్గు, మూడు, రెండు, ఒకటి, అర్ధశ్లోకముగాని చదువు వాడు చంద్రలోకమును పొంది పదివేలసంవత్సరము లుండును. 15 శ్లో.

(6) ఎన్ని నిమిషములు దేవుని సన్నిధిలో దీపము వుంచె దరో అన్ని సంవత్సరములు స్వర్గమున వుందురు.

అనుశాసనీకపర్వం 4 ఆశ్వా. 41.

పుణ్యలోకములను యిప్పింపగల మార్గము లింక ననే కము కలవు.

పశుయజ్ఞముల నిషేధించి సాత్వికపద్ధతితో బ్రహ్మాది పదవులు పొందిన మహాత్ము లిరుగో.

(1) అత్రి, వసిష్ఠుడు మొదలగువారు సాత్త్వికపద్ధతులతోనే బ్రహ్మపదవులు సాధించినారు.

(2) చాక్షుష, స్వారోచిష మొదలగువారు సాత్త్వికభక్తి వల్లనె మనువులైనారు.

(3) బృహస్పతి మొదలగువారు సాత్త్వికపూజల వల్లనె ఇంద్రపదవులు సంపాదించినారు.

(4) వైశ్వానరుడు, శుచిష్మంతుడు, పూతాత్ముడు మొదలైనవారు సాత్త్వికమార్గముతోనె దిక్పాలకు లైనారు.

ఇటువంటి మహాత్ము లింక నెందరెందరో గలరు. వీరికి దీక్షైనవారు మచ్చుకైన పశుయాగము లొనర్చినవారిలో నొకడైన లేడు.

సాత్త్వికయజ్ఞము లొనర్చి దేశారిష్టములు రూపుమాపిన మహానుభావు లిరుగో.

(1) అహింసారూపమైన సత్త్రయాగమొనర్చి తన దేశములోని ప్రజలకు మరణము రాకుండునట్లు చేసిన 'శైవ స్వతమహాత్ముని' మార్గదర్శముగ నుంచుకొని మీ రొనర్చునట్టి పశుయాగములను తీసివేసి ఆ మహాత్ముడు చూపినట్టి యాగములొనర్చ దేశాధిపతులు పూనుకోవాలి. ఆదిపర్వం 7 ఆశ్వా. 265.

(2) వెయ్యి సంవత్సరములకు పూర్తియగునట్టి అహింసారూపమైన సత్త్రసంజ్ఞకంబైన యాగమును ప్రారం

గని, యాగములని నిరపరాధము లగు మూగజీవులను నిల్వున
క్రోలుతీయుచు, నమ్మిన జంతువులను నరకుచు, మహాపాపు
లుగ తయారగుచున్నారు. నేడు మిమ్ము శిక్షించువారు లేరని
చెలరేగవద్దు. రేపో మాపో యమదర్బారులోను, రాబోవు
జన్మలోను మీ దుష్టకృత్యములకు తగిన బాధల ననుభవింపక
తప్పదు. క్రూరకృత్యము లొనర్చువారిని జగద్రక్షకుడు తప్పక
దండించును. మాంసభక్షణ, జీవబలి, జంతుహింస, పశుయాగ
ములు మానుచున్నామని ఇచ్చటివారెల్లా ఇప్పుడే దీక్షలు
పూనాలి. ఈ మాత్రపు దీక్షపూననివారు తమ చేతులార ఉప
ద్రవములు తెచ్చుకొనుటగాక దేశోపద్రవములకు తోడ్పడు
చున్నవా రగుదుర”ని భగవానుడుబోధింప అచ్చటివారందరు
ఆయన పాదములమీద పడి “మా తప్పులు క్షమించండి. నే
మిక మా జీవితములలో మాంసభక్షణ, జీవబలి.జంతుహింస,
పశుయాగములు చేయము”ని ప్రతినలు బూనిరి. మాంసభక్ష
కులు, జంతుహింసకులు శిక్షార్హులనుచు తన రాజ్యమంతట
మహారాజుగారు దండోరా వేయించెను. పండితులెల్లరు జంతు
హింసనివారణ ప్రచారకదీక్ష గైకొనిరి.



శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

ఓం శ్రీ రామాయనమః ఓం శ్రీ బుద్ధదేవాయనమః

# ఐదవ అధ్యాయము

శ్రీ బుద్ధభగవానుడు తన అహింసాసూత్రములను వ్యాపింపచేయుటకై మరియొక రాజ్యమునకు చేరెను. ఆ దేశాధిపతి కొల్వు లోనున్నచున్నాడను వృత్తాంతమును విని జాతర్లు జరిగే తావుకు భగవానుడు వెళ్లెను. దున్నపోతులను నరకబోవుటను భగవానుడు వీక్షించి ఆగండని కేకలు వేయుచు పసిగత్తి హంతకుని హస్తము పట్టుకొని, వీటిని వధించుటకు కారణ మేమని వాని నడిగెను. అచ్చట నున్న భూపాలుడు ముందుకు వచ్చి "ఓ మహాత్మా! కలరా మశూచికాదులు వచ్చి ప్రజలను హతమొనర్చుచుండ రోగములనుండి రక్షించిన జీవబలి నిస్తామని ఈ దేవతకు ముడుపులుకట్టుకొనగా మమ్ములను రక్షించినది. అందుచే ఈ జీవులను బలినిచ్చుచున్నా"మని చెప్పగ భగవానునికి పుడమిరేనికి ఈ విధముగ సంభాషణ జరిగెను—

భగవానుడు:- ఓ రాజా! ఎంత కాలమునుండి మీ రిట్లు జరుపుచున్నారు?

రాజు:- ఓ స్వామీ! ఈ పట్నము కట్టినదిమొదలు నేటివరకు ప్రతి సంవత్సరము జరుగుచున్నది.

భగ:- అప్పటినుండి ఇప్పటివరకు ఈ పట్నములో ఎవరు మృతి నొందలేదా ?

రాజు:- పురజనులెందరో కాటిలోకి పోవుచునేయున్నారు.

భగ:- చచ్చినవారెల్ల మారెమ్మతల్లికి మ్రొక్కనివారేనా ?

రాజు:- ముడుపులు కట్టినవారిలో గూడ ఎందరో గతించినారు.

భగ:- ముడుపులు కట్టుకొన్నవారిని మారెమ్మతల్లి ఎందుకు బ్రతికించలేదు ?

రాజు:- ఎందుకు బ్రతికించలేదో తెలియదు.

భగ:- వ్యాధులు వచ్చినది మారెమ్మకు మ్రొక్కనివారి కేనా?

రాజు:- ముడుపులుకట్టుకొన్నవారికిగూడ రోగములువచ్చినవి.

భగ:- తన శరణుజొచ్చినవారికి రోగములురాకుండ మారెమ్మ తల్లి ఎందుకు చేయలేదు ?

రాజు:- ఎందుకు చేయలేదో మాకు తెలియదు.

## జంతుబలినిషేధన ప్రబోధము

భగవానుని ప్రశ్నలకు భూపతి చెప్పిన సమాధానము విని "ఓ రాజా ! నీ సమాధానమువల్ల మారెమ్మకు పక్షపాతము లేనట్లు ఋజువగుచున్నది. రుధిరపానమున కాశించి తనకు జీవబలి నిచ్చువారిని బ్రతికించుటయు, జీవబలి నివ్వనివారిని చంపుటయు లేదని స్పష్టముగ ప్రత్యక్షముగ కనుబడుచుండ, మీరే జ్ఞానహీనులై జీవబలి నిచ్చుచు ఘోరపాపు లగుచున్నారు. మీ రిట్లు క్రూరకృత్యము లొనర్చుచున్న మీ కెన్ని

జన్మలకైన సుఖములొందుట సున్న. ఇట్టి క్రూరకృత్యములవల్ల మీ వాంఛలు నెరవేరుట కల్ల. జీవహింసలు నూనకేని మీ బాధలు పోవుట హుళక్కి. జీవబలి మ్రొక్కుకొన్న వారుగూడ చచ్చుటను మీరు ప్రత్యక్షముగ చూచుచుండియు మీ రింక మూఢులై జీవబలు లిచ్చుట హీనజన్మలు కావలె నని మీరు యత్నించుచున్నట్లగును.

శక్తులను కొల్చువారు, గీతలోని 17 అ. 4 శ్లో. లోని తీర్మానము ప్రకారము తామసస్వభావులుగా నిర్ణయింపబడుదురు. తామసస్వభావము గలవారికి గీత 14 అ. 18 శ్లో. లోని సూలు ప్రకారము పశ్వాదిజన్మలె ఖాయపరచబడును. పశుపక్ష్యాదిజన్మలు అక్కరలే దనుకొనువారెల్లా శక్తికొల్పులు వర్జించాలి.

భాగవతము 5 స్కం. 2ఆశ్వా. 156 శైక్షనుప్రకారము జీవబలి నిచ్చువారు నరకలోకమునకె పంపబడుదురు. యమదూతలబాధ తప్పించుకొన దలచువారెల్ల జీవబలినిషేధనదీక్ష పూనాలి.

10 స్కం. పూర్వభాగము 886, 888 శైక్షనుల ప్రకారము రోగారోగములను, చావుబ్రతుకులను, కలిమిలేములను, కష్టసుఖములను తారుమారుజేయగల అధికారము తనకర్మకు తప్ప ఈ క్షుద్రదేవతలకు ఏమాత్రము లేదు. తన కర్మె తనను ఆడించుచున్నదని దృఢముగా తెలుసుకోవలెను. జీవబలి కాశించి దేవతలు మీ అభీష్టములుతీర్చుట యథార్థమెఅయిన

యెడల జీవబలినిస్తామని మ్రొక్కుకొన్నవారందరికి రోగములు, ఆపదలు మొదలగునవి రాకూడదు. జీవబలి మ్రొక్కుకొన్న వారికిగూడ అనేక బాధలు వచ్చుచున్నవి. ఈ దాఖలావల్లనే జీవబలి నివ్వకపోయినందున బాధలు వచ్చుటలేదనియు, ఆపదలు వచ్చుటకు ఏదో కారణ ముండు ననియు, ఆ కారణము తన ప్రారబ్ధకర్మ యనియు మజువగుచున్నది. ప్రారబ్ధకర్మ నశించిపోవుకాలమునకు మీ దేవతలమ్రొక్కులు, మీయత్నములు ఫలించుచున్నవి. మీ యింట్లో మీరు పండుకొన్నను అప్రయత్నముగ మీ కోర్కెలు గట్టెక్కుచున్నవి. ప్రారబ్ధకర్మ ననుభవింపవలసియుండువారికి ఏ దేవతగూడ అడ్డుపడుట లేదు. ఎన్ని దేవుళ్ళకు మ్రొక్కినను ఖాళీ యగుచున్నవి. చేసిన యత్నములన్నియు చెడిపోవుచున్నవి. భూలోకములోని వైద్యు లందరివద్దకుతిరిగినను వ్యర్థమేయగుచున్నది. ఔషధము లెన్ని యున్నను ఒకటి కూడా ఉపయోగపడుటలేదు. ఇటువంటి దాఖలాల వల్లనే ప్రారబ్ధకర్మ తప్పింప ఏ దేవతకు అధికారము లేదని గ్రహించుకొనుడు.

అరణ్యపర్వం 5 ఆశ్వా 62, 63 న్ను, శాంతిపర్వము 1 ఆశ్వా. 213, 15, 16 తీర్పుల ప్రకారము మీరు వెనుకటి జన్మలో ఏఏ వేళలందు, ఏ వయస్సులో, ఏ పాపపుణ్యముల నొనర్చితిరో వాటి ఫలములె నేడు ఆయా వేళలకు వచ్చి వాటి ప్రభావములు మీకు ప్రత్యక్షముగా చూపుచు చెలామణిచేసి కొని పోవుచున్నవి.

భూలోకములోని గణాచారు లందరిని రప్పించి శివమె క్కించినను లోకములో నున్న యావత్తు సారాయి తెచ్చి త్రాగించి తందనాలుత్రొక్కించినను ప్రపంచమున గల గుగ్గి లము, సాంబ్రాణి యావత్తు తెచ్చి ధూపములువేసినను, కొర డాలతో ఎంత బాదుకొన్నను, అన్ని దేశములలోని మూగ జీవు లన్నిటిని తెచ్చి బలియిచ్చినను మీరు కొలుచుచున్నట్టి దేవత మీలో నొకరికైన కనుపించి "మీ జాతరకు ఆనందిం చినాను, మీ కిక ఏలాటి బాధలు రాకుండ చేస్తా నని చెప్ప టకుగాని, నిషాలో నుండి తందనాలు వేసిననాటి కాళ్ళనొప్పుల నైన కొరడాదెబ్బల వలన కలిగిన శ్రమనైన శివమెక్కి అరచిన నాటి గొంతునొప్పి నైన పోగొట్టగల అధికారము ఏమాత్రము లేదు. మీకు అకాలమృత్యువులను తెచ్చిపెట్టగల అధికారమే మీ శక్తుల కున్న యీపాటికి మానవుల, మూగజీవుల సృష్టి ఆగిపోయివుండెడిది. ఉపద్రవములను తెచ్చిపెట్టగల అధికారమే వీటి కున్న "ఎప్పుడో మీరు లెక్కప్రకారము ఇచ్చునట్టి జీవ బలికి ఆశించి మీరు వేసే గడువుకాలము వరకు పస్తులతో వుంటూ మీ మట్టూ తిరుగవలసిన అగత్యము లే"దని తెలుసు కొనుడు.

ఏ జీవికిని హానిచేయక తీవ్రమైన పట్టుదలతో రెండవ ధ్యాస లేకుండా నిశ్చలచిత్తముతో రాత్రింబగళ్ళు తదేకధ్యాన ముతో కొన్ని వందల సంవత్సరములు జగన్మాతను కొల్చిన వారియొక్క పూజలనైన అంగీకరించి ఫలము నివ్వని లోక

మాత జీవబలియే ముఖ్యముగా పాటించుచు ఆపదలప్పుడు, పండగలప్పుడు మీరు చేసే పూజలకు లోకమాత సంతోషించి మీ అభీష్టములు నెరవేర్చుటకు సిద్ధముగా యుండు నని తల చుట ఎంత అజ్ఞానమొ తెలుసుకొనుడు.

జంతుబలి యిచ్చుట దోషముకాదని బోధించు శాస్త్ర ములున్నను జీవబలి యిచ్చుట మహాపాతక మని వాదించునట్టి శాస్త్రములుకూడా వున్నవి. గనుక నరులవలెనె జీవించవలె నను వాంఛతోనున్న 'మూగజీవులను' చేతులార బలియిచ్చు పద్ధతిని మానివేసి వాటికి ప్రాణభిక్షపెట్టి సుకృతమును సంపా దించుకొనుదీక్ష పూనండి. ఏ జీవికని హాని కల్గించకుండనే అభీ ష్టము లివ్వగల సాత్వికపూజలు గల వని బోధించునట్టి శాస్త్ర ముల ననుసరించుట పాపరహితమైన మార్గమని తెలుసుకొ నుడు. దోషరహితమైనపద్ధతిని ఆచరింపక జీవులకు హానికల్గించే పద్ధతు లాచరించుట అధోగతికి పోకతప్ప దని రూఢిగా తెలు సుకొనుడు.

నేడు మీరు ఏ వయస్సులో ఏ కాలమందు ఏ పాప పుణ్యములు చేయుచుందురో వాటి ఫలితములను మీరు రాబోవుజన్మలలో అనుభవింపకతప్పదు. సాత్వికపూజలతో గూడ దేవతలను మెప్పించి అభీష్టములు పొందవచ్చు నని అనేక శాస్త్రములు బోధించుచుండ వాటినిత్రోసి వేసి హింసా యుతపద్ధతుల నాచరించుట పాపకృత్యమే యగును. విషము

కొంచెము త్రాగినను తర్వాత ప్రాణబాధకమై పరిణమించు నట్లు దుష్కర్మము చేయుసమయమునందు అల్పముగా దోచు నుగాని అనుభవించునప్పుడు అంతకంతకు పెరిగి మేరుపర్వతము వలె నగును. పూర్వజన్మలో మీ రొనర్చిన దుష్కృత్యముల వల్ల మీ రిప్పుడు వ్యాధులతో, కష్టములతో, దారిద్ర్యముతో బాధింపబడుచున్నారుగాని మీరు దేవుళ్ళను పూజించలే దని, శక్తులను కొల్వలే దని మీకు బాధలు వచ్చుచున్నవని ఏమా త్రము తలచవద్దు. క్రూరకృత్యములు మీరు మానుకొన్న మీజోలికి ఏ బాధలు రావు.

(1) పూర్వజన్మమున సుకృతము చేసినవారికిమాత్రమే ఔషధములు ఉపయోగపడుచున్నవనియు, హస్తపాదాద్యంగ ములు, అంగుళ్యాది ప్రత్యంగములు, గర్భపిండమునకు స్వాభా వముగ జనించుచుండినను గర్భస్థశిశువుకు నాయంగప్రత్యంగ ములయందు సౌందర్యాది గుణములు, కుబ్జత్వాది దుర్గుణ ములు, పూర్వజన్మార్జిత పుణ్యపాపముల వలన కలుగుచున్న వనియు వైద్యశాస్త్రము తీర్పు చెప్పుచున్నది.

(2) ఎల్లరకు జన్మాంతరకృత పుణ్యపాపకర్మానుసార ముగ లగ్నము సంప్రాప్త మగుచున్నదనియు, జన్మాంతరపుణ్య పాపవిశేషము వలన శుభాశుభములు ప్రాప్తించుచున్నవనియు జ్యోతిషశాస్త్రము వాదించుచున్నది.

(3) పూర్వజన్మయందు గావించిన దుష్కృత్యములే

నేడు వ్యాధులుగ, ఆపదలుగ, దారిద్ర్యముగ మారు్పచెంది వచ్చి కాలానుగుణ్యముగ జీవులను బాధించుచున్నవనియు వీటికి పరిహారము అనుభవించుటయేగాని తప్పించుకొనుమార్గము లేదనియు సకల శాస్త్రములు ఏకగ్రీవముగ తీర్మానించినవి. క్రూరకృత్యముల ఫలము ఏనాటికైన అనుభవింపక తప్పదు. జీవబలి నిచ్చుట మహాపాతక మనియు, అధోగతికి మార్గ మనియు తెలుసుకొనుడు.

మీరు పూజించుచున్న దేవర్లనేకదా బ్రాహ్మణులు వైశ్యులు సాత్వికపూజతో పూజించి జీవబలి నివ్వకుండ వారి అభీష్టములు నెరవేర్చుకొనుచుండుటను మీరు ప్రత్యక్షముగ చూచుచున్నారే! వారికి అపకారముచేయని మారి మిమ్ములను భక్షించునా ? లేదు లేదు. ఓయి వెఱ్ఱివాడా ! ఇకనైనను మీ వెఱ్ఱిమొఱ్ఱిభ్రాంతులను విడనాడి వారిని చూచైన బుద్ధి తెచ్చుకొని మిమ్ములను జ్ఞానహీనులుగ చేయుటకై క్రూరు లెవరో పన్నిన కుట్ర యని గ్రహించుకొని జీవబలి వర్జించి, సాత్వికపూజతో దేవిని ఆరాధింప దీక్షపూనండి. వెనుకటిపాప ఫలమునె అనుభవింపలేక అల్లాడుతూకూడ ఇంకను మారని, శక్తు లని లేనిపోని పిచ్చివేషాలతో, మూఢనమ్మకములతో, కల్పితకులాచారములతో చేతులార జీవహింసను చేసి యమ బాధ లెట్లోర్చగలరోయి. ఈక్షుద్రదేవతలవల్లమీకు తాత్కాలికసుఖములు కనుపించినను తర్వాతనైన క్షుద్రదేవతలపేరుతో

చేయలేనట్టియు, నోరులేనట్టియు, చిన్నబిడ్డలైన పశుపక్షిమృగా దులను వధించునట్టి తన పెద్దపుత్రులైన మానవులను తప్పక దండించును. మూగశిశువుల క్షేమమందె తల్లులు మిక్కిలి శ్రద్ధగలిగి మక్కువతో యుండునట్లు ఆ లోకమాత గూడ మూగజీవుల రక్షణయందె మిక్కిలి అభిమానముకలిగి ప్రేమా తిశయముతో వీక్షించుచుండును. జగన్మాతప్రేమను పొంద దలచువారు దేవిస్తోత్రములలోని భావముల ననుసరించాలి. చండికాసప్తశతీస్తవరత్నములో 5 అధ్యాయమున 17 శ్లోక ములో

(1) సర్వజీవులలో ఛాయారూపముతో నున్న ఓ దేవి నమస్కార మని యున్నదిగాన ఏ జీవిని బాధించుటకు అవకా శము లేదని జ్ఞాపకముంచుకొని, మూగజీవులను బాధించుట మానుకోవలెను. మాననివారు ఈ స్తోత్రములోని అర్థము ప్రకారము దేవినినె బాధించినవా రయ్యెదరు.

(2) అనేక జాతిరూపములతో జీవరాసులందు మెలగు చున్న ఓ దేవి నమస్కార మని యున్నదిగాన మూగజీవుల యెడనైన దౌర్జన్యము చూపరాదు. 21 శ్లో.

(3) సర్వభూతములను శ్రద్ధతో కాపాడునట్టి ఓ దేవి నమస్కారమనియున్నదిగాన ప్రజలను మాత్రమే శ్రద్ధతో కాపాడునని తలచవద్దు. —24 శ్లో.

(4) సమస్తజీవులను దయతో చూచునట్టి ఓ దేవి

నమస్కారమని యున్నదిగాన నరులను మాత్రమే దయతో చూచుమని తలంపవద్దు. —29 శ్లో.

(5) జీవరాసులన్నిటిని తల్లివలె కాపాడునట్టి ఓ దేవి నమస్కారమనియున్నదిగాన జనులను మాత్రమే తల్లివలె కాపాడుమని అనుకోవద్దు. —31 శ్లో.

మీరొనర్చెడు దేవీస్తోత్రములలోని అర్థముల ప్రకారము మీరు వర్తింపనంతవరకు దేవి కోపానలమునకు మీరు గురిగాకతప్పదు. దేవిభక్తులనెడు వారెల్లా దేవి సంతతియైన పశుపక్షిమృగాదులను హింసించుట మానుకోవలెను.

మంత్రపుష్పములోని "నీ వారశూకవత్తన్వీ" అను ప్రబోధముల ప్రకారము భగవదాకారమును సేవింపనంతవరకు మీ అభీష్టములు నెరవేరుటకల్ల. భాగవతములో 7 స్క: 241,366 తీర్పుల ప్రకారము మీరు సంచరించనంతవరకు మీ ప్రార్థనలు అంగీకరించబడవు. 3స్కం. 961 రూలు ప్రకారము, సకలజీవరాసులలో నివసించుచున్న భగవంతుని మీరు పూజింపనంతవరకు విగ్రహారాధనకై మీరొనర్చెడు యత్నములన్నియు వ్యర్థములేయగును.

గోసంతతి మాత్రమె పవిత్రమనియు, ఇతరజీవులను భక్షింపవచ్చుననియు తలచవద్దు. పందివల్లపొందే యుపయోగములు గోసంతతివల్ల పొందలేము. జీవులన్నియు పవిత్రములైనవే. దేశక్షేమమునకు జీవులన్నియు అవసరమే. దేశక్షేమము

నకె జగన్మాత సమస్త చరాచరములను సృష్టించినది. దేని క్షేమమునకు పనికిరాని వస్తువు భగవంతుని సృష్టిలో లేదు. మీకు శక్తియున్న క్రూరజీవులవల్ల ఉపయోగములు పొంద వచ్చును. మా శక్తివల్లనే క్రూరజీవులను ద్వేషముతో చూచుచున్నారు. ద్వేషబుద్ధి మీకుండుటచేతనే క్రూరజీవులు మీకు అపకారము లొనర్చుచున్నవి. భాగవతములో 10 స్కం. పూర్వ. 1389 శాంతిపర్వం 5 అశ్వా. 144 సెక్షనుల ప్రకారము ఇతరులను మీరు ఏభావముతో చూచెదరో. ఆభావనతోనే ఇతరులుకూడ మిమ్ములను చూచెదరను సంగతి మీరు మరచిపోవద్దు.

జీవహింసకులను ఖండించుటకె అప్పుడప్పుడు జగన్మాత అవతారము లెత్తుచు దుర్జన శిక్షక బిరుదు వహించుచున్నది. గీతలో 7 అ.లో 15 శ్లో. 16 అ. లో 19,20 శ్లోకములయొక్క తీర్పులప్రకారము దుష్కర్మము లొనర్చువారు భగవంతునికి విరోధులయ్యెదరు. సాత్విక పూజతో సన్మార్గమున మెలగు వారినే జగదేకమాత దయతో శ్రద్ధతో, ప్రేమతో, కాపాడు చు, సజ్జన బిరుదు వహించుచున్నది. భగవంతుని అనుగ్రహా మును పొందదలచువారు గీతలోని 6 అ.లో 31,7 అ 28,12 అ 4,13. 13అ 8, 16 అ 1, 18 అ 20 శ్లోకములలోని ప్రబో ధముల నాచరించాలి. దేవినివేదనకై జీవబలులిచ్చుట తామస పూజయనబడును. తామస పూజలవల్లనే బాధలు ఉత్పత్తి యగుచున్నవి. గీతలో 9 అ 26 శ్లోకములోని వాగ్దానము

ప్రకారము, పత్ర పుష్పఫలోదకములకు కూడ సంతసించి అభీష్టములు నెరవేర్చెదనని" భగవంతుడు ప్రతిజ్ఞచేసి చెప్పు చుండగా సాత్వికపద్ధతిని త్రోసివేసి, జీవబలులిచ్చు పద్ధతి నాచరించుట క్రూరకృత్యమే యగును. దేవి నివేదనకు శాకా హారము ఆరగింపుచేయుట సాత్వికపూజ యనబడును. సాత్విక పూజలు మహాభోగముల నిచ్చుచు జననమరణపురాసులను దగ్ధము చేయుచుండును.

(1) నిజమైన భగవదాకారమును సేవించవలెనంటె కైవల్యోపనిషత్తులో 6వ శ్లోకములో శాసించినప్రకారము 'హృదయకమలమధ్యయున్న భగవంతుని' ఆరాధించవలెను. తక్కిన మూర్తులను మీరెన్నియుగములు సేవించినను వ్యర్థమే యగును.

(2) యథార్థమైన దైవధ్యాన మొనర్చవలెనంటె స్కందోపనిషత్తులో 9వ శ్లోకములోని తీర్మానము ప్రకారము "క్రూరకృత్యనిషేధమను నీళ్ళతో స్నానమొనర్చి, ఇంద్రియ నిగ్రహమను శౌచము కల్గి, అభేద దృష్టియనే ధ్యానముతో, దేహమనే దేవాలయములోని, జీవుడనే దేవుని' సేవించి నప్పుడే మీ అభీష్టములు కడతేరును. అన్యమార్గములు అధో గతి పట్టించును.

(3) పరమేశ్వరుని చూడవలెనంటె దక్షిణామూర్త్యు పనిషత్తులో 20వ శ్లోకములో తీర్పుచెప్పినప్రకారము "ధ్యాన

యను ప్రమిదయందు వైరాగ్యమనెడి తైలమునుపోసి, భక్తి యనెడు వత్తివేసి, జ్ఞానమను దీపమును వెలిగించి చూచిన" పరమేశ్వరుడు కనుపించవలసినదేగాని రెండవ మార్గములేదు.

(4) జగన్మాతను సంతోషపరచగల పూలతో పూజించవలెనంటె, వామన పురాణములో నిర్ణయించిన ప్రకారము అహింస, ఇంద్రియ నిగ్రహము, సర్వభూతదయ, క్షమ శాంతి, తపము ధ్యానము, సత్యము" అను పుష్పాలపూజతో జగన్మాతను పూజించవలెను. ఇతర పూలపూజలవల్ల దోషము సంక్రమించును.

(5) లోకమాతను ఆనందింపజేయగల పదార్థములను ఆరగింపుచేయవలెనంటె, ఆత్మబోధోపనిషత్తులో 25 వ శ్లోకములో శాసించిన ప్రకారము "ఆత్మకు వ్యతిరేకమైన పదార్థములను" ఆరగింపు చేయువారు విరోధులయ్యెదరు.

(6) ఈశ్వరానుగ్రహము పొందవలెనంటె భాగవతం 4 స్కం. 207.355 తీర్పుల ప్రకారము సమస్తజీవులను తనవలె చూచుకోవలెను. ఈ మార్గముల ననుసరించువారు శత్రువులయ్యెదరు.

(7) తుచ్ఛమైన జన్మములు రాకూడదనుకొంటె రాగద్వేషాది త్రయోదశ దుర్గుణములు వర్జించాలి.

(8) శ్రేష్ఠమైన జన్మలు రావలెననుకొంటె సత్యాది ద్వాత్రింశతి సద్గుణములతో వర్తించాలి.

దుష్టకృత్యములు లొనర్చువారికి దేవతా పూజలు, దాన ధర్మములు, వరములు వ్యర్థములగుచున్నవి. రావణ, కుంభ కర్ణాదులే యిందుకు దాఖలా.

మీరు పూజించుచున్న దేవిఆకారమైన చూచి మీరు జంతుహింస నిషేధనదీక్ష పూనాలి.

(1) జీవహింస లొనర్చువారిని ఖండించెద నని దాఖలా చూపుటకె నరులతలపుర్రెలను కంఠాహారముగ దేవి ధరించినది.

(2) క్రూరకృత్యము లొనర్చువారిని హతమొనర్చెద నని సూజువుచూపుటకె గదాఖడ్గాది ఆయుధములను ధరించినది,

(3) "జీవహింస చేయనద్దు" అనుమాగు మని బోధిం చుటకె ఒక హస్తము పైకెత్తినది.

(4) "జీవహింసలు చేయను, బుద్ధివచ్చిన" దని శపథ మొనర్చు మని చెప్పుటకె యింకొక చెయ్యి చాచినది. ఓ జగ న్మాతా! ఇదుగో జంతుహింస నిషేధనదీక్ష పూనుచున్నానని చేతిలో చెయ్యివేయుము. వెంటనే జగదంబ కరుణించును.

ఇకనైన క్రూరకృత్యములు మానివేసి యథార్థమును తెలుసుకొని సాత్వికమార్గమునమెలగనారంభించిననాటినుంచె మీరు బాధలనుండి విముక్తిగాంచుటకు యత్నించుచున్నవా రగుదురు. సత్వగుణము నాధారముగ చేసుకొన్న ధర్మము, సూక్ష్మధర్మ మనబడును. సూక్ష్మధర్మముతో ప్రవర్తించనంత వరకు మీరు బాధలు ననుభవింపక తప్పదు. ప్రతి మానవుడు

ప్రతి నిమిషమున త్రికరణశుద్ధితో అనుష్ఠింపవలసిన సనాతన ధర్మము లేవనగా—

(1) తన బాధలు భస్మమై పోవలెనంటె తాను ఏ జీవిని బాధింపరాదు.

(2) తన దుఃఖములు ధ్వంసమై పోవలెనంటే తాను ఏ జీవిని దుఃఖపెట్టరాదు.

(3) తన కష్టములు రూపుమాసిపోవలెనంటె తాను ఏ జీవిని కష్టపెట్టరాదు.

(4) తన ఉపద్రవములు హతమైపోవలెనంటె తాను ఏ జీవికి ఉపద్రవము కల్గింపరాదు.

(5) తాను శుభములు పొందవలెనంటె త్రికరణశుద్ధిగా వర్తించాలి.

(6) జీవులను రక్షింపకున్న తనకు అధోగతి రాదుగాని జీవహింస లొనర్చిన తాను అధోగతికి పోవుట ఖాయము.

(7) దేవుళ్ళను పూజింపకపోయిన తనకు బాధలు రావు గాని, జీవులను బాధించిన తాను బాధలొందుట నిజము.

(8) దేవుడు లే డను సిద్ధాంతముతో ప్రవర్తించిన ఏలాటి నష్టము రాదుగాని నీతినియమములు లే వను సిద్ధాంతముతో సంచరించిన ఉపద్రవములు సంభవించుట సిద్ధము.

(9) ఉపకార మొనర్పకపోయిన తనకు కష్టములు రావు గాని అపకార మొనర్చిన తాను కష్టము లొందుట ధ్రువము.

(10) దానధర్మము లొనర్పకపోయిన తనకు ఆపదలు రావుగాని ద్రోహబుద్ధితో వర్తించిన ఆపదలు వచ్చుట వాస్తవము.

(11) సన్మార్గము నవలంభించకపోయిన తనకు ఉపద్రవములు రావుగాని దుర్మార్గము నవలంభించిన తాను ఉపద్రవములొందుట నిజము.

(12) జీవులను సంతోషపెట్టుట పుణ్యము. జీవులను దుఃఖపెట్టుట దుర్మార్గము.

మానవజన్మ ఎత్తినవారెల్ల కనీసము తన చేతులార ఏ జీవిని చంపక, చంపించక, మాంసము తినకుండునట్లు దీక్ష వహించుట ప్రథమ కర్తవ్యమైయున్నది. ఈమాత్రపు దీక్షను పూనుటకు తిరస్కరించువారు శ్రేష్ఠమైన జన్మలు అక్కరలేదని తుచ్ఛమైన జన్మలెత్తుటకే తీవ్రమైన తంటాలు పడుటకే జీవించుచున్నవారలగుదురు.

## — మృత్యువును పారదోలు పద్ధతి —

మృత్యువుగాని, రోగములుగాని, దరిద్రముగాని, ఆపదలుగాని రాకుండ తప్పించుకొని, శాశ్వతముగ జీవింపవలెనను వాంఛ ఉన్నవారెల్లా సాత్విక పూజతో భగవంతుని పూజించుటయే సరియైన త్రోవ. సాత్వికపూజతో సర్వేశ్వరుని మెప్పించి, జననమరణపురాసులను భస్మమొనర్చి, శాశ్వత పదవులను సాధించినట్టి మహాత్ములెందరో.

(1) సాత్త్విక ప్రాజ్ఞతోనే, తీవ్రమైన పట్టుదలతో, తదేకధ్యానముతో ఈశ్వరు నారాధించి, మృత్యువునాసట్టి మార్గమును సాధించిన మార్కండేయుని ఆదర్శముగ తీసి కొని జీవబలితో దేవుని కొల్చునట్టి పద్ధతిని వెంటనే తీసివే యాలి. ఆ మహాత్ముడు చూపిన పద్ధతులతో నడవనంతవరకు మృత్యుదేవత మీావధ పట్టుచునేయుండును.

(2) సాత్త్విక పట్టుదలమీాదనే తీవ్రమైన ధ్యానముతో హరిని మెప్పించి సూర్యచంద్రాదులచే ప్రదక్షిణ మొందుచు తన కాంతిచే త్రిలోకములను ప్రకాశింపచేయుచు మూడు లోకములు మునిగిపోయినను తన స్థానమునకు భంగము లేకుండ ప్రకాశమానముతో నుండగలపదవిని సాధించినట్టి "ధృవు"ని దాఖలాగ నుంచుకొని పశుపక్షి మృగాదులను బలినిచ్చెడు ఆచారమును భస్మమొనర్చాలి. ఈ కార్యక్రమ మును మీారు త్రోసివేయుట చేతనే అకాల మృత్యువు మీా వెంటబడుచున్నది.

(3) సాత్త్విక భక్తితోనె జగద్రక్షకు నారాధించి, చచ్చినవారిని బ్రతికించెడు విద్యను సాధించినట్టి 'శుక్రాచార్యు లవారి'ని ఆధారముగ నుంచుకొని శక్తులకు మూగజీవులను బలినిచ్చుపద్ధతులను రూపుమాపాలి. ఆ మహాశయుని అడుగు జాడలలో మెలగనంతవరకు మృత్యుదేవత మిమ్ములను వదలి పెట్టదు.

(7) తన భర్త చావును రూపుమాపుటకై సూర్యోదయము కాకుండ ఆజ్ఞాపించినట్టి కౌశికపత్ని యగు 'సుమతీ దేవిని' ఆదర్శముగ తీసుకొని జీవబలులను మ్రొక్కుకొనెడు పద్ధతులను మానివేసి సుమతీదేవి యొక్క ఆచారమునె ఆచరించుటకు స్త్రీలెల్లరు దీక్షలుపట్టాలి.

(8) యమధర్మరాజును నిలవవేసి తన భర్తను బ్రతికించుకొన్నట్టి 'సావిత్రీదేవిని' దాఖలాగా నుంచుకొని మూగజీవులను, మనుష్యులను కట్టుకొనెడుపద్ధతులను రూపుమాపాలి. సావిత్రీదేవియొక్క మార్గమున నడుచు పడతులెల్లను శపథము లొనర్చాలి.

(9) చచ్చినవారిని క్షణములో బ్రతికించునట్టి శక్తిని గడించిన అమావాస్యాసోమవతీవ్రతములోని చాకలికులస్థురాలైన 'సోమ' యను నామెను నిదర్శముగ నుంచుకొని ఆమె పద్ధతుల ప్రకారము వనితలు మెలగనంతవరకు సంసారబాధలు ప్రాప్తించుచునేయుండును.

(10) యమధర్మరాజును శిక్షింపజేసి తన భర్తను బ్రతికించుకొన్నట్టి భక్తేశ్వరవ్రతములోని 'కల్యాణిని' మార్గదర్శముగ నుంచుకొని పూబోడులు వర్తింపనంతవరకు పతివియోగములు తప్పవు.

(11) చంపబడిన కుమారులను క్షణములో బ్రతికించుకొన్నట్టి సావిత్రీదేవివ్రతములోని సోమిదేవమ్మ ఆచారము నింతులు నాచరింపకేని సంసారసౌఖ్యము పొందుట సున్న.

జీవబలి నివ్వకుండ సాత్వికపూజతోనే సర్వేశ్వరుని మెప్పించి మృత్యువును జయించినట్టి మహాత్ము లింక ననేక మంది కలరు. సాత్వికపూజవల్ల మృత్యుదేవతను భస్మమొనర్ప వలసిన దేగాని మరియొక మార్గము లేదు.

జాతరు లొనర్చుటవల్ల దేశము క్షేమముగా నుండునని అజ్ఞానమువల్ల తలచుచున్నారేగాని జ్ఞానదృష్టితో ఆలోచించి నష్టైన మూగజీవుల ఘోషవల్ల క్షామములు వచ్చుచున్నవని స్పష్టముగ తెలియగలదు. జాతర్లవల్ల కరువుకాటకములను రాకుండ చేయనచ్చునవిగాని, నివారింపవచ్చునవిగాని ఏ శాస్త్రముగూడ బోధించలేదు. అట్లొనర్చిన ప్రత్యక్ష దాఖలా చూపినవా రొకరైన లేరు.

## కరువు కాటకముల నివారించు మార్గము

సాత్వికపూజలవల్ల కరువు కాటకములు రూపుమాప వచ్చు నని శాస్త్రములు తీర్మానించుటయే గాక రుజువుచేసినట్టి మహాత్ము లిరుగో.

(1) తన దేశములోని అఖిలజనులను అత్యంతాహ్లాదం బున దామరతంపరై పుత్రమిత్రకళత్రాదులతోడ నభివృద్ధిచెం దునట్లు చేయుచు తరుగులేని భోగభాగ్యసంపదలు కలుగజే యుచు కావలసినప్పుడెల్లా కావలసినంత వర్షము కురిపించుచు కోరిన పంటలు కోరినప్పుడెల్లా కోరినంత పండించుచు వ్యాధు

లను బాధకుండ రద్దుగావించి క్రమముతప్పిన మరణములను కట్టివేసి అకాలమృత్యువును ఆపివేసి క్రిమికీటకపశుపక్షిమృగాములకుగూడ వైకుంఠలోకము నిర్మించుచు రాజ్యపాలన మొనర్చిన ముక్తాంగదమహారాజును మార్గదర్శముగ నుంచుకొని వర్తింపలేనట్టివారు దేశాధిపతు లగుటచేతనే దేశారిష్టములు సంభవించుచున్నవి. ఆహారపదార్థములకొరత సంభవించినప్పుడెల్లా మాంసాహారమును ఉపయోగించుకొను విధానమును కొచ్చుగుంటలలోగూడ చేపల వృద్ధిగావించుకొను పద్ధతిని మేకల, పందుల, కోళ్ళ, మత్స్యాది పరిశ్రమలను స్థాపించి మాంసాహారసంపదను వృద్ధిచేసుకొను పద్ధతులైన ప్రజలకు బోధింపకున్న బ్రతుకలేరేమోనను ఉద్దేశముతో మాంసాహార సంపదను వృద్ధిచేయుటకు కావలసిన సమస్త వసతులను ఏర్పాటుచేయ బ్రహ్మాండమైన కృషిగావించుచు తీవ్రమైన ప్రోత్సాహమిచ్చుచున్న నేటి దేశాధిపతులవంటివారు ఏ యుగములో కూడా జన్మించలేదని శ్లాఘింపవచ్చును.

(2) తా నున్నంతకాలము తన దేశవాసులకు అకాల మృత్యువులు, వ్యాధులు, లేమిడి, కరువుకాటకములు రాకుండ చేసి తన దేశమును హతముచేయ మృత్యువు, రోగములు, జ్వరములు మొదలగు క్రూరు లగు నేబదికోట్ల సైనికులతో దండెత్తివచ్చిన యమధర్మరాజును పారద్రోలి మృతిచెందెడు జీవులకు వైకుంఠపదవికి పంపుచు, పదివేలసంవత్సరములు రాజ్యపాలన మొనర్చిన కీర్తిమంతు డనే రాజును దాఖలాగా నుంచు

కాని ప్రవర్తింపలేనట్టివారు రాజ్యాధిపతులగుటచేతనే దేశోపద్రవములు ప్రాప్తించుచున్నవి. పై పద్ధతిని త్రోసివేయుటచేతనే మీరెన్ని ప్రాజెక్టులు నిర్మించుచున్నను అతివృష్టి అనావృష్టి దోషములు మీ వెంట బడుచునేయున్నవి. పంట లభివృద్ధికై మీ రెన్ని స్కీములు ప్రవేశపెట్టుచున్నను రేషనింగుపద్ధతే వికసించుచున్నది. క్రొత్తరకములైన ఔషధములెన్ని తయారు చేయుచున్నను వ్యాధులు మీ వధపెట్టుచునేయున్నవి. అణు విజ్ఞాన పరిశోధనలవల్ల మీరు సాధించే సాధనలన్నియు మీ చావులకే తోడ్పడుచు మరుసటి క్షణమునకే నిష్ప్రయోజనములగుచున్నవి. మిల్టరీ బలము, అటంబాంబులు, విమానములు, టాంకులు, అణ్వస్త్రాలు సమృద్ధిగా ఉన్నను, రణరంగాది ఉపద్రవములకే ఆహుతి యగుచున్నారు. ఏ విధమైన బాధలు లేకుండ దేశమును పాలించవలెనంటె పై పద్ధతిని సాధింప రాజ్యాధిపతులు తీవ్రమైన కృషి చేయాలి.

(3) తన రాష్ట్రములో ప్రతి సంవత్సరము పర్జన్యుడు బంగారువర్షంబుతో బంగారుమయంబు లగు ఎండ్రకాయలు, మొసళ్ళు, తాబేళ్ళు, చేపలును కురియునట్లు చేసిన సుహోత్ర మహారాజు ప్రకారము మెలగలేనట్టివారు రాష్ట్రాధిపతులుగ నుండుటచేతనే దేశము దరిద్రస్థితికి వచ్చుచున్నది. ఈ మార్గమును విడిచి మీ రెన్ని ప్రణాళికలు ప్రవేశపెట్టినను, ఉన్న ధనమును ఖాళీచేయుటేగాని ఏలాటి ప్రయోజనము లేదు. అతివృష్టి అనావృష్టుల సంచారములలో మీరు ప్రవేశపెట్టిన

క్షేత్రములలో నొకటిగూడ అక్కరకు వచ్చునది లేదు. దేశ క్షేమమును కోరునట్టి రాష్ట్రాధిపతులెల్లరు పై ప్రణాళికను సాధింప తీవ్రమైన కృషి చేయాలి.

(4) పంచభూతములు సమ్మె చేయగా వాటిస్థానములో క్రొత్తగా వాటిని సృష్టించి తన ప్రజలకు ఏలాటి బాధలు రాకుండ రాజ్యపాలన మొనర్చినట్టి రిపుంజయమహారాజు యొక్క అడుగుజాడలలో నడవలేనట్టివారు ప్రజాధిపతులుగ నుండుటచేతనే దేశమునకు అనేక అనిష్టములు సంభవించు చున్నవి.

పంచభూతముల విజృంభణశక్తిని అరికట్టవలెనంటే పై పద్ధతి తప్ప రెండవ మార్గము లేదు.

ప్రజలమేలు కోరునట్టి ప్రజాధిపతులెల్లరు పై పద్ధతిని సాధింప తీవ్రయత్నము లొనర్చాలి.

(5) తా నున్న రాజ్యమునకు క్షామదేవతను రాకుండు నట్లు శాసించినట్టి ఋష్యశృంగమహాముని యొక్క అనుష్ఠాన మును ప్రవేశపెట్టినక్షణములో క్షామదేవత మాయమైపో వును. ఈ పద్ధతి మీాకు నచ్చకపోవుటచేతనే కరువు కాటకము లొచ్చి మీా వధపట్టుచున్నవి.

(6) తానుండే దేశమునకు అతివృష్టి అనావృష్టి మొదల లగు ఏలాటి దోషములు రాకుండునట్లు ఆజ్ఞాపించినట్టి అశ్వ ఫల్కమహాముని యొక్క నిష్ఠను అమలుజరిపిననిమిషములో

కరువుకాటకములు దగ్ధమైపోవును. ఈ ఆచారమును మీరు త్రోసివేయుటచేతనే ఈతిబాధలు మిమ్ము చుట్టుకొని తిరుగుచున్నవి.

(7) పన్నెండు సంవత్సరములు వర్షము లేక క్షామము సంభవించినప్పుడు షడ్రసోపేతముతో అన్నదానమొనర్చి ప్రజలను కాపాడినట్టి సారస్వతమహాముని యొక్క ఆచారమును ఆచరింపచేసిన ఆ క్షణములోనే దేశారిష్టములన్నియు భస్మమైపోవును. ఈ మార్గము మీకు మోటగుటచేతనే క్షామదేవతకు మీరు ఆహుతి యగుచున్నారు.

(8) విపరీతమైన కాటక మొచ్చినప్పుడు ఏలాటి లోపములేకుండ తన్విదీర సమస్తమైన పిండివంటలతో ప్రజలను పోషించినట్టి గౌతమమహాముని యొక్క కార్యక్రమమును అవలంబించిన క్షణములో కాటకబాధలను ధ్వంసముచేయవచ్చును. ఈ కార్యక్రమమును మీరు తీసివేయుటచేతనే కాటకబాధలు మీ వెంట బడుచున్నవి.

(9) క్షామదేవతకు బలిగాకుండ తృప్తిదీర కోరిన పిండివంటలతో, పంచభక్ష్యపరమాన్నములతో ప్రజలకు ఆకలి బాధలను రూపుమాపినట్టి అనసూయామహాదేవియొక్క కార్యసాధన నవలంబించిన నిమిషాలమీద క్షామదేవత భస్మమైపోవును. కరువుకాటకములను పారద్రోలుటకు ఈ మార్గముతప్ప రెండవ మార్గము సృష్టిలో లేదు. మహాత్ములయొక్క సందే

శములను మీకు పాటించకపోవుటవల్లనే బాధలెన్నియోవచ్చి మిమ్ములను ఆవరించుకొనుచున్నవి.

పంచభూతములవల్ల సంభవించే బాధలను అరికట్టుటకు దైవశక్తులు సంపాదించినట్టి మహాత్ములే కావలెగాని కోట్లకొలది ధనమును వెచ్చించి బ్రహ్మాండమైన పట్టుదలతో మీరు పరిశోధనలు జరుపుచున్న సైన్సుశాస్త్రమువల్ల మీరు సాధించే సాధనలలో ఒకటికూడ ఉపయోగపడునది లేదు. క్రొత్త స్కీములు మీ రెన్ని ప్రవేశపెట్టినను ఒకటికూడ అక్కరకు వచ్చునది లేదు. ప్రజలలో దైవశక్తులు నశించుటచేతనే పంచభూతములు వాటి యిష్టమొచ్చినట్లు నడచుచున్నవి. పంచభూతముల సంహారమును ఆపవలెనంటే ప్రజలను తపోబలయుక్తులనుగ చేయుట దేశాధిపతులకు ప్రథమ కార్యక్రమమై యున్నది. నేడు మీరు జరిపే క్రీడారంగములోని చతురంగములు, ఫుట్‌బాల్, చెడుగుడు మొదలగు పోటీలవల్లనే దేశమునకు ఏలాటి ఉపయోగము లేదు. వాటిని రద్దుచేసి వాటి స్థానములో తపోబలప్రదర్శనపోటీలు ఏర్పాటుచేసి ప్రజలలో తపోబలము ప్రవేశపెట్టుట దేశక్షేమమునకు ప్రథమ స్కీమై యున్నది. దేశక్షేమము కోరునట్టి దేశాధిపతులెల్లను దైవశక్తులను గడించుటకై తగినవారని నియమింప తీవ్రమైన కృషి చేయాలి. గ్రామక్షేమము కోరువారెల్ల తమతమ గ్రామములందు తపోబలప్రదర్శనపోటీలు స్థాపించి వాటిలో పాల్గొనుటకు తగిన వ్యక్తులకు కావలసిన సమస్త వసతులను ఏర్పాటు

గావించి తీవ్రమైన ప్రోత్సాహ మిచ్చుచుండవలెను. ఈ మార్గమును త్రోసి వేయుటచేతనే గ్రామవాసులు అనేక బాధలకు గురియగుచున్నారు.

సాత్త్వికప్రజలవల్ల గడించిన మహిమవల్లనే కరువుకాటకముల నిర్మూలించిన మహాత్ము లింక నెందరెందరో గలరు. సాత్త్వికప్రజవల్ల దేశోపద్రవములను పారద్రోలవలసినదే కాని మరియొక పద్ధతి లేదు. జీవబలికి దేవుడు మెచ్చుకొని తమ అభీష్టముల నెరవేర్చుచున్నాడని అవివేకమువల్ల తలచుచున్నారే గాని జ్ఞానదృష్టితో చర్చించిన జంతుహింసలవల్లనే తమ కనేక బాధలు సంభవించుచున్నవనియు అహింసాచరణవల్లనే సౌఖ్యములభించుచున్నదనియు స్పష్టముగ తెలిసికొనగలరు. మనసార చేసిన జంతుహింసలకు తగినశిక్ష ఏనాటికైన ననుభవింపకతప్పదు. సాధుజీవుల వుసురు వ్యర్థముగ పోదు. ఇహలోకములో పసులను బాధించి తమ అభీష్టముల నెరవేర్చుకొను వారిని దేశపాలకులు ఏ విధముగ దండించుచున్నారో అదేవిధముగ జంతుహింసలతో తమఅభీష్టముల నెరవేర్చుకొనువారిని ఇహపరములందు సర్వజీవరక్షకుడైన భగవంతుడు తప్పక శిక్షించు ననుమాట మరచిపోవద్దు. జీవబలికి దేవుడు సంతసించి అభీష్టము లొసగు నని ఏ శాస్త్రము బోధించలేదు. వ్యాఖ్యానకర్తలు ఏ భావములతో నుందురో ఆ భావమునకు అనుకూలమైన అర్థములు కల్పించి అవియే సరియైన అర్థములని శాస్త్రార్థములు బోధించుచుందురు.

వాదించువారి సమర్థతనుబట్టి శాస్త్రముల అర్థములు మారుచుండు నని జ్ఞాపకముంచుకోవలెను. అనేకమంది అనేక రకములుగ శాస్త్రార్థమును చెప్పుటకు గల హేతువును గమనించిన చాలు. తమ వాదనలను బలపరచుటకై శాస్త్రములను తారుమారుచేసి ఎవ రెన్ని అర్థములు చెప్పినను సాత్విక బోధలె యథార్థము లైనవని తెలుసుకోవలెను. సన్మార్గము నందు నడిపింపచేయుటకే శాస్త్రములు, శాసనములు, దేశాధిపతులు, పండితులు, సమాజములు, ప్రచారములు, ప్రబోధములు కావలెగాని దుష్టబుద్ధిని బోధించుటకు ఏవియు అక్కర లేదు. సహజముగ ప్రతివాని మనస్సు స్వార్థమునె ప్రేమించుచుండును. గాన ద్రోహచింతలు మాపుమాపి ఉపకారబుద్ధితో మెలగుటకే మానవజన్మ లభించినదని గుర్తించుకొనుడు. ఏ శాస్త్రమువల్ల జీవబలి నివ్వవచ్చు నని వచించుచున్నారో ఆ శాస్త్రముతోనె జీవబలినిచ్చుట మహాపాతక మని వాదించినట్టి మహాత్ము లున్నారు.

ఏ ఉద్దేశముతో జీవబలి కోరునట్టి శక్తులను మీరు కొల్చుచున్నారో అటువంటి ఉద్దేశముల నివ్వగల సాత్విక దేవత లెందరో ఉన్నారనియు, మీరు కోరునట్టి దేవతలను, శక్తులను మీకు స్వాధీనముచేయుగల సాత్వికపద్ధతు లనేకము కలవనియు, జీవబలి కోరునట్టి శక్తులనుగూడా సాత్వికపద్ధతులతో వాటి అనుగ్రహము పొందగల సాత్వికపూజ లనేకము కలవనియు శాస్త్రములు, మహాభక్తులు వాదించుచుండ వాటిని

జనాభా వృద్ధియగుటచేతను, పంటలు పండకపోవుటచేతను మానవపదార్థములకొరత కల్గుచున్నదని తలచుట అవివేకము. నావి మొదవ మోహింతసందు లేకుండ ప్రజ లున్నను ఘోరము ఈనిపద్ధతి నాచరించిన ఏ బాధలు రావు. ఈ పద్ధతిని విడిచివే యుటచేతనే మిాకు ఎన్ని సేద్యములు అమలుజరుగుచున్నను మిాకు అనుకొన్నంత ఫలము లభించుటలేదు.

(౨) ఏలాటి కష్టములు రాకుండ పారద్రోలుచు సమస్త కోర్కెలను శీఘ్రముగా నెరవేర్చగల కామధేనువులను సంపాదించినట్టి వసిష్ఠాదులను ఆదర్శముగ నుంచుకొని మిారు కూడ కామధేనువులను సంపాదించి ప్రజలకు కావలసిన సౌఖ్యములన్నిటిని సమకూర్చాలి. రణరంగాది ఉపద్రవము లెన్ని వచ్చుచున్నను కరవుకాటకము లెన్ని సంభవించుచు న్నను, దేశారిష్టము లెన్ని ఆవరించుచున్నను కలరాదిరోగము లెన్ని వ్యాపించుచున్నను ఏలాటి బాధలు పొందకుండ ఏ విధ మైన దిగులు లేకుండ సమస్తభోగము లనుభవించుచు హాయిగ సుఖించవలెనంటె పై పద్ధతితప్ప మరియొకమార్గము లేదు. ఈ పద్ధతిని ప్రయోగించుటచేతనే మిా అభీష్టములు ఫలియగుచు న్నవి.

(౩) ఎన్ని కష్టములు కలిగినను విరమించుకొనక సృష్టికి ప్రతిసృష్టి చేయగల శక్తి సాధించినట్టి విశ్వామిత్రుని మార్గదర్శముగా నుంచుకొని ప్రవర్తించినట్టివారినిమాత్రమే

మానవజన్మ వచ్చినందుకు తగినఫలము పొందినవారుగా ఎంచబడుదురు.

(4) దినమునకు 16॥ మణుగుల బంగారము నివ్వగల శ్యమంతకమణిని సంపాదించిన సత్రాజిత్తును నిదర్శనముగ నుంచుకొని వారివలె బంగారమును రత్నరాసులను సంపాదించి భూలోకములోని దరిద్రదేవతను భస్మముచేయాలి. మీ ధనాశను తీర్చగలమార్గము యిదితప్ప మరియొకటి లేదు. ఉన్నను తాత్కాలికముగ మీ ధనాశను తీర్చునవిగా కనుపించి తర్వాత కాలక్రమేణ ప్రజల దూషణకు విరోధములకు, కలహములకు, హత్యలకు మిమ్ములను ఒప్పగించునవిగ యున్నవి.

(5) నిశ్చలచిత్తముతో నారాయణమంత్రమును ధ్యానించుచు ఏడవరోజుకే నారాయణానుగ్రహము పొంది అప్రతిహతంబైన విద్యాధరాధిపత్యంబును, భాస్వద్రత్నదివ్యవిమానంబును బడసి అనేక లక్షల దివ్యసంవత్సరములు త్రిజగములందు సంచరించిన చిత్రకేతుం డనే రాజును ఆదర్శముగనుంచుకొని వర్తించిన మీ ఇష్టము వచ్చినంతకాలము కోరిన కోర్కెలు తీర్చుకొనుచు, కోరిన దేశములను చూచుచు, కోరిన రూపములతో సంచరించుచు సమస్త భోగములు పొందవచ్చును. మీ అభీష్టములు తీర్చుమార్గము ఇదితప్ప మరియొకటి లేదు.

(6) ఉపమన్యువు అనే మహాత్ముడొనర్చిన తపస్సు

భగవంతుడు ఆనందించి ఆయన కోర్కెను తీర్చుటకై వెన్నెల వాలసముద్రములను, పండ్లు ఫలాదుల నిచ్చే చెట్లను సృష్టించి నాడు.

(7) దముడు అనే రాజు తన రాజ్యములోని దేవాల యములందు దీపారాధనలను చేయించుచు దైవభ్యాసతో నుండుటచేతనే కాశీవిశ్వేశ్వరుడు సంతసించి ఆయనను కుబేరు నిగ చేసి ఉత్తరదిక్కుకు అధిపతిగ నియమించినాడు.

(8) పుష్పదంతుడు అనే రాజు యొక్క భక్తికి ఈశ్వ రుడు ప్రత్యక్షమై ప్రతిరోజు కైలాసమునకు వచ్చి తనను దర్శిం చుకొనునట్లు వర మిచ్చినాడు.

(9) జయధ్వజు డనే రాజు నిత్యము గాఢభక్తితో శ్రీహరిప్రతిమను షోడశోపచారములచే పూజించుచు శ్రీహరి నామమును ధ్యానించుచు జపించుచుండుటచేతనే శ్రీహరి దర్శనమిచ్చి 'ఓ భక్తశిఖామణీ! ఈజన్మమందు కొంతకాలము సుఖించి మరల గొప్ప చక్రవర్తివై పుట్టి ప్రజలచే పూజింపబ డుచు ఇట్లే ఏడు జన్మములెత్తి తుదకు మోక్షమును పొందు దువు. ఈ జన్మమందు లక్ష్మి నీయింట నుండును. దేవదానవు లైనను నిన్ను జయింపలేరు. ముల్లోకములు నీకు వశమగును. నీకు అడ్డు లే' దని వరము లిచ్చినాడు. ఈ రాజు పరశురా ముని ఓడించినాడు.

(10) కుంచమును శివలింగముగ భావించి దానిని

కొండగోగుతో పూజించి భగవదనుగ్రహము పొందినట్టి వైశ్య కులస్థుడైన బల్లేను వల్లయ్యను దాఖలాగా నుంచుకొని జీవ బలి నిచ్చెడుపద్ధతులను వేసి వేసి సాత్వికపూజలతో మీ ఇష్ట దేవతానుగ్రహము పొందాలి.

(11) ఒక్కొక్క గింజ ఏరితెచ్చిన సముపార్జిత ధాన్య మును 15 రోజుల కొకసారి అన్నముగా వండి, వచ్చిన అతిథు లకు పెట్టి మిగిలిన అన్నము తానును, పతీసుతులును దేహ యాత్ర నడుపుచు పక్షోపవాసవ్రతదీక్షవల్ల కుటుంబముతో శాశ్వతానందము నిచ్చునట్టి దివ్యలోకమునకు వెళ్ళినట్టి ముద్గ లు డనే మహాత్ముని మార్గదర్శముగా తీసుకొని మీ క్రూర కృత్యములను, మోసములను మాపుకోవాలి. తక్కిన మార్గ ములు మిమ్ములను నరకమునకే యీడ్చివేయును.

(12) ఎవరిని యాచింపక, కలిగినదానితో తృప్తి చెందు నట్టి దీక్షవల్లనే భగవంతునిలో ఐక్యమైన ఉంఛవృత్తి అనే భక్తుని ఆదర్శముగ నుంచుకొని ప్రవర్తించిన మీ జోలికి ఏ బాధలు రావు.

(13) సాత్వికపూజతోనే వరలక్ష్మీదేవికటాక్షము గడిం చి సమస్త సౌభాగ్యములు బడసినట్టి వరలక్ష్మీవ్రతములోని "చారుమతీదేవి"ని ఆదర్శముగ నుంచుకొని స్త్రీలు నడవనంత వరకు దరిద్రదేవత వెంట బడుచునేయుండును.

(14) ఇసుకను అన్నముగా వండినట్టి "అరుంధతీదేవి"ని

దాఖలాగా నుంచుకొని తమ పవిత్ర ప్రకాశము కాంతులు సంచరింపనంతవరకు తనప్రకాశములను ప్రకాశించుచునేయుం డును.

(15) మర్గాదేవికి సాత్త్వికాహారమునే ఆరగింపుచేయుచు దేవి అనుగ్రహమువల్ల పుత్రపౌత్రాది సంపదలు పొందినట్టి క్షత్రియములోని "సువేది"ని మార్గదర్శముగ నుంచుకొని అతనిలు మెలగనంతవరకు అష్టకష్టములను ఆవరించుచునేయుం డును.

(16) పంచపాండవులను బడసినట్టి 'కుంతీదేవి'ని దాఖలాగా నుంచుకొని, పడతులు వర్తింపనంతవరకు పేరుప్రతిష్ఠలు తెచ్చే సంతతిని పొందలేరు.

సాత్త్వికపూజలో జగదీశుని మెప్పించి తమ వాంఛలు పొందినట్టి మహాత్ములింక నెందరెందరో గలరు. సాత్త్వికపూజలో సంపాదించిన మహిమలవల్లనే తనమీద విరోధముగ నున్న రాజాధిరాజులను సైతము తమ కాళ్ళమీద పడునట్లు చేసి వారిచేత పూజింపబడునట్లును, తన ధనమును దొంగిలించుటకై వచ్చిన దొంగలుగూడ తమ తప్పులను తెలుసుకొని పరమభక్తులుగా మారినట్లును, రోగగ్రస్తులను నిమిషములో ఆరోగ్యవంతులనుగ చేసినట్లును చచ్చినవారిని క్షణములో బ్రతికించినట్లును అనేక మహాత్ములచరిత్రలు ఋజువుచేయుచున్నవి. ఈ దృష్టాంతములవల్లనె శత్రువులను మిత్రులుగను, రోగులను

ఆరోగ్యవంతులుగాను, విషమును అమృతముగాను, దుర్భిక్షమును సుభిక్షముగను. దరిద్రులను ధనవంతులగాను, మృతజీవులను అమృతజీవులుగాను మార్చగల శక్తి సాత్వికప్రాణులవల్లనె సాధ్యమగుచున్నదని సాక్షియగుచున్నది. జీవబలి యివ్వకుండనె అభీష్టములు పొందుటకు అనేక సాత్వికమార్గములు కలవని వాదించుచున్న శాస్త్రము లెన్నియో కలవు.

## సౌఖ్యము లభించే మార్గము

దేవతలయొక్క, దేవునియొక్క అనుగ్రహముతో నిమిత్తము లేకుండ హరిహరాదు లేకమై అడ్డువచ్చినను తన వాంఛలను నెరవేర్చుకొనగల మార్గ మిదిగో.

(1) పాతంజలయోగశాస్త్రములో 2వ సాధనపాదము 35వ సూత్రము జాగ్రత్స్వప్నములయందు సైతము మనోవాక్కాయములచే హింస చేయగూడదని తలంచియుండువాని (ఈగ, పేను, నల్లి, చీమ మొదలగు స్వల్పజంతువులను, క్రూరమృగములయిన పాములు, తేళ్లు మొదలగు విషజంతువులను, భీకరములైన శరభములు, సింహములు, ఏనుగులు, పులులు, అడవిపందులు మొదలగు మృగములను చంపకుండుటయు), సమీపమునందు స్వభావసిద్ధముగ ద్వేషముతో గూడి ప్రవర్తించు వైరివర్గము లగు గోవ్యాఘ్రములు, గజసింహములు మొదలగునవి తమతమ వైరములను విడిచి పరస్పరస్నేహభావముతో నుండును.

(2) సదా సత్యమును విడువక అభ్యాసము చేయువానికి (ఒకనికి సంభవించిన ఆపద తొలగి మేలు గలుగుటకై యాడిన కల్లమాటయును సత్యమే యగును). ఏవిధమైన సత్కార్యములు చేయకపోయినను సత్కార్యములు చేయువానికి ఏ ఫలము లభించునో ఆ ఫలము లెల్లను ప్రాప్తించును. వాని వచనమాత్రము చేతనె సత్కార్యములు చేయనివారికిగూడ పుణ్యఫలము లభింపచేయును. నిగ్రహానుగ్రహశక్తి కల్గును. 36 సూ.

నూరు నూతులు, నూరు బావులు, నూరు సత్క్రతువులు, నూర్గురు పుత్రులు, వెయ్యిఅశ్వమేధయాగములు, సర్వతీర్థములు, సర్వవేదములుకంటె ఒక సత్యవాక్యము శ్రేష్ఠమైనది. —ఆదిపర్వం 4 ఆశ్వా. 88

(3) దొంగతనము చేయకుండువానికి (ఎట్టి కష్టకాలమందైనను పరులసొమ్ము నపహరింప మనస్సున దలచక, అపహరింపుమని నోట చెప్పక, చేత ముట్టక యుండుట) సమస్తరత్నములు అప్రయత్నముగనె లభించును. 37 సూ.

(4) బ్రహ్మచర్యము అభ్యసించువానికి (ఋతుకాలములో మాత్రము స్వభార్యయందు ప్రవర్తించువాడుగూడ బ్రహ్మచారియే యగును). పూర్ణాయువు, బ్రహ్మతేజస్సు దేహ మనస్సులకు బలము. పరాక్రమము, అమానుషప్రజ్ఞ, ఆత్మజ్ఞానము కల్గును, 38 సూ.

(5) భోగసాధనవస్తువులను స్వీకరింపని అభ్యాసముగల

వానికి పూర్వజన్మమునందు తాను ఏ ప్రాణిగా నుండినదియు, ఏ పని చేసినదియు, ఏ ఫలము నొందినదియు మొదలగు విషయములు పూర్వజన్మజ్ఞానము కల్గును. 39 సూ.

(6) శుచిత్వమును అభ్యసించువారికి (బాహ్యపరిశుద్ధి అంతరపరిశుద్ధి అని రెండువిధములు. మన్ను నీళ్లు మొదలగు వానిచేత చేయబడునది బాహ్యపరిశుద్ధి యనబడును. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర దంభములు మొదలగు దుర్గుణములు విడనాడుట అంతరపరిశుద్ధ మనబడును). త్రిగుణముల వశతయును, వైరాగ్యమును, చిత్తైకాగ్రతయును, ఇంద్రియజయమును, ఆత్మదర్శనజ్ఞానమును కలుగును. 41 సూ.

నీటియందు పడిన నూనెచుక్క నీటియంతట ఎటుల కమ్ముకొనునో, అదేవిధముగ పాపాత్మునితోడ కలసి కూర్చుండుట, పయనించుట, మాట్లాడుట, భుజించుట వీనివలన పాపము లొకరినుండి ఒకరికి సంక్రమించును.

పరాశరస్మృతి 12 అధ్యా. 79 శ్లో.

సువాసన గల వస్తువులు చుట్టూ సువాసనయు, చెడు వాసన గల వస్తువులచుట్టూ చెడువాసనయు ఏవిధముగ వుండునో అదేవిధముగ ప్రతి మానవునిచుట్టూ వాని గుణములకు ననుసరించిన గాలి ఆవరించియుండి వాడు తాకునట్టి ప్రతి వస్తువుకు వాని స్వభావము కొంత కలియును. గాన దుష్టుల స్పర్శ పనికిరాదు.

(7) సర్వదా సంతోషముగ నుండువానికి (తనకు లభించిన ద్రవ్యముతోడనే తృప్తిబొందుట)సకలదుఃఖములు నివృత్తి యగును. నిరతిశయమైన ఆనందము కలుగును. 42 స్గా.

(8) నిజభర్తృశుశ్రూషయందు నిత్యాసక్త యయిన పతివ్రతకు అఖిల యజ్ఞదానతపఃఫలంబులు, దైవశక్తులు లభించును. అరణ్యపర్వం 5 ఆశ్వా.

(9) తల్లిదండ్రులసేవచేయువారికి దివ్యసుఖములు సిద్ధించును. 118.

అనసాపులు భూప్రదక్షిణము చేయుటచేతను, పదివేల మాలు కాశీక్షేత్రమునకు పోవుటచేతను, నూరుపర్యాయములు సేతుస్నానము చేయుటచేతను ఎంత పుణ్యముకల్గునో అంత పుణ్యము తన తల్లిదండ్రులకు ఒక్కసారి ప్రదక్షిణము చేసి భక్తితో సాష్టాంగసమస్కారములుచేసిన లభించును.

త్రిమూర్తులకైనను బుద్ధిచెప్పించి తన వాంఛలను నెరవేర్పగలిగినట్టి దీక్షలింక ననేకము గలవు. వీటిని ఆచరింపనివారు ప్రజల క్షేమమునకు భంగము నొనర్చుచున్నవారుగా ఎంచబడుదురు. వీటిని ఆచరించువారికిమాత్రమే యిహపరములందు సమస్త భోగములు కల్పింపబడి శ్రేష్ఠమైన జన్మలకు పంపబడుదురు. వీటిని ఉల్లంఘించి తమ యిష్టానుసారముగ వర్తించువారు ఉభయ లోకములందును అనేక అవస్థలు చెందుచు, తుచ్ఛమైన జన్మలను పొందుచుందురు. ఈ నియమము

(2) దశవిధముద్రలతో జర, మరణాదులను రద్దుచేసి, అణిమాద్యష్టయిశ్వర్యములతో సంచరించవచ్చును.

(3) దేహ్యానూర్ధ్వ కాయకల్పసిద్ధిరసాయన ఘుటికాది మూలికలతోగూడ జరమరణాదుల నరికట్టి సిద్ధులనుపొంద వచ్చును.

(4) మంత్రయోగము, లయయోగము, హఠయోగము, రాజయోగము మొదలగువాటితోగూడ అష్టసిద్ధుల గడింపవచ్చును.

మీ అభీష్టముల నెరవేర్చగలిగినట్టి యోగము లింక ననేకముగలవు. ఈ జన్మలోనే కోరిన కోర్కెలు తీర్చుకొని ఇహపరములందు భోగము లనుభవించుచు జన్మజన్మకు శ్రేష్ఠమైన జన్మలు పొందవలెనంటె పై పద్ధతులవల్ల సాధ్యముకావలసినదేగాని ఇంకొక మార్గములేదు. నేడు మీరొనర్చె విద్యాభివృద్ధి ప్రజలకేగాక నూటికి 90 మంది విద్యార్థులకే నష్టముకల్గించుచున్నది. నేటి విద్యలవల్ల ఎటువంటి నష్టములు కల్గుచున్నవి యావన్మందికి విశదమే.

(1) నూటికి నూరుమంది విద్యార్థులకు ప్రజలకు ఉపయోగపడే విద్యకావలెనంటె,

(2) ఈ జన్మలోనే కోరిన అభీష్టములు నెరవేర్చగల విద్యలు పొందవలెనంటె.

(3) మీరు కనిపెట్టిన ప్రయాణ సాధనలలో ప్రమాద

రహితములైనట్టివియు, ఏలాటి ఖర్చులేకుండ పోగలిగినట్టివియు, ఎవరి సాహాయము లేకుండ కోరిన దేశములను చూపకలిగినట్టివియు, కాలపరిమితిలేకుండ ఉపయోగపడగల సాధనము ఒకటిగూడలేదు. గాన ఏ ప్రమాదము రాకుండ, ఏలాటిఖర్చు లేకుండ, ఎవరిసాహాయము లేకుండ కోరిన దేశములను క్షణములో చూచిరావలెనంటె,

(4) కార్లు, రైళ్ళు, విమానములకొరకు కనిపెట్టుకొనియుండవలసిన పనిలేకుండ, కాని ఖర్చు కాకుండ, తలచుకొన్నప్పుడెల్లా తానున్నచోటనుండి కోరినదేశములను నిమిషములోచూచి యింటికిరావలెనంటె,

(5) పోస్టాఫీసుల, టెలిగ్రాం ఆఫీసుల చుట్టూ తిరుగవలసిన పనిలేకుండ, దమ్మిడి ఖర్చులేకుండ, తన ఇష్టము వచ్చినప్పుడెల్లా తానున్నచోటనుండి భూలోకమువారితోనైనను ఏ క్షణమున కాక్షణము సంభాషించి వారి యోగక్షేమములు తెలుసుకొనవలెనంటె,

(6) భూలోకములోని సభలేగాక బ్రహ్మ ఇంద్రాది లోకములలోని గాన, నృత్యాదులనుగూడ ప్రత్యక్షముగా చూచి ఆనందించవలెనంటె,

(7) రోగబాధలను, ఆకలిదప్పులను, అకాలమృత్యువును రూపుమాపి తన యిష్టమొచ్చినంతకాలము జీవించవలెనంటె.

(8) పాడిపంట లభివృద్ధితో, వ్యవసాయముతో, కాల

మానముతో, దేశపరిస్థితులతో అగత్యము లేకుండా సంసార సౌఖ్యమునకు కావలసిన సమస్త భోగములు అనుభవించవలె నంటే.

(9) పంచభూతముల కార్యక్రమము నరికట్టి తనయిష్టానుసారము పంచభూతములను నడపింపగల అధికారము సంపాదించవలెనంటే.

(10) సృష్టికిప్రతిసృష్టిచేయగలశక్తి సాధించవలెనంటే.

పై విద్యలవల్ల లభించవలసినదేగాని మరియొకమార్గము లేదు. ఉన్నను శ్రమకు తగిన ఫలము నివ్వక ఉన్న ధనమును క్షణములో ఖాళీచేయించి అల్పసౌఖ్యముల నిచ్చి తర్వాత అనేక బాధలు కల్పించునవిగా యున్నవి. పై విద్యలు ప్రవేశపెట్టిన దేశము బాగుపడవలసినదేగాని నేటి మీ విద్యాప్రణాళికలుగాని, నేడు మీరు మిక్కిలి శ్రద్ధవహించి అభివృద్ధిచేసే క్రీడారంగములోని స్కీములుగాని, అణువిజ్ఞాన పరిశోధనలవల్ల మీరు కనిపెట్టే సాధనలుగాని దేశక్షేమమును పారద్రోల రవ్వంతైన అక్కరకురావు. దేశక్షేమమునకు అక్కరకు వచ్చే ప్రణాళికలను మాత్రమే ప్రవేశపెట్టవలె నను ఉద్దేశము దేశాధిపతుల కున్న నేటి విద్యాప్రణాళికలను, క్రీడారంగములోని పోటీలను, మత్స్యపరిశ్రమాది స్కీములను రద్దుచేసి వాటిస్థానములో ప్రాణాయామాది యోగవిద్యలను ప్రవేశపెట్టి నేటి విద్యార్థులను, నిరుద్యోగులను, ప్రజలను తర్ఫీతుచేయుట దేశ

క్షేమమునకు అత్యవసరము. ఈ విద్యలలో ఒక్కడు ఉత్తీర్ణుడైనను దేశోపద్రవములను పారద్రోలగలడు. ఈ స్కీమును మీరు అమలుజరిపిననాడే దేశక్షేమమునకు తగిన యత్నములు చేయుచున్నారుగ నెంచబడుదురు. ఏ రోజుకైన ఈ విద్యలు నేర్చిన వ్యక్తులకే దేశారిష్టములను పారద్రోలగల అవకాశము కలదుగాని నేడు మీరు ప్రోత్సాహపరచే క్రీడాలోకములోని క్రీడావేత్తలకుగాని, అణువిజ్ఞానపరిశోధక వేత్తలకుగాని, విద్యాధికారులకుగాని, తదితర ప్రముఖాదికారులకుగాని ఏలాటి అవకాశ ముండదు. పై విద్యలను రోసి వేయుటచేతనే దేశము అధోగతికి పోవుచున్నది. విద్యాశాఖానిర్వహణకు ఎంత ధనమును ఖర్చుచేయుచున్నారో, క్రీడారంగమునకు ఎంత ద్రవ్యము వెచ్చించుచున్నారో, మత్స్యపరిశ్రమాదులకు ఎంత ధనము ఖర్చుచేయుచున్నారో అంత ధనముతోనే పై విద్యలను సాధింపవచ్చును. ఎంతకాలములోపల ఉన్నతవిద్యలందు ఉత్తీర్ణులగుచున్నారో అంతకాలములోపలనే పై విద్యలందు ఉత్తీర్ణులు కావచ్చును. క్రీడారంగములకు, రాజకీయవిద్యలకు, ఉద్యానములకు ఎంత పట్టుదల చూపుచున్నారో అంత పట్టుదలతోనే పై విద్యలను సాధింపవచ్చును. గాన పై విద్యలను ప్రవేశపెట్టి ప్రజలను తర్ఫీతుచేయ, దేశాధిపతులెల్లరు కృషిచేయుదురుగాత.

ధూపదీప నైవేద్యములతోగాని, దానధర్మములతోగాని అగత్యము లేకుండనే ఇహపరములందు ఏలాటి బాధలు పొంద

కుండ సమస్త దోషములను అనుభవించగలమార్గము ఇదుగో.

(1) గణపతిధ్యానముతో విఘ్నము లన్నిటిని క్షణ ములో పారద్రోలవచ్చును.

(2) లక్ష్మీస్తోత్రముతో దరిద్రదేవతను నష్టముచేయ వచ్చును.

(3) ఆదిత్యహృదయముతో సర్వగ్రహారిష్ట, గృహారిష్ట, రోగబాధలను ధ్వంసము చేయవచ్చును.

(4) హనుమధ్ధ్యానముతో శాకినీ, ఢాకినీ, బ్రహ్మరాక్షస, భూతప్రేతపిశాచాదులను క్షణములో మారణముచేయ వచ్చును.

(5) ఆపదోద్ధారకస్తోత్రముతో ఆపదలన్నిటిని నిమిష ములో హతముచేయవచ్చును.

(6) శ్రీరామ సహస్రనామస్తోత్రముతో బ్రహ్మపదవి పొందవచ్చును.

(7) శ్రీరామచంద్రాష్టకముతో కోటిజన్మములందు చేయబడిన పాపపురాసులన్నిటిని ఒక్క చిటికలో భస్మము చేయవచ్చును.

(8) గోపాలసహస్రనామస్తోత్రముతో కరువుకాటకము లను పారద్రోలవచ్చును.

(9) శ్రీకృష్ణద్వాదశనామస్తోత్రముతో వెయ్యి అశ్వ మేధయాగములకు, వెయ్యి చాంద్రాయణవ్రతములకు నూరు కన్యాదానములకుమించినఫలము నిమిషములోపొందవచ్చును.

(10) మృత్యుంజయ స్తోత్రముతో మృత్యు దేవతను భస్మము చేయవచ్చును.

(11) భగవద్గీతలో 9 అధ్యాయములు పారాయణ మొనర్చువారికి గోదానఫలమును, మూడవ భాగము చదువు వానికి గంగా స్నాన ఫలమును, ఆరవ భాగము చదువు వానికి సోమయాగ ఫలమును లభించును.

గీతయొక్క అధ్యాయములో నాల్గవ భాగమును పారాయణ చేయువాడు మన్వంతరమువరకు మనుష్యుడై పుట్టును.

గీతలో పది శ్లోకములుగాని, ఏడు, ఐదు, నాల్గు, మూడు, రెండు, ఒకటిగాని, సగము శ్లోకముగాని పారాయణము చేయువారు చంద్రలోకమునకు పోయి పదివేలయేండ్లు నివసింతురు.

(12) అధర్వశిఖోపనిషత్తును ఒకసార్యాయము పఠించిన త్రికరణములద్వారా సంభవించిన సమస్త పాపములు భస్మమగును.

(13) ఏ మంత్రంబైన సప్త వాసరంబులు పఠించిన దేవతలం గనుంగొను సామర్థ్యంబు గలుగును.

భాగవతం. 4 స్కం. 253.

మాతృకా ధ్యానము మొదలగువానితో గూడిన మంత్రమును పండ్రెండు సంవత్సరములు జపించువాడు అణిమాద్యష్ట సిద్ధులతో గూడిన జ్ఞానమును క్రమముగా పొందును. యోగతత్త్వోపనిషత్తు 21 శ్లో

తనకు ఇష్టమైన మంత్రమును జపించుటవలన తాను కోరిన దేవత ప్రత్యక్షమై తన ఇష్టార్థముల నొసంగును.

పాతంజలి. 44 సూత్రం.

(14) తపస్సు చేయుటవలన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములకు అద్భుత శక్తి కలుగును. అష్టసిద్ధులు ప్రాప్తించును. 43 సూ.

శివవిష్ణ్వాది దేవతలను, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులను పూజించుటయు, శరీరశుద్ధి మనశ్శుద్ధియు, సన్మార్గ ప్రవర్తనయు, బ్రహ్మచర్య వ్రతమును, జీవహింస చేయకుండుటయు, శరీరముచే చేయతగిన తపస్సని చెప్పబడును. దీనివల్ల కాయసిద్ధి కలుగును.

గీత 17 అధ్యా. 14 శ్లో.

ప్రాణులకు దుఃఖమును, భయమును కలుగచేయనదియును, సత్యమును, వినువారికి ప్రియమైనదియును, హితమైనదియునగు మాటలను వచించుటయు, వేదము, ఉపనిషత్తు భగవద్గ్రంథములు చదువుటయు, ప్రణవాది మంత్రము జపిం

యుటయు, వాక్కుచేత చేయతగిన తపస్సు; దీనివల్ల వాక్కు-
శుద్ధి కలుగును. 15

మనస్సునందు ఎటువంటి వికారమును పెట్టుకొనక యుండుటయును, సకల ప్రాణులకు ఎల్లప్పుడును మేలు కోరుటయు, ఎప్పుడు పరమాత్మను మననము చేయుటయును, చిత్తమును యితర విషయములనుండి స్వాధీనములో నుంచుటయును, మనస్సులో పవిత్ర భావన కలిగియుండుటయును, మనస్సుచేత చేయతగిన తపస్సని చెప్పబడును. దీనివల్ల మన
శుద్ధి కలుగును. 16

ఇహ పరములందు సమస్త సుఖములను యిప్పింపగల సాధనములు యింక ననేకములు గలవు.

విగ్రహారాధనతో అవసరము లేకుండగనే దైవశక్తులను పొందవచ్చును.

పూలపూజతో గూడ అష్టైశ్వర్యములను పొందగల మార్గమిదిగో—

గరికతో వినాయకుని పూజించిన, కుబేరునితో సమానులగుదురు.

ఉపనిషత్తు

(2) పౌర్ణమినాడు జిల్లేడు పూలతో శివారాధన మొనర్చిన దీర్ఘాయుష్మంతుడగును.

కార్తీకమహా 7 అధ్యా 21 శ్లో.

(3) మల్లెపూలతో మాధవు నర్చించిన చేసినపాపము లన్నియు నిర్గమించును. 14 శ్లో.

(4) మొగలిపూలతో విష్ణువు నర్చించిన వేయి జన్మములవరకు వేదవేదాంగ పారంగతుడగు బ్రాహ్మణుడై యుండును. 30 శ్లో.

(5) కమలములతో విష్ణువును పూజించిన అష్టైశ్వర్యములు పొందును. 2 శ్లో.

(6) అగసెపూల దండలతో విష్ణువు నలంకరించువాడు స్వర్గాధిపతియగును. 30 శ్లో.

(7) జాజిపూలతో శ్రీమన్నారాయణుని పూజించిన పునర్జన్మము కలుగదు. 3 శ్లో

(8) విష్ణువును బిల్వదళములతో నర్చించిన ముక్తి లభించును. 2 శ్లో.

(9) విష్ణుమూర్తిని తులసీ దళములతో పూజించిన చతుస్సముద్ర పర్యంతము నేలునట్టి ప్రభువగును. కోటిజన్మముల పర్యంతము ఐశ్వర్యము కలవారై విష్ణులోకము పొందుదురు. వైశాఖ పురాణం 4 అ 45.

(10) త్రిపుండ్ర ధారణవల్ల (విభూతి ధరించుటవల్ల) మహాపాతకములు మాయమగును. సమస్త తీర్థములందు స్నానమొనర్చినవాడగును. జాబాల్యుపనిషత్తు 23 శ్లో.

(6) శ్రేష్ఠమైన విద్యను దానమిచ్చిన సంపూర్ణాయుర్దాయమును పొందును.

(7) అన్నదాన మొసర్చువానికి కల్గు ఫలమును చెప్ప బ్రహ్మకైనను తరముగాదు. 2 అధ్యా 31 శ్లో.

(8) దానమిచ్చువాడు సర్వకాలములందు సుఖము కలవాడగును.

(9. పంచ యజ్ఞములవల్ల స్వర్గాది దివ్యలోకములు లభించును.

మీా అభీష్టము నెరవేర్చగలిగిన దానములింక ననేకములు గలవు—

దానము చేయనియెడల దరిద్రుడగును. దరిద్రము వలన పాపముచేయును. పాపమువల్ల నరకము పొందును. కాబట్టి సుఖమును కోరేవారు దినమును వ్యర్థముగ పోనివ్వకుండ ప్రతినిత్యము తన మేలుకొరకై దరిద్రుడుగాని, స్వతంత్రము లేనివాడుగాని, ఎవరైనను, ఎవనికి ఏవస్తువు లభ్యమగునో, ఆ వస్తువును యోగ్యులకువారికి దానమియ్యవలెను. దానము చేసినవారికి అడవియందైనను, కొండమీాదైనను సకల భోగములు ప్రాప్తించును. లక్షాధికారియగువాడు లక్షలకొలది దానము చేయవలసినదేకాని, ఏమి లేనివాడు తన శక్తికి తగినట్లు ఒక కాని యిచ్చినను చాలును. ఆ ఇద్దరును సమాన ఫలమే పొందుదురు.

శాంతిపర్వము 5 అశ్వా 492 రూాలు ప్రకారము ధర్మమార్గమున సంపాదించినట్టి వస్తువులు, ధనము, యోగ్య

లైనవారికి, దానధర్మము లొనర్చిన గొప్ప ఫలము లభించును. అధర్మ మార్గమున గడించిన వస్తువులు, ధనమును, దానమిచ్చిన కొంచెమైనను ఫలమురాదు. రాత్రికాలమునకు కావలసిన వస్తువులన్నిటిని పగటి కాలములోనే సంపాదించుకొనవలసినట్లున్ను, ముసలితనములో సుఖపడుటకు కావలసినట్టి ధనమును యవ్వనదశలో సంపాదించుకొనవలసియున్నట్లును, మృతిచెందినతర్వాత సుఖపడుటకు కావలసిన సమస్త వసతులను బ్రతికియున్నపుడే తన చేతిమీదుగా సంపాదించుకొనవలసియున్నది. పరదేశమునకు వెళ్లునపుడు సుఖమొందుటకై, ఇంటివద్దనుంచి ధనమును ఏవిధముగా తీసుకొని పోవుచున్నారో, ఆదేవిధముగ, పరలోకములో సౌఖ్యమొందుటకై, ఈలోకములోనే ధర్మము అనే ధనమును సంపాదించుకొనవలసియున్నది. చచ్చినవెనుక తాను సంపాదించినట్టి ధనధాన్యాది వస్తువులన్నియు యింటిలోనే యుండును. బంధువులు, మిత్రులు, శ్మశానము వరకే వచ్చెదరు. తానుచేసుకొన్న పుణ్యపాపములు మాత్రము తనవెంటవచ్చి, తనకు కష్టసుఖముల నిప్పించుచున్నది. గాన సుఖము పొందదలచువారెల్లా సన్మార్గమున వర్తించవలెను.

(1) తనకు యెంత ధనమున్నను "హంతకులనుండి మహాగజీవులను రక్షించుటకై" అర్పించినట్టి ధనముమాత్రమే తనవెంటవచ్చి, తనకు రాబోవు జన్మలో తన గండములను పారద్రోలుటకు ఆధారపడుచున్నది.

(2) ఎంత భూమియున్నను "దిక్కులేని జంతువులను పోషించుటకై" సమర్పించినట్టి భూదానము మాత్రమే తన వెంటవచ్చి, తనకు సామ్రాజ్య పదవి నిప్పింప అండగా నిలుచున్నది.

(3) ఎంత ధాన్యమున్నను "అన్నార్తులను ఆదరించి పరచనట్టి" అన్నదానము మాత్రమే తనతో వచ్చి, తనకు సమస్త భోగములు కల్పించ శిఫార్సు చేయుచున్నది.

(4) వస్త్రవ్యాపారము తానెంత అభివృద్ధి గావించుచున్నను, "వస్త్రహీనులకు నొసంగినట్టి వస్త్రదానము మాత్రమే తన వెనువెంటవచ్చి, తనకు సుఖము లిప్పింప ఎదురుకొనుచున్నది.

(5) ఔషధముల వ్యాపారము తానెంత విరివిగా వ్యాపింపచేయుచున్నను, "జంతు రోగనివారణకు ధారపోసినట్టి ఔషధ దానముమాత్రమే" తనవెంబడివచ్చి, తన వ్యాధులను భస్మమొనర్చ కాచుకొని తిరుగుచున్నది.

(6) తానెంత బలవంతుడైనను "జంతుహింస నివారణకై ఉపయోగించినట్టి బలముమాత్రమే" తనవెంటవచ్చి, తన బాధలను రూపుమాప అడ్డుపడుచున్నది.

(7) తాను చేసే కృషిగాని తాను సంపాదించే వస్తువులుగాని, "ఉపకారమునకు, ఉపయోగపడినవిమాత్రమే" తన శ్రేయోభివృద్ధికి హేతువగుచున్నవి. తక్కినవన్నియు, తన అధర్మ మార్గమును వెల్లడిచేయుటకు, సాక్షులుగా మారుచున్నవి.

అవకాశము లభించియు, అవకాశము తగినన్నిగా, దానధర్మము లొనర్పనివారు 'నాకీ జన్మలో తనకు ఎటువంటి హీనజన్మము వచ్చినను, ఎటువంటి అవస్థలు సంభవించినను. ఇష్టమేనని' అంగీకరించినవారిగా నిర్ణయింపబడెదరు. పరాశర స్మృతిలో 2 అ. 21వ శ్లో. లోని తీర్పు ప్రకారము పండిన ధాన్యములో 21 వంతున్ను, భాగవతములో 8 స్కంధము 568 సూలు ప్రకారము తన యింటగల సర్వధనములో మూడవ భాగమున్ను, దానధర్మములకు వినియోగించినప్పుడే సరియైన శక్తికి తగిన ధర్మముగా నెంచబడును. పరాశర స్మృతి 1 అ 29 శ్లో. లోని శిక్షను ప్రకారము యోగ్యుడగువాని నెరింగి వాని యింటికిబోయి దానమొనర్చుట ఉత్తమ దానము తన యింటికి పిలిపించి యిచ్చుట మధ్యమదానము, తన్ను యాచించినవానికొసంగుట అధమదానమగును. యోగ్యునైనవానికి దానమిచ్చిన సమస్త దేవతలు ఆనందించెదరు. భాగవతములో 8 స్కం. 652 తీర్పు ప్రకారము చుట్టాలు దొంగలుగ. సుతులు బాణస్థులుగ. కాంతలు సంసార కారణములుగ. మృత్యువుగ, పరులు కార్యార్థులుగ, కింకరులుగ నేచున్నారు. బ్రతికినన్నాళ్లు పోషించుచున్నను, స్నేహముతో పరోపకారట్టి బంధుజాలములు ఆధారమునకే తిప్పలుపడుచు, 'మీరు ఏ లోకమున కేగినను, ఏ జన్మ ఎత్తినను, ఎలాటి కష్టము రాకుండ మీ సౌఖ్యమునకై పోట్లాడి, మీకు సమస్త భోగముల నిప్పింపగల ఆత్మబంధువులను' త్రోసివేయుచున్నారు.

ఆత్మ బంధువుల సంబంధమును త్రెంచివేయుట చేతనే మీకు అనేక అవస్థలు సంభవించుచున్నవి. నేడు మీరు అనుభవించే సౌఖ్యమాత్రయు, ఆత్మ బంధువు లొనర్చుచున్న సాహాయమే. ఆత్మ బంధువుల సాహాయము లేనిది ఏనాటికి మీరు సౌఖ్య మనుభవింపలేరు. బాధలనుండి బయటపడదలుచువారు ఆత్మబంధువులను నిత్యము పరిచయము చేసుకొనవలెను. తల్లి అనగా సత్యమనియు, తండ్రి జ్ఞానము, సోదరుడు ధర్మము. మిత్రుడు దయ, భార్య శాంతి, కొడుకు ఓరిమి, యీ ఆరుగురు ఆత్మ బంధువులనియు, వీరితో సంబంధమున్నవారికే సుఖములు ప్రాప్తింపగలవని పేరు. చెప్పినట్లై నీతి శాస్త్రము యొక్క తీర్మానమును మీరు పాటింపనంతవరకు కష్టములు మీ వెంటబడుచునేయుండును. శాంతిపర్వము 2 అశ్వా. 408 రూలు ప్రకారము అర్థసిద్ధికంటె ధర్మసిద్ధివలన, సకల సిద్ధులు లభించును. 4 అశ్వా. 76 తీర్పు ప్రకారము ధనమునకై, అధర్మముగా నడచువారికి దుర్గతి కలుగును. 5 అశ్వా 489 తీర్మానము ప్రకారము ఏ జాతివారైనను, ఏమరుపాటు లేకుండా, సత్ప్రవర్తనతో వర్తించవలెను. మానవ జీవితమునకు ముఖ్యముగ కావలసినది సత్ప్రవర్తన. సత్ప్రవర్తన లేనివారు దానధర్మములెన్ని చేసినను, దేవతాపూజ లెన్ని సల్పినను, వరము లెన్ని గడించినను, వ్యర్థము లగుచున్నవి. ఇందుకు నిదర్శనము బలి చక్రవర్తి, బాణాసురాదులే. దేవతా పూజల, దాన ధర్మముల మాట తలచకపోయినను, సత్ప్రవర్తన కలవానికి, బ్రహ్మాది దేవతలందరు లోబడియుందురు.

ఒకనియొక్క గుణాగుణములను కనిపెట్టవలెనంటె, సతడు చేసిన పునకార్యములను బట్టి నిర్ణయింపరాదు. అతని గుణాగుణములను, అతడు ప్రతినిత్యము చేయునట్టి వ్యాపనములను బట్టి నిర్ణయింపవలెను. మానవుడు ఆహారమును భుజించునపుడు దానిని పరిశీలించుకొను విధంబునసె, తన నడవడి సరుమార్గమువలె నున్నదా, సత్పురుషుల చరిత్రవలెనున్నదా యని ప్రతినిత్యము విచారించుకొనవలయును. ధనము వచ్చుచుండును, పోవుచుండును. ధనము లేకపోవుటచేతనే, మానవుడు హీనుడు కాజాలడు. ధనముండుటచేతనే మానవుడు పూజ్యుడు కానేరడు. సత్ప్రవర్తన లేనివాడే హీనుడగును. సుశీలము గలవాడే పూజ్యుడగును. మానవులకు పూజావమానములు ధనమునుబట్టి కలుగవు. ప్రవర్తననుబట్టి వచ్చును. ధనము చేత సంపాదింపబడునట్టి ధర్మము, అధర్మమని చెప్పబడును. సత్ప్రవర్తనతో సంపాదింపబడినట్టి ధర్మమునుమాత్రమే సధర్మమని తీర్మానించబడినది. గాన మానవజన్మతో నున్న వానికి సన్మార్గము ముఖ్యము.

17 లక్షల, 28 వేల సంవత్సరములవరకు అకాల మరణములు, రోగములు, అతివృష్టి, అనావృష్టి, శీతోష్ణాదులు మొదలగు బాధలు రాకుండ ఆపివేసి, ఇష్టమొచ్చినప్పుడెల్లా సమస్త లోకములందు, కోరిన రూపములతో విహరించుచు, జీవితాల పరిమాణ నిర్ణయము లేకుండా, ఇష్టమువచ్చినంత కాలము జీవించుచు, ధర్మరక్షణ మొనర్ప దేశాధిపతులు లేకుండనే, ఎవరికివారే సృష్టి స్థితి లయ కర్తలుగా మెల

గుచు, ఎవరి ధర్మమువారు నడుపుకొనుచు, అష్టసిద్ధులను స్వేచ్ఛగా సంచరించుచు, పిల్లలు మొదలు పెద్దలవరకు సమస్త భోగములు అనుభవించినట్టి, కృతయుగములోని ప్రజలను మార్గదర్శముగనుంచుకొని, మీరు ప్రవర్తింపనంతవరకు 'బాధలు ననుభవించుటకే మీరు జీవించుచున్నట్లుగా' భావించవలెను. మీ వాంఛలు తీర్చుకొను అనేక సాత్విక మార్గములుండ వాటినివదలి 'సహింపవలెను, ఏబాధలు లేకుండ సుఖముగా జీవించవలెనను ఆశలేనట్టి "మూగజీవులను బలియిచ్చుట" క్రూరకృత్యమే యగును. బాధలనుండి విముక్తిగాదలచువారెల్లా, జంతుహింసలు, జీవబలి, పశుయాగములు, మాంసభక్షణ, వర్జించాలి. సుమాత్రపు దీక్ష పూననివారు 'సుఖము లక్కర లేదని బాధలు తెచ్చుకొనుటకే జీవించుచున్నవారగుదురని భగవానుడు బోధింప అచ్చటి వారందరు తమ శాసనము ప్రకారము వర్తించెదమని" శపథము లొనర్చిరి. భగవానుని శాసనములను దేశాధిపతితన రాజ్యమంతట తీవ్రముగ అమలుజరిపెను.—



శ్రీరస్తు    శుభమస్తు    అవిఘ్నమస్తు

ఓం శ్రీ రామాయనమః    ఓం శ్రీ బుద్ధదేవాయనమః

# ఆరవ అధ్యాయము.

శ్రీ బుద్ధభగవానుడు అహింసా సూత్రములను బోధించుటకై మరియొక దేశమునకు బయలుదేరెను. ఆ రాష్ట్రాధిపతి యువరాజునకు వివాహమహోత్సవ మొనర్చుచున్నాడను వార్త విని నేరుగ ఆ పట్టణమునకు వెళ్ళెను. ఆపట్నపు శోభ ఎలాగున్నదన, వీధులందు చల్లిన అత్తరువాసనలు పరదేశములకుగూడ వ్యాపించి 'తమ యువరాజుగారి వివాహ మహోత్సవములుజూడ రండని' పిల్చుచుండెను. బజార్లకు కట్టిన రత్నాల తోరణపుకాంతులు అన్ని దిశలకు వెళ్ళి 'మా ప్రభువు వారి వైభవము తిలకింప అవకాశమిదిగో రండని' హెచ్చరించుచుండెను.

నగరమంతట వట్టి వేళ్ళతో, పట్టు వస్త్రములతో, పందిళ్ళు వేసిరి. రకరకాల మూగ జీవులను నొకచోట వుంచిరి. ఇట్టి దృశ్యములను భగవానుడు చూచి, ఈ అలంకారములకు, మూగజీవులను కట్టివేయుటకు, కారణమేమని అచ్చటివారిని అడిగెను. సాక్షాత్తు శివునివలె వెలిగిపోవుచున్న భగవానుని పోలికచూచి దండములుపెట్టుచు, మా యువ రాజుగారి కళ్యాణమగుటచే ఈ విధముగ నలంకరింపబడినదనియు, కూరలకై ఈ మూగజీవులు తెప్పింపబడినవనియు,

తమవంటివారిని మా రాజుగారు మిక్కిలి గౌరవిస్తారనియు చెప్పుచుండ, కొందరువెళ్లి యోగి రాకను తమ ప్రభువునకు చెప్పిరి. రాజుగారు వెంటనే మేళతాళములతో, బంధుమిత్రా మలతో యోగివద్దకు వచ్చి, భక్తితో షోడశోపచార పూజ లొనర్చి, 'తమ పాదధూళిచే మేము ధన్యులమైతిమి. నా పుత్రుని వైవాహికమునకు తమరు పిలిచినట్లు వచ్చినారు. కోటలోకివచ్చి మమ్ము తరింపజేయుడు స్వామి' యని అనేక విధముల తన్ను ప్రార్థించుచున్న పుడమి రేని చూచి భగవా నుడు చెప్పిన దేమన "ఓధరణీశా! నీభక్తిశ్రద్ధలకు మెచ్చినాను. లేదనకుండ కోరినవారికి కోరినదానము లొసంగుచున్నావు. కాదనకుండ అన్నదాన మొసగుచున్నావు. నీకు సాటివచ్చు వారు లేరని చెప్పవచ్చు. నీ పుత్రుని పెండ్లి రమ్యముగ చేయు చున్నావు. నీధర్మబుద్ధి పురవాసులు చెప్పగావిన్నాను. నేనొక స్వల్ప దానముగోరి నీకడకు వచ్చితిని. కాదనకుండ నాఅల్ప దాన మొసగగలవని నమ్ముచున్నా"నని భగవానుడు వచింప, ఓ మహాత్మా! నేను తమ సేవకుడను. ఈ సర్వరాజ్యము తమదైయుండ నన్ను అడుగవలసిన పని యేమున్నది. తమ యిష్టమువచ్చినంత కాలము తమ యిష్టానుసారము ఈరాజ్య మునవుండి, తమరే పాలిస్తూ తమ కోర్కెలు తీర్చుకోవల సినదని భూపతి చెప్పగా భగవానుడు చిరునవ్వు నవ్వి సన్యా సికి రాజ్యాధికార మెందుకు? నే కోరిన దానమిచ్చిన రాజ్య మిచ్చినట్లే. నేకోరిన దానము చెప్పెద వినుమోయిరాజా? పుత్రుని పెండ్లని పురమెల్లను రమ్యముగ చేసితివి. సుతుని

మైన జన్మలు పొందుటకు మానవజన్మకుమాత్రమే అధికారము కలదని" బోధించు జ్ఞాన బోధలను వినగలరు. ఎట్లన—

(1) శ్రేయోభిలాషులారా! సుకృతము చేసిన మహానుభావులు నివసించుచున్న దివ్య సౌధములె నక్షత్రమండలములుగ విరాజిల్లుచున్నవనియు, వానివలెనె ప్రకాశించుటకు "మీకు అభిలాష కలదేని సుకృతము చేసుకొనుడని" తారామండలము హెచ్చరించుచున్నట్లుగా తెలుసుకొనవచ్చును.

(2) ఓ అగ్రజులారా! మీరు నిత్యము జీవరాసులన్నిటికి మీ శక్తికొలది ఉపకారము లొనర్చుటయందె ప్రవర్తించుడు. ఏమాత్రము అపకారము లొనర్చవద్దు. పాపకృత్య మేమాత్ర మొనర్చినను, మావంటి నీచ జన్మములె మీకు లభించును. మమ్ములను చూచి అయిన మీరు బుద్ధి తెచ్చుకొని, శ్రేష్ఠమైన జన్మలు సంపాదించుకొనుటకే తిప్పలుపడుమని'' క్రిమి కీటకాదులు దాఖలాలు చూపుచున్నట్లు వీక్షించగలరు.

(3) దుష్టులను శిక్షించుటకె భగవంతుడనేక అవతారము లెత్తుచున్నట్లు గ్రహించగలరు.

(4) నా యిష్టమనుచు చేసిన దుష్టకృత్య ఫలమనుభవించుటకె కుంటి గ్రుడ్డి జన్మములు కలుగుచున్నవి.

(5) పౌరుషముతో గావించిన క్రూరకృత్యముల ఫలమనుభవించుటకె వ్యాధులు వెంటబడి వేధించుచున్నవి.

(6) ఆలకించువారు లేరని సాగించిన దౌర్జన్య ఫల మనుభవించుటకే రాత్రింబగళ్ళు కష్టపడి చాకిరి చేయుచున్నను కూడుగుడ్డలు లేక నానా అవస్థలు సంభవించుచున్నవి.

(7) అడ్డువచ్చువారు లేరని చూపిన దుర్మార్గ ఫల మనుభవించుటకే ఉపద్రవములు వెంటబడుచున్నవి.

(8) పట్టుబట్టిచేసిన అపరాధఫల మనుభవించుటకే లక్షాధికారులు భిక్షాధికారులుగ తయారగుచున్నారు.

(9) చేసుకొన్న పాపముకొద్ది అనేక లనేక బాధలు పడుచున్నారు.

(10) ఏనాటికైన అక్కరకు రాకపోవునాయని చేసిన ఉపకారము అండగా వుంచుటచేతనే, భిక్షాధికారు లక్షాధికారులుగ మారుచున్నారు.

(11) రాబోవు జన్మలోనైన తప్పక సుఖములొందవలెనని, తెంపుతో చేసిన దాన ఫలమునకే భాగ్యవంతుల, జమీందారుల, సంస్థానాధిపతుల, చక్రవర్తుల, మహాచక్రవర్తుల జన్మలు లభించుచున్నవి.

(12) దమ్మిడి ఆదా లేకపోయినను, ఋణము కిరికి లేకుండా, కాలమంతయు. పూజా పునస్కారములందే గడిపిన ఫలమునకే ప్రజలచే కొందరు పూజింపబడుచున్నారు.

(13) ఎప్పటికైన వ్యర్థముగ పోదని చూపిన ధర్మబుద్ధికే కొద్దిగొప్ప ఉద్యోగములు లభించుచున్నవి.

(14) సుకృత ఫలము అడ్డువచ్చుటచేతనే, బాధలు పారిపోవుచున్నవి.

(15) తాముచేసిన పుణ్యముకొద్ది అనేకమంది అనేక భోగములనుభవించుచున్నారు.

బాధలబడువారిని చూచి, ఏనాడు పాపముచేసినాడో, ఇప్పు డనుభవించుచున్నాడనియు, భోగము లనుభవించువారిని చూచి, పుణ్యమేమి చేసినాడో, ఇప్పుడు మహాదశ ననుభవించుచున్నాడనియు, చెప్పుకొనుచు, వినియు, చూచియు, ప్రత్యక్షముగ ననుభవించుచుండియు, పడే అగచాట్లు చాలక క్రొత్త బాధలకై తీవ్రమైన పోటీచేయుచున్నారేగాని, శ్రేష్ఠమైన జన్మలకై పోటీచేయుట అగౌరవముగ భావించుచున్నారు. ఇటువంటి ఘనులకు ఎన్నియుగములకైన ఉత్తమ జన్మ లభించుట కల్ల. దుష్టకృత్యములకు తగిన ప్రాయశ్చిత్తము ఏనాటికైన అనుభవించుట ఖాయము.

గృహకృత్యములందు, వ్యవసాయపుపనులందు, నడచునపుడు, తప్పించుకొనుటకు ఎంతప్రయత్నించినను వీలుగాక, సూక్ష్మ జీవరాసులెన్నో చచ్చుటకు కారకులగుచున్నాము. ఈ పాపము చాలక తప్పించుకొనుటకు వీలుండియు, రక్షింప నవకాశముండియు, పాపమనక, మనస్ఫూర్తిగా చేతులార అనేక పాపకృత్యము లొనర్పబడుచున్నవి. ఎవన—

(1) తృప్తిబొందింప నలవికానట్టి జిహ్వారుచికాసించి, క్షణ సౌఖ్యమునకై ఉపకార జీవులైన పశుపక్షి మృగాదుల

నెన్నిటినో చేతులార చంపుచు, చంపించుచు, తృప్తిదీర పాటిని భక్షించుచు, మనసార కావలెనని మహాపాతకము గడించుచున్నారు.

(2) ధనాశకై మానవులపాలిటి కామధేనువులైన పశు పక్షి మృగాదులను శ్రద్ధగ పోషించుచు బలిసిన తరువాత కొన్నిటిని, అక్కరగడిపిన తర్వాత కొన్నిటిని, కసాయివారికి అప్పగించుచు సంపూర్ణ స్వేచ్ఛతో నాయిష్టమనుచు, అడ్డు లేకుండ, అభేద్యమైన, అంతులేని పాపరాశిని పోగుచేసుకొని యావజ్జీవ నీచ జన్మాంతరవాస శిక్షలకు పాటుబడుచున్నారు.

(3) నిలుకడలేని దేహమును నిలుపవలెనను భ్రాంతితో మ్రొక్కుబడులనుచు, ఇలవేల్పులైన ప్రాణరక్షకులగు మూగజీవుల నెన్నిటినో, క్షుద్ర దేవతలకు బలినొసంగి, తరుణము మించిపోకుండ, శక్తికొలది ప్రభుదలతో మూగజీవుల ఉసురు పోగుచేసికొనుటయందే తీవ్రమైన కసరత్తు చేయుచు న్నారు.

(4) 88 రకములైన వాతరోగములకు, 82 రకము లైన పైత్యరోగములకు, 224 రకములైన శ్లేష్మ రోగము లకు, 386 రకములైన మిశ్రమ రోగములకు, నిలయమైన ఈ దేహమును ఆరోగ్యమొందించవలెనను భ్రమతో, పట్టు దల పూని, యెన్నియో సాధు జీవులను కూనీ చేయించు చున్నారు.

(5) ఎంత మోజుతో పోషించుచున్నను, మనుక్షణ మునకౌ దుర్బలమగునట్టి ఈ శరీరమునకు, బలము చేకూర్చ

వలెనను ఆకలితో నరకబాధములకు జీవులను అపరిచితమైన ఉల్లాసముతో నరికించుచున్నారు.

ఇంత మక్కువతో, ఇంత శ్రద్ధతో పోషించిన ఈ దేహమును చివరకు కాటికి అప్పగించుచున్నారు. కాటి పాలగు ఈ కాయమును స్థాయమని నమ్మి, విపరీత వాదనలు చేయుచు, నీమతము పూని, ఎదురు లేదని గర్వించుచు, నా యిష్టమని, మొండి పట్టుదలతో, ఎన్నియో ఘోరకృత్యములనొనరించుచు కులుకుచున్నారు. చివరకు యమదూతలు వచ్చి, గుంజుకుపోయి యమలోకమున బాధించుచున్నపుడు వ్యాధులాక్రమించి సమ్మెట దెబ్బలవలె బాధలు పెట్టుచున్న వేళను, 'అయ్యో దేవుడా! ఈ బాధలు పడలేనని' అతి ఘోరముగ ఏడ్చుచు, రక్షించుటకై ప్రతి క్షణము ఎదురు చూచుచున్నారు. ప్రాణమున్నంతరకు జీవులను వేధించుట యందే కాలముగడిపినవారు తగిన ప్రాయశ్చిత్తము ననుభవింపక తప్పునా? తన ఆకలి తనని పీడించుచున్నదిగాని ఇతరులను పీడించదు. తనకాలు తెగిన తనకు బాధకలుగును గాని పరులను బాధించదు. అదే విధముగ ఎవరుచేసిన పాపములకు వారు తగిన బాధలు పొందక తప్పదు. దప్పిగొనినప్పుడు జలమునకై నూతిని త్రవ్వుట ఎట్లో, అదేవిధముగ దుష్ట కృత్యములకు తగిన బాధలు ననుభవించు వేళ పుణ్యములు చేయకపోతినే యని, ఎంత మొత్తుకొన్నను ప్రయోజనము లేదు. భూమిలో ఏ బీజములు నాటెదమో ఆ బీజముల ఫలములనే పొందుచున్నాము. అదేవిధముగ మనస్సనే భూమిలో

దుష్ట కృత్యములనే బీజములు నాటిన, బాధలనే ఫలములు పొందుట ఖాయము. ఉపకారములనే బీజములు నాటిన సౌఖ్యములనే ఫలములు అనుభవించుట ధ్రువము. మానవుడు ప్రతినిముషము త్రికరణములద్వారా చేయుచున్న పనులవల్ల పాప పుణ్యములనే విత్తనాలు మనస్సనే భూమిలో నాటబడి, కష్ట సుఖములనే ఫలములను పొందుచున్నాము. లోగడ సంవత్సరములో పండించిన ధాన్యమును ఈసంవత్సరము తినుచున్నాము. ఈసంవత్సరములో పండించినధాన్యమును రాబోవు సం.రములో ఉపయోగించుచున్నాము. అదేవిధముగ క్రిందటి జన్మలో చేసిన పాపపుణ్యములకు తగిన కష్టసుఖములు ఈ జన్మలో ననుభవించుచున్నారు. ఈజన్మలోచేయు దుష్కృత సుకృతములకు, తగిన ఫలము రాబోవు జన్మలో ననుభవించ గలరు. వ్యాధులనుండి, బాధలనుండి, తప్పించుకొని ప్రతి జన్మలో [illegible]లోకములను సద్భోగములుఅనుభవింపగల హక్కును పొందవలెనను కోర్కెయున్న త్రికరణశుద్ధిగావర్తించ వలెననిసకల శాస్త్రములువాదించుచున్నవి. త్రికరణశుద్ధిఅనగా—

(1) మనస్సుచేత చేయబడిన పుణ్యకర్మ సవిశేష నిర్విశేష చింతయు. భక్తి జ్ఞాన వైరాగ్యచింతయు, పరోపకారము మొదలయినవి మనస్సు యందుం డుట, మనస్సు చేత జేయబడిన పుణ్యకర్మమనబడును. 2. సర్వదా విషయచింతయు, పరులకు ద్రోహము చేయ గోరుటయు, పరలోకము లేదనుటయు, యీా మొదలగునవి మనస్సుచేత చేయబడిన పాపకర్మమనబడును. 3. నిర్వికల్ప,

సవికల్ప, సమాధులు మొదలయినవానియందు విషయ చింతయు, సద్బ్రహ్మచింతయు, మొదలైనవి మనస్సుచేత చేయబడిన మిశ్రమకర్మ యనబడును.

(2) వాక్కుచేత చేయబడిన పుణ్యకర్మ, వేదశాస్త్ర గీతానామ సహస్ర పఠనంబును. గాయత్ర్యాది మంత్ర జపంబును చేయుట వాక్కుచేత చేయబడు పుణ్యకర్మ మ బడును 2. పెద్దలను దూషించుట, అసత్యములు పలుకుట, మొదలగునవి వాక్కుచేత చేయబడిన పాపకర్మ యనబడును. 3. వేదాధ్యయన ఉపాసనను, ప్రమాణములు మొదలగునవి చేయుట వాక్కుచేత చేయబడు మిశ్రమకర్మ యనబడును.

(3) పుణ్యతీర్థ స్నానంబును, గురుదేవతా నమస్కారంబును, బ్రహ్మచర్యము మొదలయినవి శరీరముచే చేయబడు పుణ్యకర్మ యనబడును. 2. పరులను పీడించుటయు, పరస్త్రీసంగమము, పరధన హరణము, మొదలగునవి శరీరముచే జేయబడు పాపకర్మ యనబడును. 3. పరులను బాధించి, వారల ద్రవ్యంబు తీసుకొని, దేవాలయములు, మొదలైన వాటికి ఖర్చుపెట్టుట శరీరముచే చేయబడు మిశ్రమకర్మ యనబడును. ఎల్లప్పుడు మనస్సుచేత, వాక్కుచేత, శరీరముచేత దుష్కృత్యములను వర్జించుటయే త్రికరణశుద్ధి యనబడును.

ఛీ! గర్భ నరకము నాకెందుకు? జనన మరణములఅవస్థ పడలేను. శాశ్వతానందమె కావలయునని, పట్టుదల గలదేని, అహింసా వ్రతము నవలంభించుటయే గతియని నాల్గు వేదములు ఏకమై తీర్పు చెప్పుచున్నవి. అహింసా వ్రతమనగ

సమస్త జీవులను తనవలె చూచుట లేక జీవరాసు లన్నిటిని భగవంతుని స్వరూపముగ భావించుట.

సుఖపడవలెనను బుద్ధికలవారెల్లా ఈరెండు మార్గము లలో తనకు నచ్చిన మార్గము నాచరించవలెను. కాదని మీ యిష్టప్రకారము సంచరించితిరా అధోగతికి పోవుట ఖాయము. మొట్టమొదట మనము క్రిమికీటకాది జన్మలెత్తి యెత్తి చిట్టచివరకు పాపపుణ్య విచక్షతను తెలుసుకొనగల జ్ఞానము కలిగినట్టి మనుష్య జన్మకు వచ్చినాము. జంతువుల కన్న, దేవతలకన్న మానవజన్మ శ్రేష్ఠమైనది. మానవ జన్మలో నొనరించిన గొప్ప పుణ్యములకు తగిన భోగములు ననుభవించుటకు మాత్రమే దేవతాజన్మ సిద్ధించుచున్నది. సుకృతము లొనర్చుటకుగాని, మోక్ష మొందుటకుగాని, దేవతలకు అధికారము లేదు పుణ్యములకు తగిన భోగముల ననుభవించిన వెంటనే దేవతా జన్మలోనుంచి మానవ జన్మకు త్రోయబడుదురు. నర జన్మలో చేసిన పాపకృత్యములకు తగిన బాధలు పొందుటకే క్రిమికీటకాది జన్మలు కలుగు చున్నవి. దుష్ట కృత్యములకు తగినబాధలు అనుభవించిన వెంటనే నీచ జన్మలనుండి విడువబడి మానవజన్మకు వచ్చు చున్నవి. నరజన్మలో గావించెడు పాప పుణ్యముల ఫలము ననుభవించుటకే అనేక జన్మలు ఉత్పత్తియగుచున్నవి. నర జన్మలో చేసే పనులవల్లనే ఏ జన్మ ఎత్తవలసినది, ఏశిక్షల ననుభవించవలసినది నిర్ణయించబడుచుండును. మానవజన్మకు మాత్రమే సంపూర్ణమైన అధికారము, స్వేచ్ఛ ఇవ్వబడినవి

ఈ జన్మకే ఘనమైన చక్కని వసతులు ఏర్పాటు చేయబడి నవి. మంచి తరుణముగల జన్మ నరజన్మగా. ఆలసించిన ఆశాభంగము కలుగుటయేగాక, అనేక అవస్థలు సంభవించును. త్వరపడుడు. ఇట్టి అవకాశము, స్వేచ్ఛ, సౌఖ్యము మానవేతర జన్మలకు లేదు. సకల జన్మలందును మానవ జన్మమే శ్రేష్ఠమయినది. సార్థకమైనది. కడసారిది. ఈదేహము శాశ్వతముకాదు. కబళింపవలెనని మృత్యువు, నానా బాధలు పెట్టవలెనని వ్యాధులును నొకదానికంటె నొకటి ముందుగ, పైబడవలెనని నిమిషనిమిషమునకు కాచుకొనితిరుగు చున్నవి. నేడోమాపో చచ్చుట సిద్ధము. గాన ఏరోజుకారోజు పట్టుదలకొలది, శక్తికొలది, ఆశదీర, కరువుదీర, కాంక్షదీర, తృప్తిదీర పరిపూర్ణ స్వేచ్ఛతో, నిరాటంకముగ అడ్డులేకుండ నిర్భయముగ యిష్టమువచ్చినట్లు పాపపుణ్యపు రాసులతో మీకు నచ్చిన రాసిని పందెముతో ప్రోగుచేసుకొనవచ్చును. ఇందుకు అడ్డేమియు లేదు.గాని, క్రూరకృత్యములకు తగినశిక్షగా మరల పశువులై పుట్టకుండ, మనుష్య జన్మగాని, దేవతాజన్మ గాని, జన్మరాహిత్యముగాని, పొందుటకు తగిన కృషి జేయుటే మనుష్యజన్మ యెత్తినందుకు తగినఫలము.

ఉత్తమజన్మ కోరువారెల్ల మాంసభక్షణ వర్జించి, తన చేతులార ఏ జీవిని చంపక, చంపించక దీక్ష వహించవలెనని ధర్మశాస్త్రములు నిర్ణయించినవి. యీ మాత్రపుయత్నము చేయుటకుగూడ నిరాకరించువారుమానవ జన్మ వ్యర్థపుచ్చుటయేగాక శ్రేష్ఠమైనజన్మలు అక్కరలేదని,

చున్న నాడే", నాటిఋణమునుండి విముక్తిపొంద యత్నించు చున్నవారగుదురు. మీ పోషణలోనున్న వాటిని 'మీవలె చూడనంతవరకు' వాటి యుసురు ఏనాటికైనను మీరు అనుభవింపక తప్పదు. ఏలన—

(1) ఏ వాంఛకై సత్కార్యము లొనర్చుచుంటివో,
(2) ఏ ధ్యాసకై దాన ధర్మము లొనర్చుచుంటివో,
(3) ఏ ఉద్దేశముతో ఉపకారము లొనర్చుచుంటివో,
(4) ఏ అభీష్టముతో గుళ్ళు, గోపురములు కట్టించుచుంటివో,
(5) ఏ ఫలమునకై షోడశ మహాదానము లొనర్చుచుంటివో,
(6) ఏ తలంపుతో తీర్థయాత్రలు సేవించుచుంటివో,
(7) ఏ కోర్కెతో భగవదారాధన మొనర్చుచుంటివో,

అట్టి ఫలితముల నివ్వగల భగవంతుడు మూగజీవుల హృదయములలోగూడ నివసించుచున్నాడు. అటువంటి భగవంతుని స్వరూపములైన పశు పక్షి మృగాదులను బాధించువారు, చంపువారు, చంపించువారు ఘనకార్యము లెన్ని చేసినను వ్యర్థములగుటయేగాక భగవంతుని అవమాన పరచుచున్నట్లగును. భగవంతుని పరిపాలనలోని అష్టప్రకారము శిక్షార్హు లగుదురు.

(1) ఏ అపరాధము చేసినారని, భగవంతుడు వికలాంగులను సృష్టించుచున్నాడో.

(2) ఏ ఉపకారమొనర్చినారని, లోకరక్షకుడు సౌందర్యవంతులను సృజించుచున్నాడో.

(3) ఏ దుర్మార్గ మొనర్చినారని, సర్వేశ్వరుడు ఆరోగ్యవంతులను రోగగ్రస్థులగునట్లు శాసించుచున్నాడో.

(4) ఏ సుకృతము చేసినారని, జగద్రక్షకుడు వ్యాధిగ్రస్థులను ఆరోగ్యవంతులౌనట్లు అమలు జరుపుచున్నాడో.

(5) ఏ దోషము గావించినారని, జగదీశుడు, ధనవంతులను, దరిద్రులౌనట్లు ఆజ్ఞాపించుచున్నాడో, అటువంటి ఫలితముల ననుభవింప జేయగల భగవంతుడు సర్వజీవసౌఖ్యమునకై తాను నియమించిన శాసనముప్రకారము నిరపరాధములైన మూగ జీవులను బాధించునట్టి, కోతకోయునట్టి, వధించునట్టి, హత్యచేయునట్టి, మాంస భక్షణ చేయునట్టి మానవులను శిక్షించుటకు సిద్ధముగ నున్నాడని తెలుసుకొనుడు.

అహింసా సూత్రము ఇహపరములందు జీవులు అనుభవించే బాధలకు మూలహేతువులను మునిశ్రేష్ఠులు తమ తపోమహిమవల్ల తెలుసుకొని, బాధలనుభవించేవారిని ఉద్ధరించుటకై 'ఆత్మవత్సర్వ భూతాని' యను అమృత సూత్రమును వెల్లడి చేసినారు. ఇహ పరములందు సుఖముల నాశించువారెల్ల తీవ్రమైన పట్టుదలతో అహింసా సూత్రమును అను

చున్నాడే", నాటిబుణమునుండి విముక్తిపొంద యత్నించు చున్నవారగుదురు. మీ పోషణలోనున్న వాటిని 'మీవలె చూడనంతవరకు' వాటి యుసురు ఏనాటికైనను మీరు అనుభవింపక తప్పదు. ఏలః —

(1) ఏ వాంఛకై సత్కార్యము లొనర్చుచుంటివో,
(2) ఏ ధ్యాసకై దాన ధర్మము లొనర్చుచుంటివో,
(3) ఏ ఉద్దేశముతో ఉపకారము లొనర్చుచుంటివో,
(4) ఏ అభీష్టముతో గుళ్ళు, గోపురములు కట్టించు చుంటివో,
(5) ఏ ఫలమునకై షోడశ మహాదానము లొనర్చు చుంటివో,
(6) ఏ తలంపుతో తీర్థయాత్రలు సేవించుచుంటివో,
(7) ఏ కోర్కెతో భ గ వ దా రా ధ న మొనర్చు చుంటివో,

అట్టి ఫలితముల నివ్వగల భగవంతుడు మూగజీవుల హృదయములలో గూడ నివసించుచున్నాడు. అటువంటి భగవంతుని స్వరూపములైన పశు పక్షి మృగాదులను బాధించువారు, చంపువారు, చంపించువారు ఘనకార్యము లెన్ని చేసినను వ్యర్థములగుటయేగాక భగవంతుని అవమాన పరచుచున్నట్లగును. భగవంతుని పరిపాలనలోని ఆజ్ఞప్రకారము శిక్షార్హు లగుదురు.

(1) ఏ అపరాధము చేసినారని, భగవంతుడు వికలాంగులను సృష్టించుచున్నాడో.

(2) ఏ ఉపకార మొనర్చినారని, లోక రక్షకుడు సౌందర్యవంతులను సృజించుచున్నాడో.

(3) ఏ దుర్మార్గ మొనర్చినారని, సర్వేశ్వరుడు ఆరోగ్యవంతులను రోగగ్రస్థులగునట్లు శాసించుచున్నాడో.

(4) ఏ సుకృతము చేసినారని, జగద్రక్షకుడు వ్యాధిగ్రస్థులను ఆరోగ్యవంతులౌనట్లు అమలు జరుపుచున్నాడో.

(5) ఏ దోషము గావించినారని, జగదీశుడు, ధనవంతులను, దరిద్రులౌనట్లు ఆజ్ఞాపించుచున్నాడో, అటువంటి ఫలితముల ననుభవింప జేయగల భగవంతుడు సర్వజీవసౌఖ్యమునకై తాను నియమించిన శాసనము ప్రకారము నిరపరాధములైన మూగ జీవులను బాధించునట్టి, కోతకోచ్చునట్టి, వధించునట్టి, హత్యచేయునట్టి, మాంస భక్షణ చేయునట్టి మానవులను శిక్షించుటకు సిద్ధముగ నున్నాడని తెలిసుకొనుడు.

అహింసా సూత్రము ఇహపరములందు జీవులు అనుభవించే బాధలకు మూలహేతువులను మునిశ్రేష్ఠులు తమ తపోమహిమవల్ల తెలుసుకొని, బాధలనుభవించేవారిని ఉద్ధరించుటకై 'ఆత్మవత్సర్వ భూతాని' యను అమృత సూత్రమును వెల్లడి చేసినారు. ఇహ పరములందు సుఖముల నాశించువారెల్ల తీవ్రమైన పట్టుదలతో అహింసా సూత్రమును అను

ష్ఠించాలి. ఈసూత్రముతో మెలగనంతవరకు బాధలు అనుభ
వింపక తప్పదు.

(1) ఆత్మవత్సర్వ భూతాని యను సూత్రమును నను
ష్ఠించువారు సూత్రమే మోక్షమునకు అర్హులని వేదాంతము
తీర్పు చెప్పినది.

(2) సకల జీవులను తనవలె వీక్షించువారినిసూత్రమే
జ్ఞానులని జ్ఞానయోగము తీర్మానించినది.

(3) సకల జీవులను భగవత్స్వరూపముగ భావించు
వారినే ఉత్తమ భక్తులని భక్తియోగము నిర్ణయించినది.

(4) ఏజీవికి అపకార మొనర్పని వారినే మానవులని
ఖ్యాతిగాంచిన మతస్థాపకులెల్లరు ప్రచార మొనర్చినారు.

(5) ఏజీవిని బాధింపనివారే కరుణాత్ములని సకల
శాస్త్రములు వాదించినవి.

(6) అహింసా పరమో ధర్మమని వర్తించువారికి
ఏబాధలు రావని శిష్టాస్మృతు లన్నియు ఏకమై చాటు
చున్నవి.

(7) ఆత్మవత్సర్వ భూతాని యను సూత్రమును
తెలుసుకొనుటకె జప, తప, ధ్యాన, దాన ధర్మాదులు నియ
మించినారు.

(8) పరోపకారార్థ శరీరమను సూత్రమును తెలియ
జేయుటకె తీర్థయాత్రలు నెలకొల్పినారు.

(9) జప ధ్యాన పూజాదులవల్ల అభీష్టములు నెరవేరగలవని ఏ శాస్త్రము ఖాయముగ చెప్పలేదుగాని. అహింసవల్ల కోరిన కోర్కెలన్నిటిని వెంటనే పొందవచ్చునని శాస్త్రములన్నియు ఏకమై ఖాయపరచినవి.

(10) తపస్సువల్ల భగవదనుగ్రహము పొందవచ్చునని ఏ వేదముగూడ రూఢిగ చెప్పలేదుగాని. అహింసవల్ల వెంటనే భగవదనుగ్రహము పొందవచ్చునని నాల్గువేదములు ఏకమై, రూఢిపరచినవి.

(11) షోడశ మహా దానములవల్ల ఉత్తమజన్మలు పొందవచ్చునని ఏ పురాణము ఖచ్చితముగ బోధించలేదుగాని, అహింసవల్ల ఉత్తమ జన్మలు పొందవచ్చునని, పురాణములన్నియు ఏకమై ఖచ్చితముగ బోధించినవి.

శాశ్వత భోగముల నివ్వగల అధికారము ఒక్క అహింసా వ్రతమునకేగాని, తక్కిన వ్రతములకు రవ్వంతైన అధికారము లేదు. ఇతర వ్రతము లెన్నియున్నను తాత్కాలిక సుఖములు చూపి, తర్వాత ఎన్నియో బంధముల కల్పించుచు, జనన మరణపు రాసులను వృద్ధిచేయు స్వభావము కలవై యున్నవి. గాన శాశ్వత సౌఖ్యములు గోరువారికెల్ల అ హిం సా వ్ర త మె దిక్కని తెలుసుకొనుడు. అహింసా పరమోధర్మమునుగూర్చి శాస్త్రములు ఏవిధముగ చాటుచున్నవో ఆలకించుడు.

(1) అహింసతో వర్తించుటే ధర్మరహస్య మనబడును.

53 అనుశాసనికం 5 అశ్వా.

(2) అహింస యనునది సకల భూతములను తల్లి వలెను, తండ్రివలెను కాపాడుచుండును.

భారతం అనుశాసనీకం 116అధ్యా.

(3) అహింసయే శ్రేష్ఠమైన యజ్ఞము, అహింసయే శ్రేష్ఠమైన దమనము, అహింసయే సర్వోత్తమమైన జ్ఞానము, అహింసయే సర్వోత్తమమైన దేవతార్చనము.

(4) అహింస యనునది సర్వోత్తమమైన ధర్మము. అహింస యనునది సర్వోత్తమమైన తపస్సు. అహింసయే సర్వోత్తమమైన జ్ఞానము. అహింసయే శ్రేష్ఠమైన యథార్థ తత్వము.

(5) సర్వ వేదములను చదువుట, సర్వ తీర్థముల యందును స్నానము చేయుట, సర్వ యజ్ఞములు చేయుట, సర్వదానములు చేయుట, అనునవి యన్నియును అహింసకు సమానమైనవి కావు.

(6) ఏనుగుయొక్క పాదమునందు, సకల జంతువుల పాదములు ఇముడునట్లు, అహింస యనెడు ధర్మమునందు సకల ధర్మములు ఇమిడియున్నవి.

(7) ప్రాణ దానముకంటె సువర్ణ దానము, గోదానము, భూదానము అనునవి అనేకరెట్లు తక్కువ.

(8) ఏ జంతువును హింసింపనివారు రూపము, ఐశ్వర్యము, ఆరోగ్యము, అధ్యయనము, స్వర్గము పొందుదురు.

(9) ఏ మానవులు స్థావర, జంగమాత్మకములయిన సకలభూతములను తనవలె కాపాడుదురో, వారు సర్వోత్తమమైన దివ్యలోకమును పొందుదురు.

(10) సర్వజీవులను తనవలె చూచువారికి మాత్రమే నమస్కార మొనర్చవలెను. శాంతిపర్వం 5 అశ్వా. 482.

(11) దానములలోపల అభయ దానమును, ధర్మములలోపల అహింసయు, ఉత్తమములైనవి.

మాఘమహాత్మ్యం 26 అధ్యా.

(12) దేహికర్మంబు లాచరించి, కర్మబద్ధుండయి, కర్మానుకూలమైన దేహంబు దాల్చుచుండును. 7స్కం.241

(13) శరీర సంబంధములగు (క్రియా) దోషములచే, చెట్లు, కొండ మొదలగు స్థావర జన్మలను, వాగ్దోషముచే పశు పక్షి మృగ జన్మలును, మానసిక దోషముచే అంత్యజాతుల జన్మలును కలుగును. మనుస్మృతి 12 అధ్యా. 9శ్లో.

(14) ధర్మమును విడిచిపెట్టి, అర్థమును కోరువాడు, బంగారపురాశిని విడిచిపెట్టి, దుమ్మురాశిని కోరినట్లుండును.

భారతం.

(15) అర్థముచేత సంపాదించునట్టి ధర్మము అధర్మమని చెప్పబడును.

(16) ద్రవ్యముకొరకు ఎన్ని ప్రయత్నములు చేయుచున్నారో, అన్ని ప్రయత్నములును, ధర్మముకొరకు చేసిన యెడల, దుఃఖములు పొందరు.

(17) జీవహింస చేయువాడు అధికమైన దుఃఖమును పొందును. జీవ దానముకంటె అధికమైన దానము లేదు.

(18) హింసను చేయకపోవుటయే భగవంతుని ఆరాధించుట యగును.

(19) దారిద్ర్యము, రోగము, దుఃఖము, బంధనము, వ్యసనము, అనునవి తన అపరాధమనే వృక్షమునకు ఫలములగుచున్నవి.

ఇంక అనేక ధర్మ శాస్త్రములలో ననేకతీర్పులు చెప్పబడినవి. రోగ నివారణకై వైద్య సలహాలు ఎంత పట్టుదలతో నాదరించుచున్నారో, 2. ఆరోగ్యమునకై ఆరోగ్య సూత్రముల నేవిధముగ పాటించుచున్నారో, 3. ప్రజా క్షేమము నకై రాజకీయ నిబంధనలకు ఎట్లు లొంగిపోవుచున్నారో, అదేవిధముగ ఇహపర సుఖములు కోరువారెల్లా, అహింసా ధర్మముతో వర్తించుట ముఖ్య కర్తవ్యమై యున్నది. మీ ఇష్టమొచ్చినట్లు సంచరించితిరా వైద్య సలహాలు, ఆరోగ్య సూత్రములు, రాజకీయ నిబంధనలను ధిక్కరించినవారికి పట్టిన గతియే పట్టును. దివ్య జ్ఞానము, దివ్యదృష్టి, గడించిన మహాత్ములు ఇహపరములందు జీవులుపడే బాధనుచూచి, వారుపడే బాధలకు మూలకారణములను తెలుసుకొని బాధలనుభవించే మనుజుల ఉద్ధరించుటకై అహింసా ధర్మమును బోధించినారు. గాన తీవ్రమైన పట్టుదలతో జీవహింసనుండి తప్పించుకొనుటకు యత్నించవలెగాని, లోకువగా నున్నవని, అడ్డులేదని ఏవైపువాళ్ళు ఆవైపున తలపడి ఎవరికి ఇష్టమొచ్చి

(4) కసాయి వృత్తి కులాచారముగ వచ్చుచున్నను, ధర్మమార్గము కాదనియు, కష్టసుఖములు తెలిసినట్టి మానవు లొనర్చవలసిన పని కాదనియు, బోధించుటకే తన వంశా చారమైన కసాయి వృత్తిం వర్జించినట్టి సౌకరిక పుత్రుడగు సులసుడనే బోయకులస్థుని దాఖలాగా నుంచుకొని, కులా చారముగ వచ్చుచున్న మీ కసాయి వృత్తులను వెంటనే త్రోసి వేయాలి.

(5) మూగ జీవులలోని వైరములనుగూడ బాపి, వాటిని సఖ్యముతో మెలగునట్లు చేయుట పెద్దలకు విద్యుక్త ధర్మమని హెచ్చరించుటకై కణ్వ మహాముని తన ఆశ్రమము నకు చుట్టు ప్రక్కలగల విష క్రూర సాధు జీవులనుగూడ వాటికిగల స్వభావసిద్ధమైన శతృత్వమును విడనాడి, మైత్రితో కలసి మెలసి ఆడుకొనునట్లు చేసినాడు. గాన మూగజీవుల యెడ దౌర్జన్యము, పౌరుషము, బల పరాక్రమములు, క్రూర బుద్ధులు చూపుట మానాలి.

(6) తన పోషణలో నున్నట్టి మూగ జీవులనుగూడ మోక్షమిప్పించుట ముఖ్య ధర్మమని నిదర్శనము చూపుటకే, సులక్షణ దేవి మేకకుగూడ మోక్ష మిప్పించినది. గాన మీ పోషణలోనున్నట్టి పశుజాతిని హంతకులకునివ్వక పోషించాలి.

(7) భారతములోని గౌతమీ మృత్యు చరిత్రలోని గౌతమస్త్రీని ఆదర్శముగా నుంచుకొని, పాములను. తేళ్ళను, మొదలగు విష జంతువులనుగూడ, చంపరాదు.

(8) మూగ జీవులను బాధించువారినిగూడ ఉపేక్షింప రాదని బోధించుటకే ఆ శ్రీరామచంద్రమూర్తి కుక్కను కొట్టినవానిని శిక్షించినాడు. గనుక మూగజీవులను బాధించు నట్టి స్వభావమును మానవజాతి మానాలి.

(9) తమను ఆశ్రయించిన మూగ జీవులనుగూడ రక్షించుట మానవ జాతికి ముఖ్య ధర్మమని చాటుటకే, శిబి చక్రవర్తి తన శరీరమును డేగకు ఆహారముగనిచ్చి, పావుర మును రక్షించినాడు. గాన మీ రక్షణలో నున్నట్టి మూగ జీవులను కోతకు పంపకుండ పోషించాలి.

(10) మూగ జీవులజోలికి పోయినవారిని తప్పక శిక్షించవలెనని రూఢిపరచుటకే, సంవర్త మహాముని తన అయిదుగురు పుత్రులు వనమునకేగి, లేడిపిల్లలను చంకపెట్టు కొని వచ్చుచుండ, అవి చచ్చిపోవుట చూచి, వాటిచర్మము లను కప్పుకొని, వాటివలెనే మీరుకూడ వనములో సంచ రించుడని ఆజ్ఞాపించినాడు. గనుక ఈధర్మపు తీర్పునే మీరు గూడ ప్రవేశ పెట్టాలి.

(11) తన పితరులకు మాంసముతో భోజనము పెట్టు నట్టి పద్ధతిని తీసివేసి, సాత్త్విక పద్ధతితో వర్తించినట్టి ఖనిత్రు డనే రాజును ఆదర్శముగనుంచుకొని, ప్రజలందరు ఈనిమి షమునుంచే, పరలోకమందున్న తమ పెద్దలకు మాంసపు భోజనము పెట్టునట్టి ఆచారమును తీసివేయాలి.

(12) తమ స్వాధీనములోనున్న జలాశయములలోని మత్స్యములనుగూడా రక్షించకున్న పాపము సంక్రమించు

ననియు, వాటిని కాపాడవలసిన బాధ్యత జలాశయాధిపతుల కందరికి కలదనియు, సముద్రులైనవారు మూగజీవులను రక్షింపకున్న, దోషము సంభవించునని హెచ్చరించుటకే 'తాను స్వెట్టి మకరగుంటిని చాపలను పట్టుకొనువారు హంతులయ్యెదరని' సౌబరి మహాముని శాసించినాడు. గాన పార్టీ నాయకులందరు తమ ప్రథమ కర్తవ్యముని గ్రహించాలి, గవర్నమెంటువారు మత్స్యాది పరిశ్రమలను స్థాపించు పద్ధతి మానివేసి, చేపలను పట్టునట్టి పద్ధతిని నిషేధించాలి. జిల్లాబోర్డు, పంచాతీబోర్డు మొదలగువారు తమ స్వాధీనములోనున్న జలాశయములలోని చేపలను వేలంవేయు పద్ధతిని తీసివేసి, వాటిని ఎవరు పట్టకుండా కాపాడాలి. ప్రజలు మత్స్య భక్షణ మానాలి.

(13) ఏ మహాత్ముని జ్ఞాపకార్థము మన దేశమునకు భారత దేశమని పేరువచ్చినదో, అటువంటి మహాత్ముడు గూడ మూగ జీవులను పోషించుటయందె కాలము గడిపినాడు. గనుక మీ పోషణలోనున్నట్టి మూగ జీవులనైన కోతకు అప్పగించక వాటిని పోషించాలి. జంతురక్షణకై తమ ప్రాణము లర్పించిన మహాత్ములింక నెందరోగలరు.

జంతురక్షణలో ఆచరించనలసిన పద్ధతులనుగూర్చి మహాత్ములు బోధించినట్టి హితోపదేశము లివిగో శ్రద్ధగా ఆలకించుడు.—

(1) అహింసతో వర్తించుట సన్మార్గమనియు, హింసతో ప్రవర్తించుట దుర్మార్గమనియు చెప్పబడును.

అశ్వమేధం 2 అ. 157

(2) దయ, హింసలేకుండుట, సమదర్శనము, ప్రాణులందు దేవతాబుద్ధియు, మొదలగు గుణములతో, సకల జాతులవారును వర్తించవలెను. భాగవతం 7 స్కం. 408

(3) సమస్త జీవులయెడ ద్రోహభావము విడచి, త్రికరణ శుద్ధితో, మెలగుటయే శీల సత్ప్రవర్తన మనబడును.

శాంతిపర్వం 3 అ. 147

(4) అసుర భావము విడిచి, సర్వభూతములను, దయా సుహృద్భావములతో చూచువారినే, భగవంతుడు ప్రేమించును. 7 స్కం. 217

(5) జపము, ఇంద్రియ నిగ్రహము, అహింస, గురుపూజ, నిత్యానుష్ఠానము, తపము ఈ ఆరును సన్మార్గములనబడును. వీటిలో ఏ మార్గము అహింసతో గూడియుండునో, దానిని పవిత్రమైనదానిగ నెంచవలెను.

అనుశాసనికం 4 అశ్వా. 279

(6) ఈ దేహము జంతువులయొక్క ఉపకారముకొరకు ఉపయోగింపనియెడల ఈ శరీరమును సంరక్షణచేయుట వ్యర్థము. భారతము

(7) ఏ మానవుడు పరుల ప్రాణములను తన ప్రాణముచేత కాపాడునో, అట్టి మానవుడు పునరావృత్తి రహితమైన స్థానమును పొందును.

(8) పోవునప్పుడు, నిలిచినప్పుడు, మేల్కొనియున్నప్పుడును, ఏ మానవునియొక్క వ్యాపారము సకల భూతములకును మేలుకలుగజేయుటయందు ఉపయోగింపడో, అట్టివాడే పశువనబడును.

(9) సకల జంతువుల ప్రాణరక్షణకై రాత్రిగాని, పగలుగాని, ఎల్లప్పుడును తన శరీరమునకు కష్టము కలిగినను, భూమిని చూచుచు నడువవలెను.

మనుస్మృతి 5 అధ్యా. 68 శ్లో.

(10) ఎవ్వడు ప్రాణులను కట్టుటచేతను, కొట్టుటచేతను, నగుక్లేశములను చేయగోరడో, ఆతడు అత్యంత సౌఖ్యమనుభవించును, 46

(11) ఎవ్వడు ఒరులను ఉపద్రవపెట్టని జంతువులను, తన సుఖము నిమిత్తమై హింసించునో, వాడు జీవించియుండియు, మృతి నొందినవాడే. అత డుండియు, చచ్చియు, నెచ్చటను బాగుపడడు. 45

(12) దయలేనివాడు కోటి సంవత్సరములు బ్రతికియుండ, గంగ మొదలగు పుణ్యతీర్థములలో స్నానము చేసియు, పరిశుద్ధుడు కానేరడు.

మాఘమహాత్యం 21 అధ్యా. 19 శ్లో.

(13) ఎవడు ప్రాణులను హింసింపడో, వాడు ఎల్ల పుణ్యతీర్థములయందును దీక్షవహించినవాడును అగును.

32 అధ్యా. 18 శ్లో.

(14) నాలుగు సముద్రములవరకు గల భూమిని దానముచేసిన ఏ పుణ్యము కల్గునో, సంపూర్ణ దక్షిణలుకల యజ్ఞము లన్నిటిని చేసిన ఏసుకృతము వచ్చునో, సర్వ తీర్థములందు స్నానమొనర్చిన ఏ ఫలము లభించునో, నాలుగు వేదముల పఠించుటవలన ఏ పుణ్యము కల్గునో, అట్టిపుణ్యము లన్నియు 'చంపబడుచున్న జంతువులను రక్షించుటవలన కలిగెడు పుణ్యముతో" పదునారవ భాగమునకుగూడ సమము కాదు. భారతం.

(15) చంపబడుచున్న జంతువులను చూచి, శక్తుడగు నాడు ఎవ్వడు ఉపేక్షించునో, అట్టివాడు మిగుల భయంకర మైన నరకమును పొందును.

(16) రాళ్ళు, కొండలు, ఒక తెలివిగూడ లేనివి యగును. 2. చెట్లు చేమలు, మొదలగు రసమును తెలియు నట్టివి, ఒక తెలివిగల ప్రాణులనబడును. 3. చిప్పలు. శంఖములు, మత్స్యములు మొదలగు జలచరములు నడయాడ గలిగినవి, రెండుతెలువులుగల ప్రాణులనబడును. 4. చెదలు, చీమలు మొదలగు ప్రాకెడు జంతువులు, గంధమును తెలియు నట్టివి, మూడు తెలువులుగల ప్రాణులు. 5. పశువులు, పక్షులు, భ్రమరములు మొదలగునవి రూపమును తెలియు నట్టివి, నాల్గు తెలువులుగలవి. 6. మనుష్యులు, మొదలగు వారు శబ్ద,స్పర్శ,రూప, రస, గంధముల నెరిగినట్టివి, అయిదు

తెలువులుగల ప్రాణులనబడును. వీటిలో ఒక తెలివిగల ప్రాణులనుతప్ప, తక్కిన ప్రాణులను హింసచేయరాదు

త్రివర్గదీపిక.

(17) బొట్టనవ్రేలంత లావుగలిగి, బాహుమాత్ర ప్రమాణమయి, ఆకులుగలిగి, పచ్చిగాఉండు కఱ్ఱ, దండ మనంబడును. దీనికి వ్యతిరేకముగ నుండువాటితో పశువులను కొట్టిన, ప్రాయశ్చిత్తము చేసుకోవలెను.

పరాశరస్మృతి 9 అధ్యా. 10 శ్లో.

(18) గోవును తల్లిగాను, వృషభమును తండ్రిగాను, చూడవలెను. అనుశాసనీకం 5 అశ్వా 41.

(19) కోడెల వృషణముల కొట్టిన వారు నపుంసకు లయ్యెదరు. 105

(20) ఆకలిగొన్నట్టియు, దప్పిచెందినట్టియు, అలసి పోయినట్టియు, కుంటియైనట్టియు, రోగముగలట్టియు, మగ తనము లేనట్టియు, ఎద్దులను కట్టి దున్నరాదు.

పరాశరస్మృతి 2అధ్యా. 3

(21) ధృఢమైన అవయవములు గలిగినట్టియు, రోగములేనట్టియు, చక్కగ మేతమేసి, నీరుత్రాగి, తృవి చెందినట్టియు, బలసి రంకెలువేయుచున్నట్టియు, మగతనము కలట్టి ఎద్దులను కట్టి రెండుజాములవరకు దున్ని, తరు వాత, ఆ యెద్దులకు స్నానము చేయించవలెను. 4శ్లో.

(22) రోగార్థము పశువులకు చికిత్సచేయవలసినప్పుడు వానిని అతిగా కాల్చినను, 2. ఎక్కువ బరువువేసి లాగించి

నను, 3. ముక్కునందు త్రాడును దూర్చుటకై ముక్కులను పొడిచినను, 4. దుర్గములగు కొండలందును, నదులందును, త్రిప్పించినను, ప్రాయశ్చిత్తము చేసుకోవలెను.

9 అ. 29

(23) పరాశర స్మృతిలో 8,9 అధ్యాయములలో పశువులయెడ చేసిన దోషమును, పోగొట్టగల పద్ధతులు బోధింపబడినవి.

(24) 6వ అధ్యాయములో కోళ్ళను, పందులను. మేకలను, మొదలగువాటిని చంపువారికి ప్రాయశ్చిత్తము చెప్పబడినది.

(25) మూగ జీవులయెడ గావించిన దోషములను పోగొట్టుకొనుటకు ప్రాయశ్చిత్తము చేసుకొననివాడు ఘోరమగు కాలసూత్ర నరకములో బాధ ననుభవించి, తర్వాత మనుష్య లోకములో బుట్టి, నపుంసకుడై, దుఃఖితుడయి, కుష్ఠురోగము కలిగి, ఏడు జన్మములెత్తును. 9 అధ్యా. 59శ్లో

(26) గృహ క్షేత్రంబులజొచ్చి, యుదర పూరణ మాత్రంబు వొంగిలినవాని, దండింపక, శునక, భుజగ, మృగ, మూషిక, మర్కట, మక్షికా ఖరోష్ట్రింబుల, హింసింపక, పుత్రులభంగి నీక్షించవలెను. 7స్కం, 445

(27) పక్షులు, ఎలుకలు, ధాన్యమును పాడుచేయు చున్నను, చంపనివారికి, అశ్వమేధయాగంబె మించినఫలము కలుగును. 5 అశ్వా. 41 అనుశాసనీకం

(28) తన శరీరమును కరచుచున్న పేలను, నల్లులను, దోమలను, పుత్రులను కాపాడినవిధముగ, కాపాడినవారు స్వర్గమునుపొందుదురు. మాఘమహాత్మ్యం 32అధ్యా. 8శ్లో.

(29) మూగజీవులను దగమిడి చంపినవారికిని, వాటిని బాధించువారికిని, జ్వరము, గుల్మపీడ, అతిసారము, పుండ్లు, వ్రణములు, మహోదరము, వాత, పిత్త, కఫ, దారుణ రోగములు సంభవించును. అనుశాసనీకం 5 అధ్యా, 103

(30) సాధువులగు జంతువులకు, బాధలుగావించు దుష్టులను శిక్షింపనట్టి దేశాధిపతులు దేశపాలకులుగానుండ అర్హులుకారు. 1స్కం. 423

సుఖములు గోరునట్టి మానవులు జంతుహింస లొనర్ప రాదని, హితోపదేశము లొనర్చిన శాస్త్రములింక ననేకములు కలవు.

పండ్లు ఫలాదుల తినునట్టి చిల్కలు, కోయిలలు మొదలగువానిని ఏవిధముగ ప్రజలు ప్రేమించుచున్నారో,

గడ్డిగాదము తినునట్టి పశువులను ఏవిధముగ ప్రజలు పోషించుచున్నారో, అదేవిధముగ సాత్విక ఆహారులను మాత్రమే భగవంతుడు ప్రేమించుచుండును.

అపకార మొనర్చునట్టి పాములను, తేళ్ళను, ఏవిధముగ మీరు చంపుచున్నారో,

క్రూర స్వభావముగల జీవులను ఏవిధముగ మీరు ద్వేషించుచున్నారో,

చున్నారో, అట్టివాదనలను ధిక్కరింపకుండుటకు 'భక్షణార్థ పశుపక్ష్యాదులను పెంచునట్టి పద్ధతినైనా' పడనాడవలెను.

(3) మహాత్ముల దయను ఆర్జించదలచువారెల్లా, ఏ హేతువల్లో వారు 'పరపీడన పాపమని' చాటుచున్నారో, అట్టిసందేశములను అమలుజరుపుటకై 'పశువులను బాధించి పనులుచేయించునట్టి పద్ధతినైనా' రూపుమాపాలి.

(4) మహాభక్తుల అనుగ్రహమును కాంక్షించువారెల్లా, ఏ దాఖలాతో వారు "జీవులన్నియు భగవత్స్వరూపములేయని" ప్రబోధ మొనర్చుచున్నారో, అట్టి ప్రబోధముల నుల్లంఘింపకుండుటకై 'జీవబలి ఇచ్చునట్టి పద్ధతులనైనా తీసివేయాలి.

(5) తపోధనుల దీవెనలను పడయదలచువారెల్లా ఏ నిదర్శనముతో వారు 'తనకర్మే తనకు కష్టసుఖము లిచ్చుచున్నవని' శాసించుచున్నారో, అట్టిశాసనములను జవదాటకుండుటకై 'తినుటకనుచు మూగజీవులను చంపునట్టి పద్ధతినైనా నిషేధించాలి.

(6) మహాత్ముల ఆశీర్వాదములు పొందదలచువారెల్లా ఏఅభిప్రాయముతో, మహాత్ములు 'తినుటకు జీవించునది పశువులనియు, జీవించుటకే తినవలసినవారు మానవులనియు' తీర్పు చెప్పుచున్నారో, అట్టితీర్పులను శిరసావహించుటకై 'మాంసమును తినునట్టి దురభ్యాసమునైనా, మానివేయాలి.

ఈ విధంబుగా బుద్ధభగవానుడు బోధింపగ అచ్చటివారెల్లరు భగవానుని పాదములమీదపడి "మాతప్పులనుక్షమిం

పుడు. నేమిక మా జీవితములలో జంతుహింసలు, మాంస భక్షణ చేయమని" ప్రతినలు సల్పినారు. జంతుహింస నిషేధన ప్రచార మొనర్చెదమని పండితులెల్లరు దీక్షలుపట్టిరి. తమవద్ద నిల్వవున్న ధనముయావత్తు జంతురక్షణ నిధికి యిస్తామని ధనవంతులెల్లరు శపథములొనర్చినారు. లాభములలో సగమువంతు జంతుపోషకశాలకు ఇస్తామని వ్యాపారస్థులందరు ప్రతిన లొనర్చిరి. పుడమిరేడు తన రాజ్యమంతట జంతు రక్షణ శాసనములు శాసించెను.

అచటనుంచి భగవానుడు స్వగ్రామమునకు వెళ్ళి తన తల్లిదండ్రులకు జ్ఞానోపదేశమొనర్చి వారి దుఃఖము పోగొట్టగా వారు బుద్ధదేవుని మతము స్వీకరించి ధన్యులైరి. మూగ జీవుల రక్షణార్థము భగవానుడు స్వగ్రామమువదలి అహింసా ప్రచారమునకు బయలుదేరెను. పల్లెలలో, పట్నములలో, అహింసా ధర్మమునువ్యాపింపజేయుటకై పండితులనుపంపుచు, భగవానుడు ధరణీపతులను కలుసుకొనుచు, అహింసా సూత్రములను దేశమంతటా నెలలోపల నాచరింపచేసి, మూగ జీవుల బాధలు రూపుమాపి, అధోగతికి పోవుచున్న జనులను ఉద్ధరించెను. భగవానుడు ఉన్నంతకాలము విష క్రూరజంతువులుగూడ స్వేచ్ఛగా మిత్రులవలె సంచరించినవి.

బుద్ధభగవానుడు స్థాపించిన మతముపేరే బౌద్ధమతము. బౌద్ధమతము రాజమతమై వృద్ధిగాంచినది. భగవానుడు న్నంతకాలము దేశములో రెండవమతము లేదు. భగవానుడు నలుభై సంవత్సరములవరకు అహింసా సూత్రములను

బోధించుటయందే కాలముగడిపెను. తానువచ్చినపని పూర్తి యగుటచే తన 80వ ఏట క్రీస్తుకు పూర్వము 543వ సంవత్సరమున భగవానుడు అవతారముచాలించి వైకుంఠము చేరెను. భగవానుని అస్తులను వారిశిష్యులెల్లరు తమతమ దేశములకు గొనిపోయి, వాటిని మహా వైభవముతో దారిపొడుగునా ఊరేగింపు లొనర్చుచు తీసుకొనివచ్చి, వాటికి గొప్ప స్తూపములుకట్టించి, వాటిలో బుద్ధదేవుని శల్యములుంచి పూజించుచుండిరి. అమరావతి, భట్టిప్రోలు, నాగార్జునకొండ, మొదలగుచోట్ల స్తూపములు గలవు. భగవానుడు వైకుంఠముచేరిన తరువాత వెయ్యిసంవత్సరములవరకు భగవానుని సిద్ధాంతములనే ప్రజలు ఆచరించిరి. ఈ వెయ్యి సంవత్సరముల కాలమునకే బౌద్ధ మహాయుగమనియు, స్వర్ణ యుగమనియు పేరు వచ్చినది. బౌద్ధమతము పుట్టినది మొదలు చాల వేగముతో ప్రయాణమొనర్చి కొద్దిరోజులకే దేశమంతట వ్యాపించెను.

భగవంతుని అవతారములలో బుద్ధభగవానుడు గూడ నొక అవతారమేయని ప్రజలందరు నంగీకరించినారు. దశావతారములలో బుద్ధుడొక యవతారమని శాస్త్రములన్నియు చాటినవి.



శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

ఓం శ్రీరామాయనమః ఓం శ్రీబుద్ధదేవాయనమః

# సప్తమ అధ్యాయము

శ్రీ బుద్ధభగవానుని సూత్రముల ప్రకారము రాజ్యములు పాలించినవారిని, ఆ సూత్రములను ఆధారముగ తీసుకొని ప్రచారమొనర్చిన మతకర్తలను, భక్తులను, మహాత్ములను తెలుసుకొందము.

(1) ఏ శిక్షాధిపతి తన రాజ్యములో మాంసము తినరాదని, జంతువులను వధింపరాదని, జీవులను బాధింపరాదని, జీవబలినివ్వరాదని, మృగములను వేటాడరాదని, మొదలగు జంతురక్షణ శాసనములు తీవ్రముగ అమలుజరిపించి, ధిక్కరించువారిని కఠినముగ శిక్షించెనో,

ఏ న్యాయపాలకుడు తన దేశములో మూగజీవులకు గూడ ధర్మవైద్యశాలలను, వాటినీడకై చెట్లను, తోపులను, వాటి నీటికై మైలుకొకటిచొప్పున బావులునిర్మించి, జంతువులకు కావలసిన వసతులన్నియు ఏర్పాటుచేసెనో,

ఏ ధర్మపాలకుడు తన పరిపాలనలోని ప్రజలందరికి జంతురక్షణ ప్రబోధములు తెలియుటకై 60 అడుగుల ఎత్తుగల నూరువేల స్థూపములమీదను, అనేకవేల రాతిస్తంభములమీదను వ్రాయించి అన్ని గ్రామములందు స్థాపించెనో,

ఏ ధరణీపతి కీర్తిని వెదజల్లుటకై నేటికిని సాంచీ, బాగ్హాతు, త్రోప్రా, అలహాబాదు మొదలగు పట్టణములందు సదరు స్తూపములు, రాతి స్తంభములు నిల్చియున్నవో,

ఏ దేశాధిపతి మానవులందేగాక, మూగజీవులయందునుగూడ సోదరభావము చూపుటయే సర్వోత్కృష్టమైన యాదర్శమని ప్రకటించి, ధర్మ ప్రభుత్వము నడపి, సమస్త దేశాధిపతులచేత, ప్రజలచేత పూజింపబడి, అన్ని దేశములందు శ్లాఘింపబడెనో,

ఏ ధర్మ స్థాపకుడు 64 వేలమంది ప్రచారకుల నియమించి, సింహళము, బర్మా, సిరియా, ఈజిప్టు, టర్కీ, గ్రీసు మొదలగు దేశములలోగూడ బౌద్ధమతమును వ్యాపింప చేసెనో,

ఏ రాజ్యాధిపతి క్రీస్తు పుట్టుకముందు 273వ సంవత్సరములో రాజై 40సంవత్సరములు ధర్మగురువువలె రాజ్యము పాలించెనో,

అటువంటి రాజ్యాధిపతియైన అశోకమహాచక్రవర్తిని మార్గదర్శముగ నుంచుకొని, దేశాధిపతులందరు తమతమ రాష్ట్రములలో జంతురక్షణ శాసనములు తీవ్రముగ నమలుజరిపి, మానవులవలెనే మూగజీవులనుకూడ చూచి, వాటి బాధలు చూపుమాపినవారు భారతదేశాధిపతులుతప్ప మరెవ్వరు లేరను కీర్తిని గడించిన భారత దేశాధిపతులు మార్గదర్శకులౌదురుగాక.

(2) ఏ పుడమిరేడు తన రాజ్యములో జంతురక్షణ శాసనములు అమలుజరుపుటకును, బౌద్ధమతము వ్యాపింపజేయుటకును అశోకునివలె పాటుపడెనో,

ఏ రాష్ట్రాధిపతి తనరాజధానియైన పెషావరు పట్టణములో బుద్ధదేవుని జ్ఞాపకార్థము 400 అడుగుల ఎత్తుగల కొయ్య గోపురముకట్టించి, నాగార్జునుడనుపండితునిచేత పురాతన బౌద్ధమత గ్రంథములకు వ్యాఖ్యానము వ్రాయించెనో,

ఏ ప్రభువు క్రీస్తుపుట్టిన తరువాత 78వసంవత్సరములో రాజై 48 సంవత్సరములు పాలించి దైవపుత్రుడను పేరు గాంచెనో.

అటువంటి మహారాజుఅయిన కనిష్క మహాచక్రవర్తిని ఆదర్శముగ నుంచుకొని, ప్రాజ్ఞులెల్లరు వర్తించాలి.

(3) ఏ రాజాధిరాజు జంతురక్షణ శాసనములు తీవ్రముగ అమలుజరిపించి. తన రాజ్యములో జంతుహింసకులను. మాంస భక్షకులను, పశువులను బాధించువారిని, జీవబలి నిచ్చువారిని, మృగములను వేటాడువారిని మచ్చుకైనా లేకుండ చేసెనో,

ఏ భూపాలకుడు తనఎత్తు బంగారు బుద్ధ విగ్రహమొకటి స్థాపించి, మూడడుగుల బంగారు బుద్ధవిగ్రహమొకటి యుత్సవ విగ్రహముగ నొనర్చి, యూరేగించునపుడు తానుస్వయముగ విగ్రహముపై ఛత్రము పట్టుచుండెనో,

ఏ ధర్మరాజు అయిదు సంవత్సరముల కొకసారి సర్వస్వదానమను మహావ్రతమును 75 రోజులు జరిపి, తన ఖజా

నాలో నుండే యావత్తు ధనమును, ఆభరణములును దాన ధర్మము లొనర్చుచుండెనో,

ఏ చక్రవర్తి క్రీస్తు పుట్టిన తరువాత 606వ సంవత్సరము మొదలు 647వ సంవత్సరముువరకు రాజ్యము పాలించి, రాజయినను సన్యాసివలె కాలముగడిపెనో,
అటువంటి మహాచక్రవర్తియైన హర్షవర్ధన మహారాజు ప్రకారము దేశాధిపతులెల్లరు నడవాలి.

ఈ మహా చక్రవర్తులు ముగ్గురు తమ రాజ్యములలో ప్రజలకు ఏలాంటి సౌఖ్యములు కలుగజేసినారో, అదేవిధముగ మూగజీవులకుగూడ అనేక సౌఖ్యపు వసతులు ఏర్పాటుచేసి, మూగ జీవులనుగూడ తమవంటివేయని భావించి, వాటి బాధలు చూపుమాపినారు. ఈ చక్రవర్తులు గడించినంతకీర్తి ఏ చక్రవర్తి కూడ పొందలేదు. వీరు అన్ని దేశములందు ఖ్యాతిగాంచినారు. వీరేగాక తమతమరాజ్యములందు బుద్ధుని ప్రబోధముల ప్రకారము ప్రజలనువర్తింపజేసిన రాజులెందరో గలరు. — బుద్ధదేవుని సిద్ధాంతములు మన దేశములో అంతరించినప్పటికిని, చీనా, జపాను, టిబెట్టు, సయాం, బర్మా, సింహళము, జావా, సుమిత్రా మొదలగు దేశములలో నేటివరకు బుద్ధదేవుని ఉపదేశములనే ఆచరించుచున్నారు. పృథ్వీతలమునగల మతము లన్నిటిలోను బుద్ధదేవుని మతమే యుత్తమస్థాన మాక్రమించుకొనెను. నేటికిని ఈ ప్రపంచములో మూడవవంతు బుద్ధదేవుని సిద్ధాంతములనే పాటించుచున్నారు.

(4) జీవరక్షణ దీక్షతో సంచరించువారినిమాత్రమె మానవ జాతికి చెందినవారినిగ, పరిగణింపబడుదురని బోధించుటకై బుద్ధదేవుని సమకాలికుడైన వర్ధమాన మహావీరుడు జైన మతము స్థాపించెను. ఈమతమునకు అహింస ప్రాణము వంటిది.

(1) నీరు వడకట్టి త్రాగుదురు. (2) ముక్కుపై ముసుగు వేసుకొని గాలిపీల్తురు. (3) దీపములు పెట్టిన అందు పురుగులుపడి చచ్చునని దీపములు పెట్టరు. (4) చీకటిలో ఏప్రాణికైన హానికలుగునేమోఅని, సూర్యుడస్తమించకముందె భోజనాది కృత్యములు ముగింతురు. (5) మాంసముతినరు. (6) వీరికి శిక్షాస్మృతులలో జంతుహింసల కెక్కువ దండన కలదు. (7) జైనరాజులు జంతుహింస మహాపరాధముగా శాసించి దోషులను కఠినముగ శిక్షించెదరు.

(5) క్రూరబుద్ధులను రూపుమాపుటకే పరమశివుడు కేరళ దేశమున కాలడి అగ్రహారములో క్రీ.శ. 788 సంవత్సరములో శ్రీ శంకరాచార్యులుగా అవతరించి. "జీవాత్మయే పరమాత్మ"అను భావమును తెలియజేయగల అద్వైత మతమును స్థాపించి, భూలోకమంతయు సంచరించి, దుష్ట బుద్ధులనుదగ్ధమొనర్చుచు. అహింసతో వర్తించువారినిమాత్రమే సజ్జనులుగా నిర్ణయింపబడుదురని బోధించుచు, తన 32 వ వయస్సున బదరికాశ్రమములో 820వ సంవత్సరములో అవతారము చాలించెను.

(6) హింసతోఁగూడిన యజ్ఞయాగాదిక్రతువులను నిర్మూలన చేయుటకే ఆదిశేషువు పెరంబూరులో క్రీ. శ. 1017లో రామానుజాచార్యులుగ జన్మించి, "జీవాత్మ వేరనియు, జీవాత్మ పరమాత్మతో సాయుజ్యమొందుననుˮ భావము వెల్లడిచేయఁగల విశిష్టాద్వైతమును స్థాపించి, ప్రపంచమంత తిరిగి, పశుయజ్ఞములు, జీవబలులు మొదలగు దురాచారము లను పారద్రోలుచు, అహింసాసూత్రమును ఆచరింపనివారిని భగవంతుఁడు ద్వేషించునని బోధించుచు, తన 120వ ఏట శ్రీరంగ క్షేత్రమున క్రీ. శ. 1137 సంవత్సరములో దేహము చాలించెను.

(7) క్రూరకృత్యమును భస్మమొనర్చుటకే కర్ణాటక దేశమున ఉడిపిగ్రామమున క్రీ.శ. 1238లో మధ్వాచార్యులుగా జననమొంది, "జీవాత్మ పరమాత్మ వేరనియు, ఎన్నఁడును కలియరను" భావమును సూచింపగల ద్వైత మతమును స్థాపించి, దేశమంతాతిరిగి దుష్టకృత్యములనుమాపుమాపుచు, 'అహింసా పరమోధర్మమును ఆచరించుచున్న వారిని మాత్రమే, మానవ ధర్మమందు ప్రవర్తించుచున్నవారుగ లెక్కింపబడుదురని' బోధించుచు తన 80వ ఏట 1318వ సంవత్సరములో నిర్యాణమొందెను.

(8) మూగజీవులనుగూడ మనుష్యులవలెనే చూడవలెనని, దేశాధిపతులకు దాఖలాచూపుటకే, మనునీతి చోడరాజు 'తన పుత్రుఁడు రథారూఢుఁడై పోవుచుండ, ఆవుదూడ బెదరి ఆ రథచక్రముక్రిందపడి మృతిచెందిన నేరమునకై తన కుమా

(12) కంటిలో చూచెడు ప్రాణులన్నిటిని దైవరూపముగనే భావించవలెనని తెలియజేయుటకే. నామదేవుడనే భక్తుడు 'తన చేతిలోని రొట్టెను తటాలున నోటకరచుకొని పారిపోవుచున్న కుక్కనుచూచి, 'ఓ స్వామీ! పరుగెత్తవద్దు. నోరు నొప్పి కలుగునట్లు పట్టి రొట్టె తినకుము. నెయ్యి, పంచదార తెచ్చుచున్నాను. ఘృతములో ముంచుకొని, శర్కరలో అద్దుకొని, మెత్తగ, రుచిగ తినవచ్చును. భయపడవద్దు అచ్చటనే వుండుమని" పిలుచుచు, దానివెంట పరుగెత్తి పట్టుకొని, ఆ రొట్టెను ముక్కలుగాజేసి, ఆజ్యములో ముంచి, పంచదారలో అద్ది, ఆశ్వానమునకు పెట్టినాడు,

(13) ఏ కాలములోనైనను జీవబలినివ్వకుండ, సాత్విక పూజలోనే తమఇష్టదేవతలను కొల్చుచుచు, తమఇష్టదేవతానుగ్రహమును పొందవచ్చునని ఋజువుపరచుటకే హరిజన కులోద్భవులైన నందనారు, చోకామేళుడు, మొదలగు వారును,

కుమ్మరి కులస్థులయిన గోరాకుంభారు, కూపాకుంభారు మొదలగువారును, జీవబలి నివ్వకుండ, పాపకృత్యములు వర్జించి, శాకభక్షకులౌను, సాత్విక పూజలోనే ఇష్టదేవతలను తాము పిలచినప్పుడెల్ల, తమ యిష్టదేవతలు తమను కాచుకొని తిరుగునట్లుగా చేసుకొని, ఆ దేహములోనే వైకుంఠము పొందినారు.—వీరిని ఆదర్శముగ నుంచుకొని, సమస్తజాతుల వారును మాంస భక్షణ, జంతుహింసలు మానివేయవలెను.

(14) క్రీ. శ. 1750లో గోగులపాటి కూర్మనాథుని స్తోత్రమునకు సింహాద్రి నరసింహస్వామి హర్షించి, తనభక్తుని వాంఛ తీర్చుటకై 'సింహాచల క్షేత్రమును ధ్వంసమొనర్పవచ్చిన తురకదండుపైకి, కందిరీగలనుపంపి, వారిని పారద్రోలించినాడు.

(15) క్రీ. శ. 1791లో భట్టురాజు కులస్థుడైన కాసుల పురుషోత్తముని స్తుతికి శ్రీకాకుళములోని ఆంధ్ర విష్ణుప్రభు ఆనందమొంది, తన భక్తుని సంతోషపరుప. మహావైభవముతో తనకు నిత్యోత్సవము లొనర్పగ ప్రభువులను రప్పించుకొన్నాడు.

(16) ఏ కవి విరాట్ యొక్క భక్తిరసామృత ధారలలో తన దాహముదీర్చుకొనగోరి, శ్రీరామచంద్రమూర్తి ప్రత్యక్షమై భాగవతమును వ్రాసి తన కర్పింపుమని ఏ కవిని ఆర్థించెనో,

ఏ కవి బ్రహ్మయొక్క ఆజ్ఞ నెఱవేర్చుటకై ఎద్దులు లేకున్నను. నాగలంతట నాగలే ఎవరిభూమిని దున్నెనో,

ఏ కవి సార్వభౌముని అభయహస్తమునకు హర్షించి, ఎవనియింటిలో సరస్వతీదేవి వంటకత్తెగానుండి ఘుమఘుమ వాసనలను గ్రామమంతట వ్యాపింపచేయుచు, క్షణములో సమస్త పదార్థములు వండి రాసులుగా పోసినదో.

ఏ కవిశేఖరుని శపథము నెరవేర్చుటకై ఎవని గృహమందు శ్రీహరి వరహా రూపములోవుండి, వచ్చిన సైన్యమును వచ్చినట్లుగ పడగొట్టి రాజుకు బుద్ధిచెప్పెనో,

ఏకవి చతుర్ముఖుడు తననిమిత్తము హతమైన సైన్యమును బ్రతికించెనో,

ఏకవి రత్నముయొక్క గ్రంథమును పూర్తిచేయుటకు శ్రీమహావిష్ణువుగూడ అప్పుడప్పుడువచ్చి తన చేతులమీదుగా తన భావములను వ్రాసేనో)

ఏకవి చక్రవర్తియొక్క భాగవతమును భగవద్గ్రంథముగ భావించి ప్రజలందరు నిత్య పూజా పారాయణలొనర్చుచున్నారో,

ఏకవీశ్వరుడు ఓరుగల్లు పట్నములో జన్మించి క్రీ. శ. 1422లో తెలుగు భాగవతము వ్రాసెనో,

అటువంటి కవీశ్వరుడైన పోతనను మార్గదర్శముగ నుంచుకొని ప్రజలు వర్తించాలి.

(17) ఏభక్తశిఖామణికి స్వప్నములో శ్రీరామచంద్రమూర్తి ప్రత్యక్షమై "నాసుఖము కోరువారు నీవుతప్పమరెవ్వరు లేరు. నీవే నాకుకావలసిన వసతులు ఏర్పాటుచేయువలెననియాచించినాడో,

ఏ భక్తాగ్రేసరుడు తనభక్తిచేత మృతిచెందిన కుమారుని బ్రతికించుకొన్నాడో,

ఏభక్తశేఖరుని మహిమ ప్రచారమొనర్చుటకై రామలక్ష్మణులు జవానుల వేషముతో తానీషాయొద్దకు వెళ్ళి, మేము రామదాసుగారి జవానులము, మా ద్వార మీకు చెల్లించవలసిన ఆరులక్షల వరాలు పంపినారు, తీసుకొని రసీదు ఇవ్వండని దబాయించినారో,

ఏ భక్త శిరోమణియొక్క పాదములమీదపడి 'తన ద్రోహములు మన్నించుమని' తానీషా ప్రార్థించినాడో,

ఏభాగవతోత్తముని గాథను సూర్యచంద్రాదులున్నంత వరకు చెప్పుకొనుటకై, ఏ మహాత్మునికి తానీషా భద్రాచలము తాలూకాను జాగీరుగనిచ్చి, అప్పుడే ఫరమానా వ్రాసి యిచ్చివేసి, రామలక్ష్మణులు చెల్లించిన ఆరులక్షల వరాలను మరి యనేక రత్నాభరణములను ఇచ్చి, పాదములమీద పడి, యనేకవిధముల ప్రార్థించి, బంగరపు పల్లకి లో కూర్చుండబెట్టి మహావైభవముతో తన పట్టణమంతట ఊరేగింపుచేసి, భద్రాచలమునకు పంపినారో,

ఏ భక్త శ్రేష్ఠుని ధనమును కాపాడుటకై రామలక్ష్మణులు వచ్చి, తమ బాణవర్షముతో దారిదోపుడుగాండ్రను పారదోలినారో,

ఏ పరమ భక్తుడు తనగ్రామ పౌరులకు హరిభక్తిని బోధించుచు, తన పౌరులు చూచుచుండగ, విమానములో కూర్చొని వైకుంఠమున కేగెనో,

ఏ భక్తవిరాట్ బోధించినట్టి దాశరథి శతక పద్యములను కీర్తనలను ఆబాలగోపాలము నిత్యము గానమొనర్చుచున్నారో,

ఏభాగవత రత్నమును తలచుకొని, భద్రాచలమందు వెలసియున్న శ్రీరామచంద్రమూర్తిని దర్శించుటకులక్షలాది ప్రజలు వచ్చుచున్నారో,

ఏ భక్త శిఖామణి ఆంధ్ర ప్రదేశములోని నేలకొండ పల్లె గ్రామములో ,గోపన్న' పేరుతో జన్మించి, క్రీ. శ. 1653వ సంవత్సరంలో భద్రాద్రి తాలూకా తహసీల్దారు పనిచేయుచు, గవర్నమెంటువారి అనుమతి లేకుండనే, సర్కారు ద్రవ్యములోనుంచి ఆరులక్షల వరహాలు ఖర్చుపెట్టి కోవెల, గోపుర, ప్రాకారాదులను కట్టించి సదరు ధనము యావత్తును దేవాలయములోని విగ్రహముల చేతనే తానీషాకు పంపించెనో,

అటువంటి భాగవత రత్నమైన రామదాసుగారు సాత్విక పదార్థములనే నివేదించుచు, సాత్వికపద్ధతిలోనే పూజించుచు తమఇష్ట దేవతానుగ్రహముపొంది, తన అభీష్టములు నెరవేర్చు కొన్నారు.—రామదాసుగారిని దాఖలాగానుంచుకొని ప్రజలు ఈ క్షణమునుంచె జీవబలినిచ్చు పద్ధతి రద్దుపరచి, సాత్విక హారమునే నివేదించుచు, సాత్విక పద్ధతితోనే తమ ఇష్ట దేవతలను కొల్చెడి ఆచారమును ప్రవేశపెట్టవలెను.

(18) ఏ గాన శేఖరుని గణపతి ప్రార్థన విన్నానని చెప్పాటన్కై అప్పటికప్పుడే గణపతి సాక్షాత్కరించి "నీఅభీష్టము నెర వేరుగాక" యని ఆశీర్వదించెనో,

ఏ గాయక రత్నమునకు నారద మహాముని వచ్చి తారక మంత్రము నుపదేశించెనో,

ఏసాహిత్యబ్రహ్మ నివేదించిన పదార్థములను శ్రీరామ చంద్రమూర్తి ప్రతిరోజు ఆరగించుచుండెనో,

ఏగాన విరాట్‌ని పాదములమీదపడి 'తనఅపరాధము లను క్షమింపుమని" పురమిరేసు ప్రార్థించినాడో,

ఏ గాయక విద్వాంసునకు దర్శ మివ్వదలచి, వేసిన తలుపులను తెరచివేసి, తిరుపతి వేంకటేశ్వరస్వామి తన దర్శన మిచ్చెనో,

ఏ సంగీత చక్రవర్తియొక్క ధనమును కాపాడుటకై రామలక్ష్మణులు వచ్చి చోరులను పారద్రోలినారో,

ఏ సాహిత్య శేఖరుని తన మనశ్శుద్ధివల్ల. చచ్చిన వానిని బ్రతికించెనో,

ఏ గాన సార్వభౌముని కృతులను ఆధారముగ జేసు కొని నేటి గాయకులు బ్రతుకుచున్నారో,

ఏసంగీత కళానిధి తంజావూరుజిల్లా తిరువారూరు గ్రామములో క్రీ. శ. 1789లో జన్మించి, భక్తియోగము ప్రచారమొనర్చుచు, సన్యసించిన ఎనిమిదవరోజుననే తన 80వ వయస్సులో స్వగ్రామమునందు 1847లో జీవసమాధియయ్యె, నేటికిని తారకమంత్రమును వెల్లడిచేయుచుండెనో,

అటువంటి సంగీత కళానిధియైన త్యాగరాజుగారు సాత్విక పూజవల్లనే, తనఇష్టదేవతను ప్రత్యక్షముగావించుకొని, తన సంకల్పములు నెరవేర్చుకొన్నాడు.

(19) ఏ దీక్షాపరుడు అక్షరాభ్యాసపద్ధతిని త్రోసివేసి, భగవంతుని చూపించగల పద్ధతిని సాధించెనో,

ఏ తపశ్శాలి తన సాధనకాలమందు అయిదారు సంవత్సరములు కనురెప్పలు మూయకుండ, ఏకదృష్టితో, తదేకధ్యానముతో, తన యిష్టదేవతను కొల్చెనో,

ఏ మహాత్ముడు విదేశమత వ్యామోహ రక్కసినోట పడకుండ, హిందూమతమును రక్షించి, హిందూమత సిద్ధాంతములందు "తమ మతములు దిగదుడుపుకైన పనికిరావని" అన్నిమతములవా చేతను, ఏకగ్రీవముగ ఆమోదింపజేసెనో,

ఏ అద్భుత విరాట్ వల్ల కలకత్తా సమీపముననున్న దక్షిణేశ్వర కాళికాలయము జగత్ప్రసిద్ధిగాంచెనో,

ఏ ఆత్మజ్ఞాని దేవికి నివేదించుచున్న నైవేద్యమును పిల్లివచ్చి తినుచుండజూచి, "ఓతల్లీ! మార్జాలరూపముతో వచ్చి ఆరగించుచున్నావా? ఆరగింపుము" అని నైవేద్యమంతయు యా బిడాలమునకే ఆరగింపుచేసెనో,

ఏ పరమహంస వంగదేశమునందలి హుగ్లీ మండలములోని కామరపకూరు అను గ్రామములో బీదవైదిక బ్రాహ్మణ కుటుంబమున రామకృష్ణుడను నామముతో 1836-2-18 తేదీ ఉదయమున జన్మించి, తన యుపదేశామృతముతో ప్రజలను భక్తిమార్గమున నడపించుచు, 1886-8-11వ తేదీన పరమపదము చెందెనో,

అటువంటి మహాత్ముడైన రామకృష్ణపరమహంస జీవబలినివ్వకుండ శాకాహారముతోనే మెప్పించి, తాను పిలచినపుడెల్లా వచ్చునట్లు నవకోటి శక్తులకు యజమానురాలైన కాళికా

దేవీశరమన్నాను. ఈమహాత్ముని మార్గదర్శముగా నుంచుకొని, శక్తిపూజలకు జీవబలినిచ్చు ఆచారమును వెంటనే తీసివేయాలి.

దేవాలయములు ఖ్యాతిగాంచుటకుగాని, హీనస్థితికి వచ్చుటకుగాని, అర్చకులమీదనే ఆధారపడియున్నది. భక్తి, మంత్ర, శాస్త్ర, ఉపన్యాసాదులందు, అర్చకులు పండిత శిఖామణులై యుండవలెను. ముఖ్యముగ అర్చకులకు భగవ ధ్యాస తప్ప, ఇతరధ్యాస లుండరాదు. 'అర్చకుడే' భగవం తుడను భావము ప్రజలకు కలుగునట్లు వర్తించవలెను. అర్చ కులనైన దైవభక్తితో మార్గదర్శకులుగ నుంచునట్లు చేయు నుద్దేశముతోనే అర్చకులకు ఏలాటి ఆర్థికలోపములు రాకుం డుటకై ప్రతి దేవాలయమునకు అపరిమితమైన దేవాదాయ మును ఏర్పాట్లు చేసినారు. ఇతరధ్యాసలలోనుండునట్టి అర్చ కులు అర్చకత్వమునకు పనికిరాదు. మంత్ర శాస్త్రాదులు ఏమాత్రము తెలియకున్నను, సదా భగవధ్యాసలోనుండునట్టి వారే అర్చకత్వము చేయుటకు అర్హులు. ఇట్టివారు దేవా లయములందున్నప్పుడే దేవాలయములు సార్థకమగును.

నేటికాలపు అర్చకులోనర్చు లోపములను ప్రభు త్వమువారు గ్రహించి, దేవాదాయములు సక్రమముగా విని యోగపడునట్లు చేయుటకే, దేవాదాయ బిల్లును ప్రవేశపెట్టి నారు. గాన ట్రస్టీలు, ధర్మకర్తలు, యజమానులు, పౌరులు మొదలగువారందరు, తమతమ గ్రామములలోని దేవాదాయ మును భగవత్సేవలకు పోగా మిగిలిన ధనమును భక్తి, తప,

యోగాది శ్రేష్ఠులను తయారుచేయుటకుమాత్రమే వినియో గించవలెను. ఈ పద్ధతులకు మాత్రమే దేవాదాయము విని యోగించినప్పుడే సక్రమముగా ఖర్చుపెట్టుచున్నవారుగాను, ఆస్తికమతముయొక్క మూలసిద్ధాంతములను ఆచరించుచున్న వారుగాను ఎంచబడుదురు.

(20) ఏ కవి తన యిష్టదేవతానుగ్రహమువల్ల క్షణములో ఓనమాలదగ్గరనుంచి సమస్తవిద్యలు పొందెనో,

ఏ కవీశ్వరుని కవన సమ్మోహనాస్త్ర చతుష్టయము నకేబద్ధుడై, దాసోహమనుచువచ్చి, కాళ్ళమీదపడి 'నా రాజ్యమంతయు నీవే ఏలుకొమ్మని' భోజమహారాజు ప్రార్థించెనో,

ఏ కవివిరాట్ అమావాస్యనాడు షోడశ కళాపరిపూ ర్ణుండగు చంద్రభగవానుని ప్రకాశింపజేసెనో,

ఏ కవిశేఖరుని ఆజ్ఞనెరవేర్చుటకై క్షణములో వరుణ దేవునివలన ఆకాశగంగను, సోమదేవునివలన వస్త్రములను, అగ్నిదేవునివలన దివ్యాన్నంబులు, భక్ష్యభోజ్యాదులును ఆవిర్భవింపచేసెనో,

ఏ కవిబ్రహ్మ అప్రశిఖయను వాక్యార్థమునకు నిదర్శ నము చూపుటకై మృత్యువైనవానిని బ్రతికించెనో,

అటువంటి కవీశ్వరుడైన కాళిదాసు, పూజా పునస్కారము లను, నైవేద్యములనుగూడ చూపక, తన ధ్యానశక్తిచే తాను చెప్పినదెల్లా క్షణములో నెరవేర్చునట్లుగ, కాళికా

ఆ॥ జీవిజంపు టెల్లశివభక్తి తప్పు జే। జీవునందసికసును
శివుడేయగును । జీవునకుశివునకుసిద్ధంబు తెలియరా ॥వి॥

ఆ॥ నొసలు బత్తుడయ్యె । నోరు నోడైలయ్యె । మనసు
ఘాతమువలె మలయగాను । శివునిగాంతుననుచు సిగ్గు
గాదురా ॥వి॥

ఆ॥ జీవిజీవిజంపి జీవికిబెట్టంగ । జీవితాన బలసి చెలగు
చుండు, జీవహింసకులకు చిక్కునా మోక్షంబు ॥వి॥

ఆ॥ రాతి బసవని గని రంగుగా మ్రొక్కుచు । యాఢ
బసవని గాలదన్నుచుండ్రు । బసవ భక్తులెల్ల పాపులు తల
పోయ ॥వి॥

ఆ॥ పక్షిజాతిబట్టి పరగహింసల । బెట్టికుక్షినిండ కూడు
కూరుచుకొను । వండి తినెడువాడు వసుధ జండాలుడు ॥వి॥

క॥ నోరెరిగి తామవేవియు నేరని జంతుల జంపినెమ్మది
దిను నా । క్రూరపు సంకరజాతుల మారణమేమందురింక
మహిలో వేమా॥

ఆ॥ తనను బోలెనవియు ధరబుట్టినవికావో । పరగ
దన్ను బోలి బ్రతుకుగాదె జ్ఞానిజ్ఞానిజంప గారణమేమిరా ? ॥వి॥

ఆ॥ పుట్టువుం దెలియనిపురుషాధములుభూమి। బుట్టనేమి
లేక గిట్టనేమి ? పుట్టలోన జెదలు పుట్టవా గిట్టవా ॥వి॥

ఆ॥ చెడ్డవాని మిగుల జెరుచును దైవంబు । అడ్డపడదు
వాని కాపదైన । చెడ్డచేనుజూచి రెడ్డి తా మెచ్చునా ॥విశ్వ॥

ఆ॥ పాపమనఁగ వేరె పరదేశమున లేదు । తాను జేయు పనుల దగిలియుండు । కర్మమునకు గాక కనుగలిగినమోక్ష । బాప భయము లేదు పరగ వేమ॥

ఆ॥ ముష్టి వేపచెట్టు మొదలుగా ప్రజలకు । పరగ మూలికలకు బనికివచ్చు । నిర్దయుండు ఖలుడు నీచుడెందుల కగు? ॥విశ్వ॥

ఆ॥ తనదు బాగుగోరి ధర్మంబుజెప్పిన । దిట్టుచుండు నధము డెట్టయెదుటగ క్షీవేయు పొట్టగొట్టి కొంప నాశ్రమించు ॥విశ్వ॥

ఆ॥ శిలను బ్రతిమ జేసి, చీకటింట బెట్టి మ్రొక్కువల దికను మూఢులార । ఉల్లమందు బ్రహ్మ మున్నదంట దెలి యుడీ ॥విశ్వ॥

ఆ॥ అమలమైన పలుకు లభిషేకవారిధి । తనువు దేవ ళంబు తాల్మినొంది । యాత్మశివుని జేర్చి నాత్రమే శివయోగి ॥విశ్వ॥

జీవకారుణ్య ప్రబోధములగు పద్యములింక ననేకము కలవు.

(22) కాళ్ళుచేతులు ఖండించుచున్నను, పడవేసి చావగొట్టు చున్నను, కోదండము వేసి కొరడాలతో చెండుచున్నను. శూలగ గుచ్చి బెట్టి బాధించున్నను, ఎదిరింపక, ఏ దేశ నాయకుని మంత్రోపదేశమును స్మరించుకొనుచు, ప్రహ్లాదుల వలె ప్రజలు సంచరించినారో,

స్త్రీలను మానభంగము చేయుచున్నను అడ్డమనక, ఏ దేశోద్ధారకుని ఆజ్ఞకు బద్ధులై, పాండవులవలె జనులు వర్తించినారో,

స్థిర చరాస్థులను స్వాధీనపరచుకొన్నను, నోరెత్తక, ఏ ప్రజానాయకుని ఆధారముచూచుకొని, విధేయులవలె భారతీయులు నడచిరో,

ఈడ్చుకపోయి కారాగృహములందు పడవేయుచున్నను భయమొందక, ఏ ప్రజోద్ధారకుని ఈదేశము తలచుకొనుచు, శ్రీకృష్ణ జన్మస్థానముచూచు భాగ్యము లభించుచున్నదికదాయను బ్రహ్మానందముతో ప్రజలెల్ల జైళ్ళ బాధలు ననుభవించిరో,

కనబడినవారిని కనబడినట్లు మరఫిరంగులతో కాల్చి వేయుచున్నను, రోషమొందక ఏదేశరక్షకుని అండచూచి ప్రజలు దేవతలవలె మెలగినారో,

ఏ శాంతమూర్తి విరోధులను కొట్టకుండ తిట్టకుండ, ఆయుధములు పట్టకుండా, శత్రువులెట్టి ఘోరకృత్యము లొనరించుచున్నను, ఎదిరింప, "అహింసా సూత్రమనే అణ్వాస్త్ర ప్రయోగముతో విరోధుల దౌర్జన్యము రూపుమాపి, దాసోహమనిపించి, శత్రువులను పారద్రోలి" స్వరాజ్యమును ఇప్పించెనో,

ఏ సత్యాగ్రహుని సహాయమువల్ల పరదేశరాజుల పరిపాలన రూపుమాపి, భారతీయులు స్వరాజ్యమును సాధించినారో,

ఏ లోకారాధ్యుని మానవసేవకు పరదేశాధిపతులు బుద్ధితెచ్చుకొని భారతీయులకు స్వరాజ్యము నప్పగించిపోయినారో,

ఏ మహాత్ముని దేవదూతగా భావించి, పరదేశాధిపతులెల్లరు పూజించినారో,

ఏ బాపూజీని భగవదవతారముగ తలచి, భారతీయులెల్లరు నిత్య పూజా మహోత్సవము లొనర్చుచున్నారో,

ఏ భారతపిత గుజరాతి దేశమున పోర్బందరను పట్టణములో జైనమతస్థులైన, వైశ్యకుటుంబములో మోహనదాస్ కరంచంద్ నామముతో 1869-10-2 వ తారీఖున జన్మించి, 1881వ సంవత్సరములో కస్తూరిదేవిని వివాహము చేసుకొని, 1893వ సం.రములో దేశసేవలో ప్రవేశించి, 1947-8-15వ తారీఖున స్వరాజ్యము యిప్పించి, రామరాజ్య స్థాపనకై కృషిచేయుచు, 1948-1-30వ తేదీ శుక్రవారము సాయంత్రము న్యూఢిల్లీలో విర్లాభవనము నుంచి ప్రార్థనావేదిక మెట్లను ఎక్కుచు మతోన్మాదుని రివాల్వరు దెబ్బకు హేరామాయనుచు తనదేహ మర్పించెనో,

ఏ త్యాగమూర్తియొక్క అస్థికలను భారతదేశములోని రాష్ట్రాధిపతులెల్లరు దారిపొడుగునా బ్రహ్మాండమైన మహోత్సవము లొనర్చుకొనుచుతీసుకువెళ్ళి హిందూదేశములోని సమస్త నదులందు శాస్త్రోక్తముగ స్థాపించి, అతి పవిత్రముగా నొనర్చినారో,

అటువంటి బాపూజీయగు గాంధిమహాత్ముడు మూగజీవుల బాధలు చూపుచూపనోరి, 'జీవబలుల నివ్వవద్దు, మూగజీవులను చంపవద్దు, మాంసము తినవద్దు, జీవులన్నిటిని నీవలె

చూపుకొను' మని బోధించినట్టి జంతురక్షణ ప్రబోధముల నైన ఆలకించి, జంతురక్షణ దీక్షలో వర్తించి. మానవేతర జీవులనుగూడ బాధించువారు మానవులలో లేరను ఖ్యాతిని గడింతురుగాక! దేశ క్షేమమునకై గాంధీమహాత్ముడు బోధించినట్టి సూత్రముల నాచరింపనివారు భూలోకములోని 'స్వర్గసౌఖ్యములను' త్రోసివేయుచున్నవారుగా ఎంచబడు దురు. భూలోకములోని 'ఇంద్రభోగము'లనుభవించువారెల్లా ఈ క్రిందిపద్ధతులాచరింప ప్రజలెల్లరు తీవ్రమైన కృషి చేయాలి.

(1) రాకపోకల సౌకర్యములకు ఎలాంటిఆటంకములు లేకుండ, ముఖ్య రహదారులను ఏ గ్రామమునకు సంబంధించిన రహదారిని, ఆయా గ్రామపౌరులు సిమెంటురోడ్లుగా మార్చుకోవలెను. (2) ప్రతిగ్రామమునకు గ్రామ బస్సు సర్వీసు ఏర్పాటుచేసుకోవలెను. (3) ప్రతి జిల్లాకు ముఖ్య పట్టణములో, ఆయాపట్టణములవారు విమానసర్వీసును స్థాపించాలి. (4) ఎవరి యింటిముందుకల బజారును ఆయా గృహాధిపతులు సిమెంటుగచ్చుగా చేసుకోవలెను, (5) విద్యుచ్ఛక్తి దీపములు లేనట్టి ఇండ్లు, బజార్లు వుండరాదు. (6) చెరువులను పంటచెరువులుగా చేసుకోవలెను. నీరుపారుదలగాని భూములకు యంత్రములద్వారా నీరు పారుదలగావించాలి. (7) వైద్యశాల, ప్రసూతిశాల, పశుపోషణశాల, యోగాశ్రమము, తపోమందిరములు. సకలార్థ సహకారాదిసంఘములు స్థాపించాలి. (8) పాడిపంటలు, వైద్యశిక్షణ, స్త్రీ

వర్తన పరిశీలన, యోగ తపోబలాది ప్రదర్శన పోటీలు, ప్రతి సంవత్సరము జరుపవలెను. అవి ఇవి యననేల ఆయా గ్రామములలోని పౌరులందరు కలసి ఎవరి శక్తికొలది వారు శ్రమ, ధన, ధాన్య దానములను సరిసగా వినియోగించి, తమ గ్రామములకు కావలసిన సమస్త సౌఖ్యములను స్వశక్తితో, సాధ్యమైనంత త్వరలో ఏర్పాటుచేసుకొనవలెను. ఈ కార్య క్రమమును మీరెంత త్వరలో ఏర్పాటు చేసుకొనెదరో, అంత త్వరలో భూలోకములోని దివ్యభోగములను వినియోగించుకొనగల జ్ఞానమును తెలుసుకొని, త్వరలోనే అనుభవమును తెచ్చుకొన్నవారుగా ఎంచబడుదురు. మీ గ్రామ క్షేమమును మీరు చూచుకొననియెడల ఎవరో పరాయివారు వచ్చి, మీకు సౌఖ్యములు కల్పించుట కల్ల. ఒకవేళ కల్పించినను మీ సౌఖ్యములకై నిర్ణయింపబడిన ధనములో సగమో ధనమునో ఖర్చుపెట్టి మిగిలిన ధనమును అపహరించు వారే మీవద్దకు వచ్చెదరు. గాన ఎవరి గ్రామమును వారు స్వయంపోషక గ్రామములుగా తయారుచేసుకోవాలి.

దేశాధిపతులు నిర్వహించవలసిన సేవలు:—

(1) తన దేశములో సరు వారువలలేని పొలము, వైద్యశాల, బస్సు సర్వీసు, పోస్టాఫీసు, విద్యుచ్ఛక్తి లేని గ్రామము ఉండరాదు. (2) విద్యుచ్ఛక్తి, రైల్వే టెలిఫోనాది లైనులలోనున్న గ్రామములన్నిటికి వాటి ఉపయోగములను వెంటనే ప్రవేశపెట్టవలెను. (3) బస్సు, రైల్వే, విమానటూట్లను కోరువారికి కోరునన్నిటూట్లను, కొన్ని పర

తులమీద యిచ్చివేసి, ఎలాంటిలోపము లేకుండ, విరివిగా ప్రయాణ వసతులను కల్పించవలెను. భారత దేశములోని ప్రయాణమునకు ఎన్నివందల మైళ్ళు దూరమైనను ఒక గంట కాలములో చేరగల ఏర్పాట్లుండవలెను. ప్రతిజిల్లాలో ముఖ్యమైనపట్నములకు విమాన సర్వీసులుండవలెను. (4) హిందూ దేశములోని ఉదయముపూట టపాలు సాయంత్రమునకును, సాయంత్రము టపాలు ఉదయమునకును అన్ని గ్రామములకు బట్వాడా కావలెను. (5) పంచాయితీబోర్డువారు ప్యాసు చేసిన బడ్జెట్టులన్నియు, ఏ అధికారియొక్క అంగీకారముతో నిమిత్తము లేకుండనే సదరుబడ్జెటు తాలూకు పనులన్నియు వెంటనే నిర్వహించుటకు అధికారముండవలెను. ధనమును సక్రమముగ వినియోగించినది లేనిది తనిఖీచేయుటకుమాత్రమే పై అధికారులకు హక్కుండవలెను.

(5) ప్రతి ఫిర్కాలో వైద్యశిక్షణ శిబిరము నెలకొల్పి మాతృభాషలో వ్రాయ, చదువగలవారందరికి నాడీజ్ఞానము, ఇంజక్షన్లు, సాధారణ శస్త్రచికిత్సలు, ఔషధ ప్రయోగములు, ఔషధములు తయారుచేయు విధానములు, నేర్పాలి. హైస్కూలువిద్య పూర్తిఅయ్యేలోపల విద్యార్థులందరిని వైద్య శిక్షణలోగూడ తర్ఫీదు చేయవలెను.

(6) వయస్సుతో, స్కూలుచదువుతో, కాలవ్యవధితో, అగత్యములేకుండ, పబ్లికుపరీక్షలన్నిటికి, పాల్గొనదలచేవ్యక్తులందరికి అవకాశములుండవలెను, పరీక్షలో జయముగాంచిన వారికి వయసుతో నిమిత్తములేకుండనే (60 సంవత్సరములు

దాటినవారికికూడా కొన్ని సంవత్సరములవరకు వారికి తగిన ఉద్యోగములివ్వవలెను. మాతృభాషను చదువుట. వ్రాయుట వీలైనంత త్వరలో ప్రజలకు నేర్పాలి.

(7) సత్ర్పవర్తక పరిశీలన, యోగ తపోబలాది ప్రదర్శన పోటీలు ప్రతి సంవత్సరము ఏర్పాటు చేయవలెను. పోటీలో పాల్గొనదలచే వ్యక్తులకు కావలసిన సమస్త వసతులను ఉచితముగా ఏర్పాటు చేయవలెను. నూటికి యాభై మందికి సాధారణబహుమతులను, పదిమందికి గొప్పబహుమతులను యివ్వవలెను. దీనిలో ఖ్యాతిగాంచినవారిని ముఖ్యముగ జడ్జిపదవులకు నియమించవలెను. ఈపోటీలను అభివృద్ధి చేయుటకు దేశాధిపతులెల్లరు తీవ్రమైన యత్నము చేయవలెను. దేశరక్షణకు ఈస్కీము ప్రాణమువంటిది. ఈ ప్రణాళిక అమలుజరుగుతున్న దేశములకు ఎలాంటి ప్రమాదములు రావు. ఈస్కీముగల దేశమును జయింపగల శక్తి త్రిమూర్తులకైనా లేదు.

(23) మహారాష్ట్రమున కోలాబాజిల్లా, గాగోదా గ్రామములో 1895వ సం. సెప్టెంబరు 11వ తారీఖున జన్మించి 1921వ సం.లో సత్యాగ్రహ దీక్ష గైకొని, 1951 సం. లో ఏప్రిలు 18వ తారీఖున నల్లగొండజిల్లా, పోచంపల్లి గ్రామములో శ్రీ వెదిరి రామచంద్రారెడ్డిగారు ఇచ్చిన వంద ఎకరముల భూదానముతో, భూదాన యజ్ఞమును ప్రారంభించి, ఇండ్లులేనివారికి ఇండ్లు, భూములు లేనివారికి భూములు, ఇచ్చుచు, గ్రామరాజ్యమును స్థాపించుకొనవలెనని ప్రజలకు

సుఖము లభించదని బోధించుచు, 1957సం జులైవరకు 45 లక్షల ఎకరాలు భూదానమును, మూడువేల గ్రామదానము లను, సమర్పించి, (శ్రీ) వామనావతారమువలె సంచరించుచు "జంతువులకుకూడా ప్రాణమున్నది, వాటినికొట్టినా, వాటికి కష్టము కలిగించినా, వాటి ముఖములో కనబడగలదు. మాంసము తినడము మంచిదా చెడ్డదా అనునది వాటినే అడుగవలసియున్నది. మాంసము తినడం మంచిదికాదని" హెచ్చరించుచున్నట్టి 'ఆచార్య వినోబావారి' సందేశమైనా ఆలకించి, ప్రజలెల్లరు మాంసభక్షణ నిషేధన దీక్షనోవర్తిం చాలి. వీరు బోధించుచున్నట్టి సర్వోదయ సిద్ధాంతములను ఆచరింపకున్న విప్లవము రాకతప్పదు.

జంతురక్షణగూర్చి ప్రబోధము లొనర్చిన మహాత్ము లింక నెందరో గలరు.

(24) మాంసాహారమే ప్రధానముగ ఉంచుకొను యూరపు, అమెరికా మొదలగు దేశములలోకూడా "పశు పక్షి మృగాదులను చంపరాదు. వేటాడరాదు. నిన్ననీ వెట్లు ప్రేమింతువో యట్లే ప్రాణులన్నిటిని ప్రేమించండని" సెయింట్ ఆంటోని, సెయింట్ అగస్టిన్ డిట్రాయిప్, సెయింట్ కత్ బర్డ్, సెయింట్ అంద్రేడిసేని, సెయింట్ జిలోమ్ ఫిక్రూక్, సెయింట్ గైల్సు, సెయింట్ ఫ్రాన్సిసు, మొద లగు ఫాదరీ లెందరో ప్రచార మొనర్చినవారు కలరు.

మాంసాహారము "మూత్రకోశములకు, పిత్తాశయము నకు, రక్తపు పారుదలకు, హృదయకోశమునకు విపరీతమైన

ఏ కరుణానిధి! ప్రతిరోజు మత్స్యములకుగూడ షడ్రసోపేతముగ భోజనముపెట్టి పోషించుచుండెనో,

ఏ మహాధిపతి మీనములకుగూడ ఆభరణములు చేయించి వాటికి అలంకార మొనరించుచుండునో,

ఏ మహనీయుని పిలుపు ఆలకించిన వెంటనే, చేపలు గుంపులు గుంపులుగా ఒడ్డుకువచ్చి, ఆశీర్వచనమునగావుండి, సెలవిచ్చువరకు వేచియుండునో,

ఏ మహోత్సాహుడు తనను దర్శించుటకు వచ్చుచున్న నాగుబాములగూడ స్వాగతమిచ్చి, వాటికి పాలుపండ్లు ఆరగింపుచేసి, 'మీరు ఇచ్చట తిరుగవద్దు. ఎవరికి హానిచేయక మీ నివాసములకు పొండని" పంపించుచుండునో,

ఏదితాపసుడు! తపస్సుచేయుటయందే సంవత్సరములో పది నెలల కాలము వినియోగించుచుండునో,
అటువంటి లోకపూజ్యులైన శృంగేరీ పీఠాధిపతులగు నేటి 34వ శ్రీ జగద్గురు శంకరాచార్యులవారి ఆదేశమైనా విని ప్రజలు భూతదయతో వర్తింతురుగాక.

అన్ని దేశములకంటె మించిన సిరి సంపత్తులతో విరాజిల్లునట్టి దేశమును, అందు జన్మించువారెల్లా అహింసా తత్వముతో వర్తించుచు, అన్ని ధర్మములకు ఆదర్శమూర్తులుగా ఉండునట్లును, ఋషులు శాసించిన నియమములతో సంచరించువారు, అణ్వాస్త్రాలు, హైడ్రోజను బాంబులు మొదలగు వాటివల్ల ఏ బాధపొందక, పంచభూతములను తన ఇష్టప్రకా

రము సహపించుచు, అష్టసిద్ధులతో తన యిష్టమొచ్చినంత కాలము జీవించునట్లును, అధర్మపరులు అభివృద్ధి చెందిన సృష్టిని ప్రళయము సంభవింపజేయగల ఒక దేశమును మహా ఋషులు సృష్టింపదలచి. వారి తపోబలముచే భారతదేశమును స్థాపించారు. ఇందు జన్మించువారికి "సత్యవర్తకులని, పూజింపతగినవారని, హింసకు దూరముగా వుండువారని, అర్థము ఇచ్చేటట్లుగా" ఆర్యులని, హిందువులని మొదలగు నామకరణము లొసగినారు. "స్వర్గాదిలోకములకును, మోక్షమునకును సాధనమగుచున్న భారతదేశమందు వర్తించెడు ప్రజలేకదా పుణ్యాత్ములని" చెప్పుకొనుచు, భరత ఖండమునందు బుట్టుభాగ్యము మనకెన్నడు లభించునాయని. దేవతలు సర్వదా కోరుచుందురు. ఇటువంటి పవిత్రమైన దేశములో జన్మించి, అస్థిరమైన ఈ దేహమును పోషించుటకు సత్యపదార్థము లెన్నియోయుండ, వాటితో తృప్తి చెందక, ఘాతుక కృత్యములతో జీవజంతువులను వధించి, వాటిమాంసములతో పొట్టనింపుకొనుట ఎంతటి హేయమైన కృషియో బాగా ఆలోచించుకొనుడు. శ్రీరామ, ధర్మరాజాదులు పాలించిన దేశములకు అధిపతులైకూడ వారిమార్గము ననుసరింపక, కోళ్ళ, మత్స్యాది పరిశ్రమలను నెలకొల్పుచు, మాంస సంపద నభివృద్ధిచేయ నేటి దేశాధిపతులు ప్రవేశపెట్టుచున్న ప్రణాళికలు అద్భుతమైనవేయని చెప్పుకోవచ్చును.

అహింసాయుత మార్గమువల్లనే భారతదేశము అన్ని దేశములందు ప్రాముఖ్యత గడించుచున్నది. మన పూర్వుల

ప్రబోధములలోని సూక్ష్మధర్మములను తెలుసుకొనినచో, ఇతర దేశములలోనివారు అనేకమంది 'జంతుహింస లోనగునవి అధర్మమనియు, మాంసభక్షణ హేయమనియు' తలచి నిషేధించుచున్నారు. పరదేశస్థులు 'మనపూర్వులు హెచ్చరిక లనుచూపి' మనలను పరిహాసముచేయరాదను విషయము మరువరానిది.

క్రూరకృత్యముల నివారించునట్టి శాసనాధికారులైన దేశాధిపతులు 'మాంసభక్షణ నిషేధన ఆజ్ఞనైనా ప్రవేశ పెట్టి మూగజీవుల బాధలుకూడా పాటించులుటకు తగిన యత్నములు చేయుచున్నారేగాని, మహాత్ముల సందేశము ధిక్కరించువారు దేశాధిపతులలో ఇంతవరకు జన్మించలేదని దాఖలా చూపింతురుగాత.

అనాదినుంచి నేటివరకు మహనీయుల తీర్పులనుపాటించుచున్నవారును, మూగజీవుల క్షేమనుకూడా భంగమొనర్పనివారును, మాంసాహారములో నిమిత్తము లేకుండనే ఘనగంతసత్త్వముతో జీవించుచున్నవారును, "భారతీయులుతప్ప మరెవ్వరు లేరని" అన్ని దేశములవారిచేత నుతింపబడుచున్న భారతజాతియొక్క పేరుప్రతిష్టలకు భంగమురాకుండ భారతీయులు వర్తింతురుగాత.

నేటి ప్రజా ప్రభుత్వమువారి పతాకములో "ఏనీతి బోధించుటకై తెలుపురంగును ఛాయపరచినారో, ఏ నియమమును హెచ్చరించుటకై అశోకచక్రము స్థాపించినారో, అటువంటి సందేశములను పాటించుటకు మాంసభక్షణ నిషే

ధన శాసనమైనా" అమలుజరుపవలసిన బాధ్యత నేటి గవర్న మెంటువారికి కలదని గ్రహింతురుగాత.

(1) కఠినమనస్సులేదని చెప్పుకొనేరెవాళ్లా పశువులనుబాధించి పనులు చేయించరాదు.

(2) తగాదాబుద్ధి లేదని నిరూపించదలచువారెల్లా కోళ్ళ, పొట్టేళ్ళ పందెములు వేయరాదు.

(3) ద్రోహబుద్ధిలేదని దృష్టాంతము చూపదలచువారెల్లా భక్షణకై పశుపక్ష్యాదులను పెంచునట్టి పద్ధతిని తీసివేయాలి.

(4) విశ్వాసహీనులము కామని ఋజువుచేయదలచువారెల్లా, పశువులకు స్వభావ మరణము కలుగునంతవరకు వాటిని పోషించాలి.

(5) కృతఘ్నులము కామని నిదర్శనము చూపదలచువారెల్లా, పశువులను కసాయివారికి యివ్వరాదు.

(6) నిర్దయులము కామని దాఖలా చూపదలచువారెల్లా, పశు పక్ష్యాదులను వధించునట్టి పద్ధతిని వర్జించాలి,

(7) తామసాహారులము కామని తార్కాణముచూపదలచువారెల్లా, మాంసమును తినరాదు,

ఈమాత్రపు నియమములైనా ఆచరించనివారు అష్టైశ్వర్యములతో తులతూగు పదవినిప్పింపగల మార్గమును త్రోసివేయుచున్నవారగుదురు.

అనేక జన్మములందు పుణ్యఫలముచేతనే మానవజన్మ లభించుచున్నదనియు, అన్ని జన్మలకంటె మానవజన్మ శ్రేష్ఠమైనదనియు, శ్రేష్ఠమైనజన్మలు పొందకృషిచేయుడని బోధించుటకే మానవజన్మ వచ్చినదనియు, శాస్త్రములన్నియు సకమై హెచ్చరించుచున్నవి.

కష్టసుఖములు తెలిసినట్టి మానవజన్మఎత్తి, వర్తించుటకు అవకాశము కలిగినట్టి పాపకృత్యములనైనా విడనాడని వారు మరల మానవజన్మకు రాగల హక్కును కోలుపోయినవారగుదురు.

జంతురక్షణ ప్రచారముచేయు నుద్దేశముతో బుద్ధ భగవానుని జీవకారుణ్య భావములనుమాత్రమే ఆధారముగ తీసుకొని ఈ బుద్ధచరిత్ర వ్రాయబడినది.

ఇందలి తప్పులనువిమర్శింపక, భావములనుమాత్రమే గ్రహించి, జంతురక్షణ ప్రచారమునకు తోడ్పడి, ఈ గ్రంథమాలవారి ముఖ్యోద్దేశముల నెరవేర్ప, తగిన ప్రోత్సాహమివ్వగలందులకు ప్రజలందరిని ప్రార్థించుచున్నాను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

నిత్యం సర్వజీన స్సుఖినో భవంతు.

నిత్యం సమస్త మంగళాని భవంతు.



ఈ గ్రంథమాలలోని గ్రంథములకు ఇచ్చిన

# అభిప్రాయములు

1. జీవరక్షణ గ్రంథము గూర్చిన అభిప్రాయములు:—

జీవహింస అత్యంత పాపహేతువని ఈ గ్రంథమునందనేక విధములు ఉద్ఘాటింపబడినది. వ్యక్తిగతముగను, సాంఘికముగను జాతీయముగను జీవహింస నష్టదాయకమని సకారణముగ స్పష్టీకరింపబడినది. యీ కాలములో ఇట్టి ప్రచురణ లత్యంత అవసరము. జిహ్వాచాపల్యమునకులోనై, మాంసపు నిషాలో పడియున్నవారికిట్టి గ్రంథములు కొరడా దెబ్బలవలె చురుకు పుట్టించి యదార్థమును గుర్తింపజేయును.—

శ్రీ రామనామక్షేత్రము, గుంటూరు — మోక్షసాధని పత్రిక

జీవకారుణ్యము గురించి తేటతెల్లముగ వచనకావ్యముగా వ్రాయబడినది. ఎట్టి రాతిగుండె కలిగినవారి హృదయముగూడ కరగులాగున, గ్రంథకర్త లోతైన భావములతో వ్రాసియున్నారు. యివి రాజకీయవేత్తలకు, పండితులకు, సాధువులకు, రైతులకు, జీవదయాపరులు మొదలగు వారందరికిన్ని చాల ఉపయోగకరమైనవి.

ఏర్పేడు పోస్టు, చిత్తూరు జిల్లా — యథార్థ భారతి పత్రిక, శ్రీ వ్యాసాశ్రమము

ఇందలి ప్రబోధములు గొప్పవి. పురాణేతిహాసముల నుండియుకూడ, ఎన్నియో ఉదాహరణలు తీసికొనబడినవి. ప్రతి వ్యక్తియు చదువతగినది.—

ప్రకృతి కార్యాలయ ట్రస్టు — ప్రకృతి పత్రిక, బెజవాడ.

2. హితోపదేశ గ్రంథమునుగూర్చిన అభిప్రాయములు:-

పద్యములు రసవంతములై హృదయముల కదలించు సరళ శైలిలో వ్రాయబడినవి. ఈ మండలి ఆంధ్ర దేశమున మంచికృషి చేయుచున్నది. ఈజీవరక్షణమండలికి యథాశక్తి రచయితలు, శ్రీమంతులు తోడ్పడవలసియున్నది.—

ఆంధ్ర సారస్వత పరిషత్తు } సుజాత పత్రిక
హైదరాబాదు (డక్కన్)

మహాత్మా గాంధిగారి ఆశయాలలో అహింస పునాది వంటిది. దాని శాఖలైన జీవకారుణ్యాది రూపాలలో మహాత్ముడు విశేషశ్రద్ధవహించాడు. గ్రంథకర్త ఈ భావాలను సులభశైలిలో హృదయంగమైన పద్యాలలో రచించి మహోపకారంచేశారు.

బకింగ్‌హామ్‌పేట } విజయవాణి పత్రిక
విజయవాడ

ఈపుస్తకములో అహింసాప్రబోధాత్మకమగు పద్యాలను ప్రకటించినారు. ఈ పుస్తకమును చదివినచో కొందరికైనను కనికరము రాగలదని మా నమ్మకము.—

కోయిలకుంట్ల } వయోజన విద్య పత్రిక
కర్నూలు జిల్లా

దీనియందు జీవకారుణ్యమును గురించియు, సదాచారమును గురించియు, బాగుగా చర్చింపబడినది. కఠిన హృదయములకు కరుణకల్గి మనస్సు కరగుటకు యిది ఎంతయో ఉపయోగపడును.

వక్కేపు పోస్టు,
చిత్తూరు జిల్లా.

యధార్థ భారతి పత్రిక.
శ్రీ వ్యాసాశ్రమము.

ఇందు జంతు హింసనువీడవలసినదిగ జంతువులు ప్రార్థించు చున్నట్లు చక్కని పద్యములు వ్రాయబడినవి.

ప్రకృతి కార్యాలయ ఆఫీసు
విజయవాడ.

ప్రకృతి పత్రిక.

ఇందు నోరులేని జీవులు, స్వార్థపరులగు మానవులచే పడు బాధలను సుందరముగ వర్ణింపబడినవి. జీవహింసకుల హృదయములు కరుగునట్లు పద్యములు వ్రాయబడినవి.

పిడుగురాల
గుంటూరు జి॥

రామ దర్శనం పత్రిక.
శ్రీ రామతీర్థ సేవాశ్రమం.

## బుద్ధ చరిత్రము గ్రంథమునకు వచ్చిన అభిప్రాయములు.

శ్రీ బుద్ధ భగవానుని జీవకారుణ్య మహోపదేశములిందు కడు రమ్యముగ బొందుపరుపబడినవి. ఎట్టి రాతివంటి కఠిన మనస్సు గలవారి హృదయమును గూడ కరుగు లాగున

గ్రంథకర్త గంభీరమైన భావములను, కడు లలితముగా కథారూపమున జూపియున్నారు. అహింసా ప్రబోధాత్మకమగు ఈ గ్రంథమును ఆర్యులాదరించెదరుగాక.

ప్రొద్దుటూరు, కడప జిల్లా. — రేనాడు పత్రిక.

ఈ బుర్రకథ అహింసా ప్రచారంకోసం రచించబడినది. సామాన్య ప్రజలలో ప్రచారానికి బాగా ఉపయోగపడును.

ఆంధ్ర ప్రభ.—

ఇయ్యది బుద్ధదేవుని చరిత్రతోబాటు అహింసా ప్రబోధమునుగూడ విశేషముగ జేర్చి మూగజీవుల పక్షమున వ్రాయబడె. అమితదుఃఖలపాలైయున్న వాటి బాధలన్నిటిని వీలైనంత వరకు సులభశైలిలో మూఢులకు సైతము, వారి వారి దుష్టచేష్టలు స్పష్టముగ అర్థముచేసుకొనగలుగునట్లు శ్రీ నిమ్మరాజు చిన వెంకటేశ్వర్లుగారు ఈ గ్రంథమున పొందుపరచియున్నారు. పాఠక మహాశయులకు ఎంతో ఉల్లాసమును, నీతిని గలిగించుటకు ఈ గ్రంథమెంతయో సహాయకారిగానున్నది. గాన చదువరులెల్లరు ఈ ప్రచారమున తోడ్పడి యీ యుద్యమమును కొనసాగింతురుగాక. ఎక్కువశ్రమతో, నీతితో జరుగవలసిన కార్యక్రమమును తలపెట్టిన శ్రీ వెంకటేశ్వర్లుగారికృషిని సఫలీకృతమొనరించుటకు దేవుని వేడుచున్నాను.

ఎనమదల పోస్టు, వయా మార్టూరు, గుంటూరు జిల్లా — భగవన్నుతి పత్రిక. చింతపల్లిపాడు.

భూపతిరాజు లక్ష్మీనారాయణరావుగారు 10
విజయవాడ

కొత్తపల్లి వెంకయ్య నాయుడుగారు 10
జునమదల, నర్సరావుపేట తాలూకా

దొడ్డా సీతారామాంజనేయులునాయుడుగారు 10

ఆత్మకూరి నాగభూషణంగారు 10
చైర్మన్, నంద్యాల.

కొల్లూరి చిన వెంకటరత్నంగారు 10
చైర్మన్, అమలాపురం.

నూలి వెంకట సుబ్రహ్మణ్యం జమీందారుగారు 10
పెనుగొండ, తూర్పుగోదావరి జిల్లా.

ద్వారంపూడి సుబ్బిరెడ్డిగారు 10
గొల్లలమామిడాడ, తూర్పు గోదావరి జిల్లా.

పోలిశెట్టి నారాయణరావుగారు 10
ఏలూరు. ప. గో. జిల్లా

(శ్రీ) మద్ది సీతారామయ్యగారు, అనంతవరం. 6

(శ్రీ) కొలసాని జనార్ధనముచౌదరిగారు, యనమదల 5

(శ్రీ) ఆళ్ళ రంగయ్యచౌదరిగారు 5

(శ్రీ) దొడ్డా నరసింహారావుచౌదరిగారు 5

(శ్రీ) అసగా నరసింహముగారు 5
వామనపాలెం, వినుకొండ తాలూకా

(శ్రీ) బొండాడ వెంకటలక్ష్మీనరసింహస్వామిగారు 5
కౌన్సిలర్, పాలకొల్లు, ప. గో. జిల్లా

(శ్రీ) పోలిశెట్టి సత్యనారాయణరావుగారు, విజయవాడ 5

(శ్రీ) పిసుపాటి పిచ్చయ్యశాస్త్రిగారు 5
ఇంకొల్లు. గుంటూరు జిల్లా

| | |
|---|---|
| శ్రీ ఆకుతోట వెంకటరెడ్డిగారు<br>మారామునగాల, అలంపురం తాలూకా | 5 |
| శ్రీ గోళ్ళమూడి వెంకటరామయ్యగారు<br>రైల్వే ఔట్ఏజన్సీ మాష్టరు, చిలకలూరిపేట | |
| శ్రీ సాగి సూరయ్యగారు, తణువుళ్ళ<br>కాకినాడ తాలూకా | 5 |
| శ్రీమతి వాశిరెడ్డి శత్రుఘ్నుడుగారి భార్య మంగమ్మగారు<br>పెదపాలెము, తెనాలి తాలూకా | 5 |
| శ్రీ యనమదల గోపయ్య కు॥ బ్రహ్మయ్యగారు<br>తన తల్లియైన శేషమ్మగారి జ్ఞాపకార్థం యిచ్చినది<br>రేమల్లెగ్రామం. కృష్ణాజిల్లా | 3 |
| శ్రీమతి నల్లపట్ల భూపతయ్యగారి భార్య వెంకటమ్మగారు | 3 |
| శ్రీమతి నాగులపల్లి సుబ్బయ్యగారి భార్య<br>నరలక్ష్మమ్మగారు | 3 |

## జీవరక్షణ ప్రచారక గ్రంథమాలవారి గ్రంథరాజములు.

| | | | |
|---|---|---|---|
| శ్రీ బుద్ధ చరిత్ర వచనం | ... | ... | 2—8—0 |
| శ్రీ బుద్ధ చరిత్ర బుఱ్ఱకథ | ... | ... | 0—12—0 |
| హితోపదేశము. పద్యములు | ... | ... | 0—8—0 |
| జీవరక్షణం. వచనం | ... | ... | 0—8—0 |

కఠినమనస్సునుగూడా కరగించి సత్పథమున నడపింపగల గ్రంథరాజములు. వివరములకు ఈ క్రింది అడ్రసుకు వ్రాయవలయును.

మేనేజరు.
జీవరక్షణ ప్రచారక గ్రంథమాల.
అనంతవరము. :: నర్సరావుపేట తా॥
గుంటూరు జిల్లా.



# విరాళముల తరగతులు.



1. అహింసా ప్రతిష్ఠాపకులు రు 2116 లు, యీధనముతో జంతు కారుణ్యకథను టాకీ ఫిలుములో తీయించబడును. ఫిలుములో దాతలను చూపబడును.

2. జీర్ణోద్ధారకులు రు 1116 లు. ఈధనముతో గ్రామఫోను రికార్డు తీయించబడును. రికార్డులలో దాతల పేర్లు చెప్పబడును.

3. ప్రాణి రక్షకులు రు 516 లు. యీ ధనముతో మోటారువ్యాను కొనబడును.

4. ఆదర్శకులు రు 316 లు. యీ ధనమును గ్రంథముల ప్రకటనకు, పత్రిక ప్రకటనకు, రచన, ప్రదర్శన పోటీ బహుమతులకు వినియోగించబడును. యీప్రకటనలో దాత చెప్పిన ప్రకటనను, దాత పేరుతో ఒకసారి ప్రకటించబడును.

5. అనాథ రక్షకులు రు 156 లు. 6. పోషకులు రు 116.
7. ఆపద్బాంధవులు రు 56 లు. 8. అభయదాతలు రు 25 లు.
9. ప్రోత్సాహకులు రు 12 లు. 10. ప్రవేశకర్తలు రు6 లు
11. శ్రేయోభిలాషులు రు 3 లు.

మరా;- 1, 2, 3, 4, 5, 6, నెంబర్లలోని దాతల ఫోటోలు ప్రతి గ్రంథములోను, ప్రతి సంవత్సర రిపోర్టులలోను, ప్రకటించబడును. ఫోటోబ్లాకులు పంపవలయును. రు 6 లు తక్కువగాని విరాళములిచ్చు దాతల పేర్లు ఒకసారి గ్రంథములలో ప్రకటించబడును. 0-8-0 కు తక్కువగాని ధర్మములిచ్చువారి పేర్లు సంవత్సర రిపోర్టులలో ఒకసారి ప్రకటించబడును.

## జాస్తి వేంకట నరసయ్య,
## ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యముగార్ల
## జాతీయ రచనలు

---

**కాంగ్రెసు విజయము** (చరిత్రాత్మక నాటకము) 1-0-0

డాక్టర్ పట్టాభి వంటి ఆంధ్రనాయకుల ప్రశంస లందినది

"60 ఏండ్ల కాంగ్రెసు చరిత్రలోని ప్రధానఘట్టాలు - సంస్కరణాంకము, సంపూర్ణ స్వరాజ్యాంకము, ప్రజావిప్లవాంకములుగా చిత్రింపబడిన నాటక మిది. - భారత స్వాతంత్ర్య సమర చరిత్రను ఈ విధంగా నాటకరూపంలో వ్రాయడానికి జరిగిన తొలిప్రయత్నమే కాదు ఇది- ఘనప్రయత్నంకూడా. ఈ రచయితలు ఇరువురు గొప్ప పండితులు. దేశభక్తులు. వీరి రచన-శైలి - పద్యాలు - గేయాలు హృద్యంగాగంభీరంగా ఉన్నవి" —ఆంధ్రప్రభ

**ప్రజారాజ్యము** (సామ్యవాదనాటకము) పలుచోట్ల ప్రదర్శింపబడినది.
**ఉపాధ్యాయుడు** (ఏకపాత్రనాటిక) } 1-0-0

"ప్రజా రాజ్యం కలముతోటిగాక హృదయముతోటి రాసిననాటకము. ప్రస్తుతం దేశానికి యిలాటి నాటకప్రదర్శనములేకావలసినవి." — మాధవపెద్ది వెంకట్రామయ్య

శ్రమజీవుల కడగండ్లు జమీందారుల దౌష్ట్యములు మొదలగు విషయాలుగలవు. సామ్యవాద సమాజాన్ని స్థాపించుటకుప్రజల నెట్లుచైతన్యవంతులను చేయాలోకూడ స్పష్టంగా



# విరాళముల తరగతులు.



1. అహింసా ప్రతిష్ఠాపకులు రు 2116 లు, యీధనములో జంతు కారుణ్యకథను టాకీ ఫిలుములో తీయించబడును. ఫిలుములో దాతలను చూపబడును.

2. జీర్ణోద్ధారకులు రు 1116 లు. ఈధనములో గ్రామఫోను రికార్డు తీయించబడును. రికార్డులలో దాతల పేర్లు చెప్పబడును.

3. ప్రాణ రక్షకులు రు 516 లు. యీ ధనములో మోటారువ్యాను కొనబడును.

4. ఆదర్శకులు రు 316 లు. యీ ధనమును గ్రంథముల ప్రకటనకు, పత్రిక ప్రకటనకు, రచన, ప్రదర్శన పోటీ బహుమతులకు వినియోగించబడును. యీప్రకటనలో దాత చెప్పిన ప్రకటనను, దాత పేరుతో ఒకసారి ప్రకటించబడును.

5. అనాథ రక్షకులు రు 156 లు. 6. పోషకులు రు 116. 7. ఆపద్బాంధవులు రు 56 లు. 8. అభయదాతలు రు 25 లు. 9. ప్రోత్సాహకులు రు 12 లు. 10. ప్రవేశపణకర్తలు రు 6 లు 11. శ్రేయోభిలాషులు రు 3 లు.

మరా;- 1, 2, 3, 4, 5, 6, నెంబర్లలోని దాతల ఫోటోలు ప్రతి గ్రంథములోను, ప్రతి సంవత్సర రిపోర్టులలోను, ప్రకటించబడును. ఫోటోబ్లాకులు పంపవలయును. రు 6 లు తక్కువ కాని విరాళములిచ్చు దాతల పేర్లు ఒకసారి గ్రంథములలో ప్రకటించబడును. 0–8–0 కు తక్కువగాని ధర్మములిచ్చువారి పేర్లు సంవత్సర రిపోర్టులలో ఒకసారి ప్రకటించబడును.

## జాస్తి వేంకట నరసయ్య, ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యముగార్ల

## జాతీయ రచనలు

---

**కాంగ్రెసు విజయము** (చరిత్రాత్మక నాటకము) 1–0–0

డాక్టర్ పట్టాభి వంటి ఆంధ్రనాయకుల ప్రశంస లందినది.

" 60 ఏండ్ల కాంగ్రెసు చరిత్రలోని ప్రధానఘట్టాలు – సంస్కరణాంకము, సంపూర్ణస్వరాజ్యాంకము, ప్రజావిప్లవాంకములుగా చిత్రింపబడిన నాటక మిది. – భారత స్వాతంత్ర్య సమర చరిత్రను ఈ విధంగా నాటకరూపంలో వ్రాయడానికి జరిగిన తొలిప్రయత్నమే కాదు ఇది– ఘనప్రయత్నంకూడా. ఈ రచయితలు ఇరువురు గొప్ప పండితులు. దేశభక్తులు. వీరి రచన–శైలి – పద్యాలు – గేయాలు హృద్యంగాగంభీరంగా ఉన్నవి" —ఆంధ్రప్రభ

**ప్రజారాజ్యము** (సామ్యవాదనాటకము) పలుచోట్ల ప్రదర్శింపబడినది.
**ఉపాధ్యాయుడు** (ఏకపాత్రనాటిక)
} 1–0–0

"ప్రజారాజ్యం కలముతోటిగాక హృదయముతోటి రాసిననాటకము. ప్రస్తుతం దేశానికి యిలాటి నాటకప్రదర్శనములేకావలసినవి." — మాధవపెద్ది వెంకట్రామయ్య

శ్రమజీవుల కడగండ్లు జమీందారుల దౌష్ట్యములు మొదలగు విషయాలుగలవు. సామ్యవాద సమాజాన్ని స్థాపించుటకు ప్రజల నెట్లుచైతన్యవంతులను చేయాలోకూడ స్పష్టంగా

పాత్రలముఖమున చెప్పబడింది. "కర్మా! కర్మ! ఈ కర్మఅను మాట ధనవంతులు ధనహీనులను దోచుకొనుటకు కల్పించిన పన్నాగము." ... — ఈ నాటకం చదువదగింది,

ప్రదర్శింపదగింగని మాయుద్దేశము:—మాతృభూమి.

(4) చలోఢిల్లీ:-(బోసుచరిత్ర, ఎన్నికల ప్రణాళికలబుర్రకథ.) 0-8-0

(5) జయభేరి;— (జాతీయములగు ఖండకృతుల సంపుటి) 1-0-0

నిర్మాణ కార్యక్రమముపై జన్మభూమిపై దేశభక్తులపై వ్రాయబడిన పద్యరత్నములెన్నియో ఇందుగలవు. ఉపన్యాసకులు, హరికథకులు విద్యార్థులు దేశభక్తులు కంఠస్థము చేయవలసినవి. విశాలాంధ్ర మందంతటను వ్యాప్తిలో నున్నపద్యములు.

(6) వైతాళికులు:—(జాతీయనాయకుల జీవితచరితము 0-12-0

(7) ఆచార్యరంగా;—(జీవితచరిత్ర) 0-6-0

పద్యంబు నడకనుబరికించి చూతు మా
హృద్యమైమించునుగద్యరచన
గద్యంబు బిగువునుగాలించిచూతుమా
హృద్యమై మించును బద్యవితతిఁ
బద్య గద్యంబులభావించిచూతుమా
భావంబు లొండొంటఁ బరువులెత్తు
భావంబు లోకమాఱు పనిగొనిచూతుమా
శైలితనంతనే సాగిచనును
శైలి నొకసారి చూతుమా సకలరసము
లుప్పతిల్లుచునుండును గుప్పలుగను
అవుర ; నరస సుబ్రహ్మణ్య కవులకలము
దేశభక్తిని జాటుచుఁదేజరిల్లు ! !

కవిరాజు, పండిత, పెనుమెచ్చ సత్యనారాయణరాజు.

---

( అమ్మువారికి మంచి కమీషను ఇవ్వబడును. )

## జాస్తివారి - రచనలు చిలకలూరిపేట, (గుంటూరుజిల్లా.)

ఖండకృతి [సాంఘిక, ఆర్థిక సమతాబోధకము] 0–12–0

"ప్రతిష్ఠగల కవులుగ శ్రీ జాస్తి వేంకట నరసయ్యగారు, తెలుంగులకు చిరపరిచితులు, మృదు మధురమైన భాషలో జాలువారు తీయ తెనుగు పద్యావళిలో హీనులదీనుల, బాధితుల ఆక్రందనలు చిత్రించే రసహృదయులు. ప్రతిపద్యము మననము చేసికొనుటకు, శాశ్వతముగ పాడుకొనుటకు తగియున్నది. ప్రతి యాంధ్రుడు చదువదగిన గ్రంథము." —ప్ర జా మ త.

వ్యాసవాణి [అపూర్వరచన. అవశ్యపాఠ్యము.] 0–6–0

'ఆంధ్రభాషలో పలువిధములైన విషయాలు తెలుసుకొనేందుకు వ్యాసములు చాలాఅవసరం. అలా యెవరు వ్రాసి అచ్చయినవి విపులంగాకనపడవు. వీరేశలింగముగారి రచనలలో కొన్నిఉన్నా,అవి ఉపన్యాసాల త్రోవలో ఉన్నాయిగాని విద్యార్థులకు ఉపయోగించేవిగాలేవు, ఆ వెల్తిని శ్రీ వేంకట నరసయ్యగారు కొంత తీర్చారీ గ్రంథంతో. ఇందులో సాహిత్యము, కళారాధన, సంస్కృతి, లలితకళలు, గేయకవిత, కవి, కర్మయోగి పఠనమందిర గ్రంథాలయ లాభములు, చిత్రశిల్పములు అనే శీర్షికలతోతొమ్మిదివ్యాసాలు ఉన్నాయి. ఇవి అన్నీ అందరికీ ఉపయోగించడం అల్లా ఉండగా విద్యార్థులకు బాగా ఉపయోగిస్తాయి. —ఆంధ్రపత్రిక.

కవిత; (ప్రసిద్ధాంధ్రకవి పద్యగేయ రత్నాలు. సంపాదన)0-8-0

నవగీతాలు; (జాతీయగేయములు. కంఠస్థము చేయదగినవి) 0—3—0

వయోజనవిద్య : (పెద్దలవిద్దెకు తద్దయు తోడ్పడు జాతీయరచన,0–4–0

ఆంధ్రసేవ : (మాతృభూసేవచే మాన్యులగు ఆంధ్రుల జీవితాలు) 1–0–0

వ్యాసవాణి : (రెండవభాగము, వివిధ వ్యాసవిలసితము) 0–6–0

## ధూళిపాళ వారి రచనలు:—

చిలకలూరిపేట, గుంటూరుజిల్లా.

**వెన్నెలకుప్పలు** (ఖండకృతి) 0—8—0

**వివిధ** శీర్షికలతో వెలసిన పద్యాలుగల చిన్న ఖండ కావ్యం మంచిభావాలు, మృదుమధురమైన పదాలూగలిగి సర్వ జనసామాన్యమైన ఛందస్సులోనే నడచిన పద్యాలతో రచన ముచ్చటగా ఉంది. సొట్టనడకలేకుండా, పద్యగమనం బాగుంది.

'కోటప్పకొండ' శివప్రభావద్యోతకంగా, సహజభావ రమణీయతా ప్రదర్శకంగా ఉంది. 'చంద్రా' అనే శీర్షికలో చంద్రుణ్ణిగూర్చి వర్ణించిన పద్యాలు హృద్యాలుగా ఉన్నాయి.

'కవి' అనేశీర్షికలో వెలసిన పద్యాలు చిత్రకారుడికంటె కవిగొప్పవాడు అనే ఉద్దేశాన్ని నిరూపిస్తూ సోపపత్తికంగా ఉన్నాయి.

సుభాషిణి—శీర్షికలోఉన్న పద్యాలు ఒక మూగపిల్ల పెండ్లినిగూర్చి వ్రాసినవి. చాలతమాషాఅయినకథ. చెప్ప కుండానవ్వించాయి. [ఆంధ్రపత్రిక]

**అహల్య:** (ప్రదర్శనయోగ్యమగు పౌరాణిక నాటకము) 0—12—0

**విశ్వనాథశతకము:** (అమూల్యము)

**సాయిబాబా:** (హరికథ) 0—6—0

**బాలరామాయణ శతకము:** (బాలురు కంఠస్థము చేయదగుపద్యాలు) 0—4—0

**విజయవ్యాసాలు:** (విద్యార్థులకు మిక్కిలి సహాయపడును) 0—8—0

**జయసుధ:** (భారతనాయకులు జరిపిన సత్యాగ్రహముల చరిత్ర) 1—0—0

---

**పుస్తకాలకు:**— 1 రచయితలు.

2. వేంకట్రామా అండ్ కో., విజయవాడ—1